క. ఓరువఁజాలక వెతపడు । నారిగదా, యనకకలని - నాదంబులచేఁ
గారించుట గారమెసఁగ । కారములఁ జిగుళ్లుదినిన - గర్వమె? పికమా! 184

క. సుగుణంబులుదుర్గుణములు । జగతిని సహవాసమునఁబొ - సఁగునండ్రిపుడె
చ్చగు శుకపికముల చెలిమిం । దగిలెనె చెడుబుద్ధినీకుఁ - దప్పకబర్హీ! 185

మ. విరహోగ్రాగ్ని శిఖాపరంపరలనా - విర్భూతమైనట్టి దు
స్తరసంతాపము మించికుందుతఱిఁ జెం - తంజేరినీవారినె
ల్లరినింగూడి మదంబుమీఱఁగడుసు - ల్లాసంబుతోనిట్లు ని
ర్భరఝుంకార వికారగానమొనరిం - పంబాడియే? షట్పదా! 186

వ. అనితూలనాడి యాయెమ్మెలాఁడి మెల్ల మెల్లఁగాఁజను నవసరంబున. 187

చ. ఒకవకుళద్రుమూలమున - కొయ్యనఁబోయి తదీయశాఖనూ
నికఁగొనియట్టె కొంతవడి - నిస్పృహవోఁచిన నిల్చె; నంతలో
నికటనికుంజపుష్పచయ - నిర్గతగంధయుతానిలంబటన్
సకిపయివీఁచె మోహశిఖిఁ - జక్కరగుల్కొలిపెన్ మరుండనన్. 188

ఉ. హల్లకపాణిమీఁద నపు - డాపవనాహతిచేతనింపుగా
జల్లునరాలె నవ్వకుళ - సత్ప్రసవవ్రజమక్కటా! మరుం
డెల్లదెవచ్చె నేసెకుసు - మాంబకముల్ పయినంచువిభ్రమన్
దల్లడమంది మూర్ఛిలెని - తంబిని చయ్యనఁబట్టిరంగనల్. 189

గీ. పట్టియింకెట్టులమ్మ యీ - చెట్టుచెంత । కేలవచ్చితి మెట్టిదు - ష్కాలమొకొ
వ్యసనమెఱుఁగని దెపుడునీ - పసరుమొగ్గ । కెంతకష్టంబు వాటిల్లె-నింతలోన. 190

క. అనిదైన్యంబును వెఱియున్ । గనికరమును చింతయడరఁ - గాఁబలుకుచునే
ర్చిన యుపచారంబులఁజ । య్యనఁజేయఁగఁ గొంతవడికి - నంగనతేఱెన్. 191

ఉ. ఆవడియయ్యె నీవనవి - హారసుఖంబిఁకఁ జాలుఁజాలునో
రా! విరహానలంబునఁగ - రంబుఁ గఱంగెనుబోలతాంగియి
చ్చోవలవంతమించుఁ జెడు - చోటిదియుండఁగరాదు పోదమం
చావిరిబోణులప్పుడు ర - యంబున రానుతఁగూడిపోవఁగన్. 192

క. ఇరువంకల నెచ్చెలులా । దరమునఁ జేయూఁతయొసఁగఁ - దరళాక్షిమద
ద్విరదగతి నున్నతములగు । మురువుపిఱుందులు చలింప - మోముచమర్పన్. 193

క. తాలిమిచెడివగ మీఱఁగఁ । బాలార్చకఁగూర్మిచెలులు - వలుకుహితోక్తుల్
చాలవెగటైన వినకొక । లీలందనమేడకరిగె - లేమవిరక్తిన్. 194

వ. ఇట్లుప్పల్లవాధరయుల్లంబుతల్లడిల్ల మెల్లననిజమందిరంబుజేరుటయు. 195

సూర్యాస్తమాన వర్ణనము.

ఆ. వనితపద్మవదన - వారిజాప్తుఁడుతాను । గానతోడునుకొంత - గలుగుకతన
నడలుఁజూడలేక - యరిగెమాటునకన । నపరవార్ధిగ్రుంకె - నపుడుతరణి. 196

సీ. అంతసంధ్యారాగ - కాంతులుసమకూరె - నమరఁబక్షులుకులా - యములఁజేరెఁ
గలువలకధికవి - కాసంబునిండారె-నీరజాతంబుల - సౌరుమాసెఁ
జక్రవాకములకుఁ - జాలఁగావగఁగూరె-గృహదీపకళికల - కాంతిమీరెఁ
దార్కొన్నజంతుసం - తతులతాపముతీరె-వెసఁజీకటులుగుహ - ల్వెడలఁబారె

గీ. జారచోరుల వెఱయువి - చారమారె । నులుకుచాతకవితతులు - కలఁకఁదేరెఁ
గాముకులమానసంబులఁ - గాంక్షలూరెఁ । బంచబాణుఁడు పాంథులఁ-గాంచిసేరె. 197

గీ. అంధకారాంబు పరిపూర్ణ - మైనయట్టి । వ్యోమకాసారమునఁబూచి-యొప్పుతెల్ల
గలువలననంబరమున న-క్షత్రసమితి । పొలిచెనంతట నెంతయు-పొలుపుమీఱ. 198

గీ. విరహిణీస్త్రీలు రాతిరి - వేళమరుని । మ్రొక్కుఁదీర్చుటకై వన - మునకుఁదరలి
పరగఁగొనిపోవు పిండిదీ-పములనంగ । మిడుఁగురులు మంజరులమీఁద-మెఱయఁదొడఁగె.

చ. బలిమిఁబరాంగనామణుల పైఁ - బడిదుష్టులుమోవి తేనియల్
దొలఁగకఁగ్రోలి నారనెడు - దోషముఁబూనిచి రాజశిక్షగా
శిలుగుపడంగనొక్క నిశి - చీకటియింట వసింపఁజేసెనా
నళితతిచిక్కఁజేరిమధు - వానుచుఁబంకరుహోదరంబులన్. 200

ఉ. రాజిటు రాగలండనుచు - రాతిరిపేరిటి నేస్తకాఁడుదా
రాజిలఁజాల నెత్తయిన - రమ్యపుఁబందిరివెట్టిదానికిన్
బాజుగనంధకారమను - నల్లనియుల్లడఁగట్టివెండిపూ
లోజఁదగిల్చికుట్టెనన - నుప్పరమొప్పెనుడుప్రయుక్తమై. 201

వ. అంత. 202

చంద్రోదయ వర్ణనము.

గీ. చంద్రుఁడుదయించు సమయమా-సన్నమైన । తూర్పుదిక్కునఁ బాండుర-ద్యుతిజనించి
యంతకంతకునది యపు-డతిశయించె । గర్భవతియగుయువతి ము-ఖంబువోలె. 203

మ. సిరితోఁబుట్టువు కైరవప్రియుఁడు రా-జీవారి శీతాంశుఁడీ
శ్వరుమౌళిం జెలువొందుపుష్పము సుప - ర్వశ్రేణికింగూడు సా
గరసంజాతుఁడు తారకావిభుఁడు లో - కస్తుత్యుఁడబ్జుండు భా
నురలీలంబొడిచెన్ స్వకీయసితరో - చుల్దిక్కులన్బర్వఁగన్. 204

గీ. అతుల చంద్రోదయంబైన - యబ్బురంబు । పొసఁగనంతటఁ బిండారఁ-బోసినటుల
నప్పటప్పటికినిఁ గాంతు - లతిశయించి । వెల్లనైకనుపట్టెను - విశ్వమెల్ల. 205

క. వెలిమించె జారచోరుల । కతిమతిఁ బడఁజొచ్చిరపుడు - హర్షంబతిని
వ్వేఱపడివిరహిణులు కడుం । జాలుకై వెన్నెలలుమీఁద - సోఁకుటకతనన్. 206

క. ఆసమయమున యశోదపతి । వేసటమించిన కతమున - వెలవెలనైయు
ల్లాసంబుడింది యుష్ణో । చ్ఛ్వాసంబులుపొదలఁ గడు వి-షాదాత్మకయై. 207

క. విరిశరములు హృదయంబున । నిరతంబును నాటుచుండ - నివ్వెఱపడియా
సరసీరుహాక్షియతనుని । దురుసునకుంగలఁగియిట్లు-దూషించెఁగడున్. 208

క. అదనారసి పదనారిన । తుదనావిరి పొగలువెడలు - తోయజశరముల్
రెదనాటెదవౌర! మదా । స్పద! నాయమెనీకు దోష-సదనా! మదనా! 209

మ. కరుణాదూరుఁడ వీవుగానవెపుడున్ - గాంతాజనశ్రేణిన
ద్దిర! మోహవ్యథనొందఁజేయుటకు సం-దేహింపవజ్ఞాత్మ! దు
ష్కరకార్యంబిది; చచ్చిపుట్టితివిముక్ - జర్చింపుమీసారియొ
వ్వరిచే నెట్టిదొసంగు చేకుఱునొ గ - ర్వంబేలరా దుర్మతీ! 210

శా. ఘోరప్రక్రియఁగాముకీ హృదయసం - క్షోభావహోపాయసం
చారానర్గళబుద్ధివీడవెపుడున్ - చాల్చాలుఁ బోనాఁడుని
న్నారుద్రుండుదహింప నీతరుణి పు - ణ్యాస్వాంత ప్రార్థించియో
మారా! నిన్బడసెన్ సుమీ! మరల భ - స్మంబౌదువిక్లేఁచినన్ 211

ఉ. ఆర్తజనావనాది సుగు - ణాశ్రయుఁ డెన్నభవద్గురుండు సం
కీర్తితమంగళప్రదగ - ణింపఁగ నీదగుమాత సత్కళా
కర్తదలంప మాతులుఁడు - గౌరవహాని ఘటిల్లనీదు దు
ర్వర్తనచేత వారలక-వశ్యము దౌష్ట్యము మానుమంగజా! 212

ఉ. మోహలతానిబద్ధలగు - ముద్దియలన్ ముదమేదఁబూనిసం
దేహముమాని యెక్కు మొగిఁ-దీవ్రతర ప్రసవాంబకాహతిన్
దాహమునొందఁ జేసెదవు - దర్పక! దుర్బలులందె కాని నీ
సాహసమంధకారి కడ - సాగునె? నీవటు బోవనేర్తువే? 213

మ. ప్రమథాధీశ్వరు ఫాలలోచన మహో - గ్రజ్వాలకీలా సమూ
హమునన్ డింది పునర్భవుండవగుటన్ - హా! తద్గుణంబిట్లునీ
కిమరెన్ గావుననిర్దయన్ సతులఁబు - ష్పాస్త్రోచ్ఛలన్ ముంచెద
క్రమమీకార్యము పంచబాణ! చెడుసం - కల్పంబు నీకేటికిన్. 214

ఉ. అంచితులైన దంపతుల - కాత్మభవుండవటంచు లోకుల
గ్గించెదరంతె కాని పరి - కింపఁగ వారలకీర్తిఁ దప్పవ
ర్తించు ఖలుండవీవు భువి - దేవర పిత్రముపైఁ బిశాచివా
సించిన భంగినీవిధ మి-సీ! నినుమెచ్చఁగరాదు మన్మథా! 215

ఉ. ముత్తెపుపంట విల్లు నళి - మూఁకలనారియుఁ బూవుటమ్ములున్
మెత్తఁగఁబల్కు బంట్లుఁగల - మేనటిపోయినయట్టి యోధుఁడీ
చిత్తజుఁడేమి సేయుననీ - చెప్పఁగరాదధికంబునుమ్మ నీ
యొత్తడిసైఁపరాదు విష - మూరకఁబోవునె సుంతయైనచోన్? 216

క. వలదన్న నబలనగున । న్నలమటఁ బెట్టెదవుతగునె?- యకటా! నాపైఁ
జలమేల విరహిణీజన । ములనేఁచినఁ గిల్బిషంబు-పొసఁగదె? కామా! 217

వ. అని దూరనాడి యామించుఁబోఁడి మిగులవేఁడియైతోఁచు సాంద్రచంద్రికలఁగలయ
వెదజల్లుచుంగుముదంబులకుఁ బ్రమదంబొదవనుదయించిచనుదెంచుతుషారకిరణునింగాంచి
సంచలించి మించినతాపంబునఁ గోపంబువహించి యిట్లనియె. 218

ఉ. ఓరి! శశాంక! సంకటము - నొందు మహావిరహార్తలైనపం
కేరుహపత్రలోచనలు - ఖేదమునం దపియింపఁగౌముదీ
ఘోరతరాగ్నికీలలను - గొబ్బునఁబైఁ బ్రసరింపఁజేసెదౌ
రౌర! యిదేమి గొప్పతన - మంచుఁదలంచితి వక్కటక్కటా! 219

ఆ. చందమామనీదు - చందమామరునిపెం । పెఱుఁగనట్టివార - లెందుగలరు?
గోని పూవుదనులకుఁ - గులవేల్పువగుదీవు । కామినీజనాప - కారియతఁడు. 220

శా. నీవబ్ధిన్ జనియించువేళ బడబా - గ్నిజ్వాలికామాలికో
ష్ణావాప్తిన్ జెడఁగాలవైతివదియే - యాశ్చర్యమెన్నంగ; రా
జీవామిత్ర! యటంజనించిన సుధా - సిద్ధప్రభావంబదే
మో! వహ్న్యాత్మజుమిమంచికాలమునబా - ముల్వోయి నాటెల్లినన్. 221

గీ. ఆడువారల విరహామహాబ్ధినోల । లాడువారలఁ గ్రాగింపఁ - గూడదనక
వేఁడివెన్నెలలనుగాసి - వెతలుగుడుపు । వాఁడవాలింతువేహెూత - వాడసోమ! 222

ఉ. ఈహాజనించి మ్రింగుటకు - నేర్తైవచ్చినవేళఁ దాగురు
ద్రోహియితండు వీనిఁదిన - దోసమటంచుఁ దలంగిపోవుచో
రాహువుఘోరదంతనిక - రక్షతదేహునిఁజేసి పెంపును
త్సాహము మాన్పుచుండినను - ధౌష్ట్యము మానవుగాసుధాకరా! 223

వ. అని చందమామను నిందించి మందానిలునుద్దేశించి యిట్లనియె. 224

మ. ప్రసవామోద పరంపరావహుఁడవై - వ్యాపించు నీవిప్పుడీ
యసమాస్త్రాంబక సంభవానలమహో - ష్ణాపాదనోద్యోగివై
ప్రసరింపందలకొంటి వాగ! నినుసం - భావింపఁగారాదునా
దెసకున్ వీవకుమింకఁ జాలుఁ గడుఁ గం - దెన్ మేను మందానిలా! 225

ఉ. రూపవిహీనునిం గొలువ - రూపవిహీనుఁడ నేర్చుఁగాని యె
ట్లోపుదురన్యు? లాపమని - యోగ్యతకుం దగువాఁడవెన్న నీ
వ్యాపనచాలుమాను ముగ - గాశనశేషముగానసేర్తు సం
తాపము నొందజేసెదవు - తద్వపనుర్గుణసిద్ధినాశుగా! 226

మ. అనిమారాబ్జ సమీరులం దెగడి దై-న్యంబొప్పనంతంతకున్
దనలోమించు మనోవ్యథానలము సం - తాపంబుఁజేకూర్పఁ దే
దనకున్ సైఁపఁగలేక దానపుడుక - ర్తవ్యంబు యోజించి యి
ట్లని నిర్ధారణసేయనేరక కటా! - యంచార్తి నర్థిల్లఁగన్. 227

సీ. మెప్పుగాఁబనులలో - మెలఁగెడియుడిగంపు - టింతులనందఱ - నిండ్లకనిచి
హేవాక మొప్పఁగా - హితవాక్యములువల్కు - లలనలతోడస - ల్లాపముడిగి
వీణియల్ మీటుచు - వేడ్క గానముసేయు - పొలఁతులమన్నించు - బుద్ధిమాని
కడుభక్తిఁదనమాటఁ - గాచి చెంగటనుండు - వనితలనిఁకజనుం - డనుచువలికి

గీ. మన్ననకు నర్హలైన కో-మలులు దెలుపు । కొనెడి మనవులఁ జెవియొగ్గి-వినుటమాని
యన్నపానాదులప్రియం-బగుటవాని । విడిచి కైసేయుటుడిగి ని-ర్వృతిని మఱచి. 228

చ. జిగిఁగడుమించు బంగరపుఁ - జిల్కలుచెక్కిన జీవదంతపుం
బిగువగు కోళ్లపై మణులు - విప్పుగఁదాఁపిన సాలభంజికల్
దగపగడాల పట్టెలకుఁ - దార్చిన పూసమెఱుంగుకుచ్చులన్
మిగులసహించు శయ్యపయి - మేనటువైచి లతాంగి వేదనన్. 229

క. పారముఁగానకఁ దోలఁగని । ఘోరవికారంబు మించి - కుందుచు నిజహృ
చ్చోరుని దలఁచుచు మారుని । క్రూరత్వంబునకు వెఱపుఁ - గొని పొరలుతఱిన్. 230

మ. ప్రమదం బేదియు నిర్నిమిత్తముగ సం - ప్రాప్తించి యున్నట్టిహా
రముఁ గంఠంబుననుండి చేతఁగొనిగా - రా మెప్పఁజిత్తేశుసం
గమభాగ్యంబు ఘటిల్లినట్లపుడు సం - కల్పించి వర్ణించి వి
భ్రమమాటంతనె యాత్మలో నెఱిఁగి యా-హా! యంచు దైన్యంబునన్. 231

క. ఆహారముఁ గనియిట్లను । నాహా! రమణీయరత్న హారమ! నేని
ట్లాహారనిద్రలుడిగి మ । నోహరునిఁ గానకళయ - నుడువఁగరాదే? 232

ఉ. గ్రీవమునందునన్ నిమన - రించి ప్రసంగనుగ్రహాలాపకే
పావిరతప్రమోద విభ - వాతిశయస్థితి నాదరించునీ
భావజతుల్యుఁడైన పతిఁ - బాసియుటన్ ననుజేరటొప్పునే?
నీవళిమా! నచింపుమిఁక - నిక్కముగా నతఁడెవ్వఁడౌటయున్. 233

క. అనియామణి హార మచే । తనవస్తునటంచు మదినిఁ - దలఁపక యెంతో
వినయమున వేడుచుండఁగ । మనసిజుఁడై దమ్ముఁ లేసి - మ్రాన్పడఁజేసెన్. 234

వ. ఈప్రకారంబున నాచిలుకలకొలికి యలనువిల్తుని యలుగులకులుకుచు, నిలుపోపక భ్రమసి కలవరించుచు, నిమిషంబొకయుగంబుగాఁ గడపుచుండెనని చెప్పుటయును. 235

శా. క్షీరాంభోనిధి పుత్త్రికాహృదయ రా - జీవాగ్ర్య ! గీర్వాణ మా
రారి శ్వేతగరుత్తురంగనుత ! మా - యాయోగసంయోగ ! వి
స్ఫారస్వాంత ! యనంత ! వారిజనరా - ట్సంతాన సంతాన ! సం
సారక్లేశ వినాశ ! కిల్బిషతమ - స్సారంగ ! సారంగదా ! 236

క. ధరణీధరధర ! ధరణీ । భరణ ! గుణాభరణ ! నిత్య ! - పావనగుణనా
నగ ! భవాంబుధితరణా ! । శరణాగతపాల ! ఘోర - సంకటహరణా ! 237

మత్తకోకిలావృత్తము.

పుండరీకవి శుద్ధమానస - పుండరీకగిరాంకరా !
పుండరీకహరా ! ద్విషన్మృగ - పుండరీక ! గదాధరా !
కాండవాహవి నీలవిగ్రహ ! కాండసంభవ ! పావనా !
కాండదూర ! నిగంబనా ! సుర - కాండసేవ్య ! సరావనా ! 238

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర పాదప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహత్త్వ విభి
రామ, భూసురకుల క్షీరపారావారపూర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబున ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము



### తృతీయాశ్వాసము.

క. శ్రీకర! సద్గుణగణర | త్నాకర! కరుణావిశాల! - యజ్ఞారిహరా!
భీకరరిపుహర! భక్తవ | శీకర! శేషాద్రివాస! - సిద్ధవిలాసా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాకలాం గసూతుండగు సూతుండిట్లనియె. నట్లు యశోవతినిశాపతిముఖ్యులనిందించుచుఁ బరితపించుచు మహాప్రయాసంబున నారేయిఁగడపి మరునాటియుదయంబున నరుసంబుడిగిబర వసంబులేనితలంపులకుంజొచ్చి వెచ్చనూర్చుచుహర్మ్యపరిభాగంబునకుంజనియొంటరిగా నటునిటుందిరుగుచుండె నాసమయంబున. 2

క. అణిమాదిసిద్ధులొప్పఁగ | మణిమంత్రౌషధము లెఱిఁగి - మలయుమహాత్మం
డెనఁగుండొక సిద్ధుఁడుపైఁ | జనువాఁడావేళవిమోఁదఁ - జయ్యనడిగియె౯. 3

చ. అటుడిగి ముందునిల్చుటయు-నబ్బరమంది లతాంగిచెచ్చెర౯
దిటవుగ మ్రొక్కి పెనిమిడి - తృప్తివెయిఁదగఁ బూజఁజేసియం
తటనొక తాళవృంతమును - దానుముదంబునఁగేలఁబూనిచెం
గటనొకయోరనిల్చి కర-కంకణములమ్రోయంగవీవఁగ౯. 4

క. ఆసన్నగాలిదేహము | పై సోఁకిన శాంతినొంది - పరిహృతమార్గా
యాసుండై సంతసమున | నాసిద్ధుఁడుమెచ్చి యిట్లు - లనియె౯ బ్రీతి౯. 5

క. ఓరాజవదన నీదగు | యోరిమియును భక్తిశక్తి - యోగ్యతయును నిం
కేరికిని నెందుఁగలుగదు | కోరినకోరికలు నీకుఁ-గొనసాగుఁజుమీ! 6

మ. ఇదివాంఛాఫలదాయకంబనఁబడు౯ - హృష్టిప్రదంబంచుఁజె
ప్పదురాధిక్యముగాఁగ దీనినొగిబా - మల్కాన్నపద్మాద్దిసం
పదనింపొందఁగఁజేయు సౌఖ్యమొసఁగు౯ - భాగ్యంబుఁగల్గించునే
కొదవల్ జేకుఁజేయున్నఁ దీర్చుఁగొను మో-కుంభీంద్రకుంభస్తనీ. 7

క. ఇది యనియొకమణి నతినకుఁ । బదిలంబుగఁ జేనొసంగి - పసగుసుమంబుల్
వదలకుము గీనినసుటయును । నదిగొని కడుభక్తినింత - యపుడిట్లనియెన్. 8

మ. ఓసిద్ధేశ్వర మీరు సన్నుతగుణా - ధ్యుల్ యోగవిద్యామహో
ల్లాసాధారమనీషు లుత్తములు పో - లంజాలరెవ్వారు మి
మ్మాసక్తిన్ మిమువంటి పావనులపా - దాంభోజముల్గొల్చి పు
ణ్యాసంబొప్పఁగ భక్తిమైమనుటయే - సౌఖ్యంబు మాబోంట్లకున్. 9

క. తొలిబాముననేఁజేసిన । పొలిపోనియ నూనమైన - పుణ్యముకతనన్
వలఁపనితలఁపుగ మిముఁగని । సెలయఁగఁ బూజింపఁగలిగె - విరిసొనంబుల్. 10

చ. అనువుగ మిమ్ముఁబోఁటుల మహాత్త్వము నేవినియుందుఁ జెప్పఁగా
ఘనులటసిద్ధులెంతయును - గైనవ ఘనటవారికీజగం
బనఘ! దలంచుచుంటిమది - యందెపుడైనను సట్టివారి ద
ర్శనము లభించునోయనుచు; - సత్యము నేటికిసాంఘసేకుతెన్. 11

వ. అనిపలికియతనినలసఁ దనపరితాపానోదనోపాయం బెఱుఁగఁదలంచి యోజించి యట్టి మాటఁబ్రస్తావించుటకుం దెంపుసాలక యానీలాలకప్రసంగవశంబునఁ దేటపరచుట యుక్తంబని నిశ్చయించి మాటలకుపందార్చి సిద్ధునితో నిట్లనియె. 12

క. వినవలతును మీచరితలఁ । గనవలతును మిమ్మునంట - ఘనులనుభక్తిన్
మనవలతు మాటమీసే । వనమే ముఖ్యంబటంచు-భావింతుమనెన్. 13

క. ఏయేభూములు జూచితి । రేయేపురములనుగంటి - రేయేగిరులం
దేయే కానలు మెట్టితి । రేయెడ నేమేమినింత - లెఱిఁగింపఁగదే! 14

మ అనిప్రార్థించిన సిద్ధుఁడిట్లనియెః శ్రీ-లా! మేముమాకిచ్ఛగ
ల్గినయప్డెచ్చటికేఁబోయి రాఁగలము సం - క్షేపించి యిట్లేచుఁగాం
చినవింతల్ విహరించినట్టి యవెవు - ల్సీమల్గిరుల్వ్యాపానుల్
వినుపింపందరమా నె? యొక్కటియె ? యావృత్తాంతముల్ జెప్పఁగన్. 15

క. నిమిషమున సంచరింతుము । క్రమముగఁజగ మెల్లఁ గనియుఁ-గల మెల్లని శే
షము లున్నచోటనుండియు । మముఁబోఁట్లు కలుంగరాని - మర్మముగలదే ? 16

చ. అనవుఁడు నోమహాత్మ! యిది - యద్భుతమెంతయు మీప్రభావమున్
దనర నెఱుంగ నాతరమె? - ధన్యులు మీరు కృపన్ వహించి నా
మనమునఁ గల్గు దుఃఖమును - మాన్చఁగఁజేసి సుఖించురీతియో
జనయొనరించిపల్కుఁడప - చారముఁగా మది నెంచకిత్తఱిన్. 17

క. కడుసునులు మీరుమిమ్ము । ట్లడుగఁగఁ దగదైనఁ గొంక - కడిగితివేఁబో
విడిచి; కినుకనువహింపకుఁ । డిడుమతఱిం దెలుపనున్న - నెట్లగుఁజెప్పుఁడా. 18

క. మీవంటివారి నూరక । భావంబున వినుకుఁ జెందఁ - బలికింపఁగ రా
దీవిధి నెటు వెగటగునో । యావలనని పొడముచున్న - దరమరనాలోన్. 19

ఉ. తా మెదనాడు విన్నపముఁ - దప్పగ నెంచక యున్న యున్నమా
టేమది దాచకింక వచి-యించెదనన్న, నతండు నవ్వి నీ
వేమియుఁ గొంకులేకడుగు - వేర్పడఁ జెప్పెద నెగ్గులేదు న
మ్మా! మమువంటివారలకు - మేదినిఁ గోపము నీర్ష్య గల్గునే? 20

క. నేఁడుభవత్సద్గుణములు । పోఁడిమి నెఱుఁగుట నె మిటఁ - బోయెడివాఁడన్
వేఁడక యే వచ్చితివగ । లాఁడిరో నినుఁ జూచిపోవ - నగునని వేడ్కన్. 21

ఉ. ఇంతకుమున్నె నీచరిత - మెల్ల నెఱుంగుదు; నొక్క చూపరిన్
గంతునిఁ బోలు వానిఁ గని - కాంక్ష నహించి, యతండు గానరా
కంతటిలోనె పోవుటయు - నగ్గలపుం దమి సైఁపలేక నీ
వెంతయు నాత్మఁ జింతిలెద - వీనుడి నిక్కము కాదొ తెల్పుమా? 22

క. ఇది యేకద నన్నడుగఁగ । మదినిఁ దలంచినది యింక - మర్మం బేలా?
వదరక వచియింపుము నేఁ । బొదలిన నీచింత మాన్చి - పోయెద నబలా! 23

గీ. అనినఁ దనలోనఁ గలమాట - నతఁ డెఱింగి । పలుకుటకు విస్మయంబంది - పలుకులాఁడి
యాననంబునఁ జిఱునగ - వంకురింప । నపుడు సిగ్గునఁ దలవాంచి - యదియ, యనియె. 24

క. అత్తటి నతఁ డింతిరో! విను । చిత్తంబునఁ గలుగుమాటఁ - జెప్పుట యనఁగిం
చిత్తుమహత్త్వముగాదది । యుత్తములగు సిద్ధులెఱుఁగ - నోపుదు రెపుడున్. 25

వ. అనిన సంతసించి యాచంచలాక్షి యిట్లనియె. మీరసమానయోగవిద్యాప్రభావ సంపన్నులరు. మఱియు మణిమంత్రౌషధంబులఁ గలమహాత్ములరు. త్రికాలవేదులరు. మీకు గోచరింపని వృత్తాంతం బెద్దియుం గలుగదు. కావునఁ గరుణించి యస్మన్మనోహరుం డెవ్వఁడొ యగుటయు, నెచ్చోటనుండుటయు ముహూర్తకాలంబున నతం డిచ్చటికి చనుదెంచి నాచిత్తంబు హరించికొని కానరాకపోవుటకు నిమిత్తం బెయ్యది యైనదియుఁ దెలిపి నాయెడ రువారించి రక్షింపుఁడని ప్రార్థించి యభినవమారుండైన యాసుకుమారుని రూపయౌవన శుభలక్షణవిశేషంబులు లేశంబుగా వర్ణించి చెప్పిన నాలించి శిరఃకంపం బొనర్చుచుండి యంత నాబోటిమాటలు వారించి మోమునఁ జిఱునగ వంకురింప నించుక సేపు యోజించి లపసంతరంబున. 26

క. తనదుకకపాలలోనొ । య్యనహస్తంబునిచి వింత - యైనకరాటం
బునుఁగొని యందలి కాటుకఁ । దనకనులకు రాచికొని య - తఁడు కని యనియెన్. 27

మ. వింటే! యోకనకాంగి! నేనిపుడు మ - ద్విద్యాప్రభావంబుచేఁ
గంటిన్ సర్వము; వాఁడె నీదగు మనః-కాంతుండు నీపైఁ దమిన్

క. తిలకింతు రంజనముచేఁ । బలుకులు మీకెటులవినఁగఁ - బడెననెదేమో
చెలువరో! యిదియెవ్వరిక । న్నులకున్ రాచినను నుడివినన్ గాన్పించున్. 37

చ. అదియటులుండనిమ్మతని - యద్భుతమౌ కథవిన్నయట్టి వా
రదికలయంచు పల్కిపరి - హాసముఁజేసిరికాని వారలా
యొదవినలాగుఁ దామెఱుఁగ - రొక్కరుసుం గని నంతఁజెప్పితిం
కెదితెలియంగ నన్నడుగ - నెంచితివో వివరింపుమయ్యనన్. 38

గీ. తడవుసేయకు పోవలె - నుడువుమన్నఁ । బటికిసిద్ధుండు పల్కెన - పలుకులాత్మ
నెంచియడుగఁగాఁ దగినదా-హించిమంచి! ప్రైసవచియింపుఁ డొకవిషయముమహాత్మ!

క. ఇపుడారాజకుమారుఁడు । స్వపురంబుననుంటఁగాంచి - వలికితిరిగదా!
విపరీతమైన యాఘో । హపువెతఁగొని యెటువసించు - నదియుంజెపుఁడా! 40

క. పలుమారు మిమ్ము నడుగుట । వలనమదిన్వ్యసనకుఁజెంద - వలదనఘాత్మా!
తెలిసినవారలు గావునఁ । గలతెఱఁగెఱిగింతురనెడి - కాంక్షనడిగితిన్. 41

క. నాయందుఁగరుణనొక్కిం । తాయాసంబైననోర్చి - యాగాములుబ
ర్యాయముగఁ దెలిపినదికా । ప్యాయముఁగలిగింపుఁడింక-నడుగనటనిన్. 42

క. వినుమెన్నిమారులడిగినఁ । గనలొందక సంతసమునఁ - గనుఁగొనినీకున్
వినుపింతు సంశయింపకు । మనిసిద్ధుఁడు మరలఁగాంచి - యపుడిట్లనియెన్. 43

క. ఎనలేనివిరహతాపం । బునకున్ బాలై విచిత్ర - ముగ నల్లదిగో!
మనుజేశ్వర నందనుఁడుప । వనమునఁ గడునలయుచున్న - వాఁడులతాంగీ! 44

సీ. విరిశయ్యపైఁబండి - వేదనమించినఁ - జిగురాకుపాన్పుపైఁ - జేర్చు మేనుఁ
జిగురాకుపానుపు - సెగఁజెందివాడిన - మదినైఁపలేకపూఁ - బొదలదూఱుఁ
బొదలయందునవెట్ట - పొడమినవెగటొంది - పన్నీటికొలఁకుల - పజ్జకేఁగుఁ
బన్నీటికొలఁకుల - పైగాలికడువేంద్ర - మైనతరుచ్ఛాయ - లాశ్రయించు
గీ. చెలఁగిచెంగటఁ బలుకుపక్షులరవములు । పరుషముగఁదోఁచి దవ్వుగాఁ - బాఱఁదోలు
నతఁడుపడుచున్న వెతఁగని - నట్టులైనఁ । గఠినచిత్తునిమదియును - గరఁగుఁజుమ్ము. 45

క. చూడఁగరాదావెతనో । రాడదు నీతోడవలుక - నతఁడచ్చోటం
జేడెరో! నీవిచ్చోటను । వీడనికష్టంబునను భవించెద రకటా! 46

క. శ్రీపురమను నదియెచ్చట । నీపట్టిచ్చోటయిపుడు - నీకునతనికిన్
బాపపువిధి యీవిధిసం । తాపముఁ గలిగించెనమ్మ - తామరసాక్షీ! 47

క. అనిచెప్పిసిద్ధుఁడాదెసఁ । గనుటను జాలించిలేచి - కాంతామణి! నేఁ
జనియెదనిఁకనిటఁదడవా । యెను సుమ్మనుచరులఁజేర - నేగఁగవలయున్. 48

క. వేదనమించెను సైపఁగ | రాదిఁక దడ వేలఁ జేర - రమ్మని కడును
న్మాదమునఁ గౌఁగలింపఁగఁ | జేదోయిం జాచెఁ జాన - సిద్ధుఁడు నగియెన్. 62

గీ. నగినవెంట నె తెలివొంది - నానమదిని | గదురనవ్వుచు సిద్ధుని-వదనమరసి
యనఘ! తెలియక నేవల్కి - నట్టివిభ్ర | మోక్తు లివి మీకు వింతయై-యుండుననిన. 63

క. ఔనామించిన విభ్రమ | మేనివవలికించె నిటుల - నెఱుఁగుదుఁ; గంటే!
మానవపతి పుత్త్రుని విన | మేనువచించినది నిక్క - మేనో కాదో. 64

చ. అనవుఁడు మీరు వల్కినది - యంతయు నిక్కము కంటిఁగాదె నే
నును; మిము బోటి పెద్దలు వి-నోదముగానగు నేని గల్లమా
టను వచియించుటున్నె? యక - టా! సుకుమారుఁడు మత్ప్రియుండు మిం
చిన వెతనొంది నాకొఱకుఁ - జింతిలుచుండెడు నేమి సేయుదున్. 65

క. ఎన్నఁడు నాహృదయేశుని | మన్ననఁగని వేడ్కమీఱ - మనియెదనో కో
యన్నన్న యోర్వలేని | ట్లెన్నాళ్లీ మోహవార్ధి - నీదఁగవలెనో. 66

వ. ప్రవర్తిల్లిన యీవృత్తాంతంబిట్టిదని యెఱుంగనేరక వెతపడుచున్న సమయంబున, దైవ ఘటనం జేసి మీరిచ్చోటికి వచ్చుటయు నిక్కమగు వృత్తాంతంబుఁ దెలుపుటయుఁ దటస్థించె. మహాత్మా! మీకరుణావిశేషంబునఁ గదా మదీయ మనోహరునిం గాంచితి; మీరు సర్వజ్ఞులరు.

క. దైవమన నింకనెవ్వరు? | భావింపఁగ మీరనాదు - పాలిటి దేవుం
డీవేళ నన్నుఁ గావం | గా వచ్చితిరిదె నిజంబు - కలుష విదూరా! 68

క. కాంచితి మిము ధన్యత నువ | హించితి రక్షించు భార - మిఁకమీది కటా
క్షించి నను పాలలోనన్ | ముంచిన నటు గాక నీట - ముంచిన నొప్పున్. 69

క. భావింపని నాపాలికి | దేవునివలె వచ్చినేఁడు - తెలియక మిము నే
నేవిషయ మడిగినను మది | నేవపుడకఁ జెప్పినార - లేర్పడననినన్. 70

క. ఆలలన మాటలన్నియు | నాలించుచునుండి సిద్ధుఁ - డంతటిలో నే
మోలాత్రియైనవిషయము | నాలోచనఁ జేసి లేచి - యపుడిట్లనియెన్. 71

క. అడిగిన దెల్లను జెప్పితి | విడువకఁ బరికించి నీకు - విరిబోఁడిరో! నేఁ
డడవాయె వచ్చి యిచటికిఁ | గడువడిఁ బోవలయుఁ గలదు - కర్జము నాకున్. 72

గీ. కరమునీయందు నాకనుగ్రహము గలదు | కానని చ్చెదఁ గొనుమయీ - కరవటంబు
నిందుఁ గలకాటుకొక్కింత-నేత్త్రికనుల | రాచికొని నీప్రియుని రీతిఁ-జూచుకొనుము. 73

క. చెలువరో! విను కావలసిన | కొలదిం గావించి యునుచు - కొననేర్తుము సి
ద్ధులమగుటవలన నీక | జ్జల; మన్యులు సేయలేరు - సత్యము సుమ్మా! 74

ఆ. దీనినెంతయుష్టు - లైనవారికిఁగాని । యొసఁగ మెపుడు నేము - కింతదైన
నేఁడుమదినినాకు - నీయందుఁగలదయ । వలననిచ్చిపోవఁ - దలఁచినాఁడ. 75

ఉ. నావుఁడుగుండె జల్లనఁగ - నాతికడుంగడుభీతినొందియో
పావనమూర్తి ! నన్నిపుడు - పాయనిచింతల పాలుఁజేసి మీ
త్రోవను మీరుబోయెదరె? - యాశిగసర్వ మెఱింగినట్టి వా
రీవిధిఁబల్కరేని యన - నేమిఁకనున్నది యడ్డశక్యమే. 76

గీ. తగశరీర మాద్యంఖలు - ధర్మసాధ । నమ్మనెడు మాటఁదలఁచియో - స్నంగపరుల
కుపకృతినిసేయఁ గాంక్షించు-చుండువారు । మీరువిడిచిన రక్షించు - వారలెవరు? 77

క. ఆశగొనియుంటిహృదయ । క్లేశంబునుమాన్చి నను సు - ఖింపఁగఁజేయం
గాశక్తులు దొరికితిరని; । యాశంసిత మొందఁజేసి - యరుగందగదే. 78

క. మిమునడిగి నంతవట్టును । గ్రమముగ నెఱిఁగించినారు - గద, యిఁకనాలో
నమరినకోరికఁ దెలిపెద । విమలాత్మా ! దానిఁదీర్చి - వెడలిచనుండా ! 79

క. మణిమంత్రౌషధసిద్ధులు । గణుతింపఁగ మీగలెంత - కార్యంబైనన్
క్షణమున సేయఁగనేర్తురు । ప్రణుతించెద మిమ్ముఁజింతఁ - బాపుఁడ ! కూర్మిన్. 80

క. మునుపడఁగాఁ జక్కెరనిడి । తినిపించిన నోటఁజేదుఁ - దినిపించుటయో
ప్పునె? కొంతమేలుగలిగిం । చినవారలు మరలకీడుఁ - జేయకుఁడనఘా ! 81

క. ననునాప్రియుఁ డుండెడిపుర । మునకుం గొంపోయి విడిచి - పొండీవేళన్
కినియకుఁడు మీదయన్సుఖ । మునమనియెద మీకుఁజాలఁ - బుణ్యంబొదవున్. 82

క. ఆలోచింపకుఁ డాతడ । వేలా ? మత్సఖులునత్తు - రిఁకనటుపైనే
మేలొందుటరిదియగు ; నను । కూలంబగు లాగువేగఁ - గొనిచనుఁడనినన్. 83

గీ. ఉలికిసిద్ధుండునగి తల-యూఁచియట్టి । శక్తిమాబోంట్ల కొదవునే-చంద్రవదన !
యనియె; మీరెఱుంగని విద్య-యవనిఁగలదె? । పుణ్యమిదికావుఁడని పదం-బులనుబట్టె.

క. విడువిడు పదములననియా । పడఁతికరద్వయమతండు - పాయంద్రోసెన్
విడిచిననామది తాపం । బుడిపెడి వారెవ్వరనుచు - నుగ్మలివలికెన్. 85

గీ. అంతసామర్థ్యముంగల - యట్టివాఁడఁ । గానటంచెంత చెప్పినఁ - గానిమీప్ర
భావమెఱుఁగుదు నీమాయ - పలుకులేల । ననియెనాకొమ్మ యామాట-కతఁడునగియె.

క. నగికొంత దడవుతనలోఁ । దగువిధియోజించియట్టె - తరళాక్షినెగా
దిగఁజూచి యిచ్చయింపని । వగనూగక యుండిజాలి - నడినవిధమునన్. 87

క. ఆకాయ సిద్ధుఁడతివరో! । నీకోరికనెటులనైన - నెగవేర్చెదనే
శోకింపవలదు నినుఁగన । నాకుంగడు జాలివొడమె - నమ్మితివగుటన్. 88

ఆ. ఎక్కినట్టివాని - కేనుఁగు కుఱచయ । న్నట్టులయ్యెనిప్పు - డబల! చనవు
గాఁగమాటలాడు - కతమునసిద్ధుండ । నైన నేనులోఁకు - వైతినీకు. 89

క. మేమిట్టి పనికిఁబూనుట । నేమమునకు భంగమైన - నీవెతఁగనలే
కేమైన నయ్యెడునుపై । నీమేలొనరించి పోవ - నెంచితిబుద్ధిన్. 90

ఐ. అనిచెప్పిన నతని కయ్యిందువదన యిట్లనియె. 91

క. చేకొని యుపకృతిఁజేసిన । మీకిందున లోపమేల-మేకొనునీమం
బేకరణిం జెడు నయ్యా! వి । వేకింపఁగ; బావినీరు - వెల్లువఁజను నే? 92

గీ. అడ్డిమాటలు వలుకకుఁ - డాసఁ జెంది । యడిగినపు డిష్టమునుదీర్ప - కరుగరాద
టన్న వినిసిద్ధుఁడగునగు - నదియధర్మ । మగుట నే గద యొనరింతు - నంటి నేను. 93

గీ. తొలుతనీకొక్క పద్ధతిఁ - దెలుపవలయు । నందునకు నిచ్చయించిన - సందియంబు
లేకనీప్రియుఁ జేర్చెదఁ - గాకయున్న । నావలనఁగాదు సుమిమత్త - నాగయాన! 94

ఐ. అనిపలికి తత్క్షణంబ లేచిపోయి తానటకరుదెంచునపు డెడగలుగనునిచివచ్చిన యోగాశ్వ
మునుగొనివచ్చిచూపి, లతాంగీ! నేనుదీనిప్రభావంబున నెప్పు డెప్పు డెచ్చ టెచ్చటికిం
బోవఁదలంపుగల్గునో యాయాస్థలంబులకుం ద్రుటికాలంబున ననాయాసంబుగా వియత్ప
థంబునంజని వచ్చుచుండుదు. నిదిమనోవేగగమనశక్తిగలయది. ప్రపంచంబంతయు
నొకముహూర్తకాలంబునఁ జుట్టి తిరిగిరానోపు. నీకభీష్టంబేని నాపిఱుందన దీనిపైనా
రోహించి చనుదెమ్ము. నిమిషంబులోన నీప్రియునిచెంతదిగవిడిచిపోయెద. మావంటి సిద్ధు
లకు యువతుల తను స్పర్శంబుగారాదు సుమీ! యైనను నీపైఁగల ప్రియంబువలన తార
తమ్యంబులు విమర్శించుటకు సమయంబుగాదని యట్టినియమంబు సయితము లెక్క
సేయక నీకుపకారంబుఁజేయ నిశ్చయించితి. నిదియ నీకుం దెలుపవలసిన విషయంబు.
బాగుగాయోజించి యాగాములను నిర్ణయించుకొని శీఘ్రంబుగాఁ నీయభిప్రాయంబుఁ
దెలుపుము. వ్యర్థంబుగ కాలయాపనంబుఁజేయుట ప్రయోజనంబుగాదనుటయు, నతని
కభివందనంబుఁగావించి యామించుబోణి మనంబున ముదంబొదవ నిట్లనియె. 95

మ. ననుమీ రిట్లుడుగంగ నేల? పసిదానన్ మీకుమారాడ నే
ర్తునె? మేలైనను కీడుగల్గినను సం - తోషంబ; మీరెట్లుచె
ప్పినసభ్భంగినొనర్తు; నమ్మితిమిముక్ - విజ్ఞాన సంపూర్ణ! యొ
య్యనఁగొంపోవుఁడ తోఁచరీతినిఁక మీ-యాజ్ఞన్ ప్రవర్తించెదన్. 96

క. పదఁడన వేగిరపడకిపు । డెద బాగుగ నెంచినీ వభీష్టముగలచోఁ
గదలుము లేకుండిన రాఁ । బదరకుమిది సాహసంపుఁబనిశుకవాణీ! 97

క. పసిదానవు యోజించక । దెసదోఁచని వలపుకతనఁ - దెగువకుఁజొరఁగాఁ
బసగాదసమంజసమనఁ । గుసుమసమానాంగి భీతిఁగొనకిట్లనియెన్. 98

చ. వలవదు సంశయింపఁగ నన్నముగల్గదు మీకుదీన న
వ్వల నెట్టులైన నయ్యెడు నృపాలకుమారునిఁ జేర్పఁడాముగిఁకన్
నిలుపఁగఁ జాలఁ జాలఁ గరుణించి సఖీతతిరాకము న్నెపేల్
తలఁపున మీమహత్త్వపుబలంబున వేగొనిపొండునావుఁడున్. 99

గీ. అటుల నీకిచ్ఛయున్న రమ్మనుచుఁ జెప్పి | తోలుతఁ దా సైంధవము నెక్కి - కలుకలాఁడి!
యటుపిఱుందనఁ గూర్చుండుమంటవలదు | తడవు సేయకుమనవుఁడుఁ - దరుణియపుడు. 100

క. సంతసమున ద్వరయునుదన | మంతనమునఁ గదుగశంక - మానిమహాత్మా!
స్వాంతంబున నాపైమీ | కింతటి కృపగలిగెఁ జాల - నిదిమేలనుచున్. 101

సీ. కనిపెంచిదయమీఱ - గారవించుచునుండు - తల్లిదండ్రులమీఁది - తలపువిడిచి
యాప్తులైతనచెంత - ననయంబు మెలఁగెడి - చెలులపైఁగలకూర్మిఁ - ద్రోలఁగఁజేసి
యేవేళఁగనులారఁ - గాంచి లోకించిమ - న్నించుబంధులఁ బాయు - కలచయుడిగి
భయభక్తులెసఁగఁగాఁ - బలుకఁగాచిచరించు - పరిచారికలయందు - భ్రాంతిమాని

గీ. శారికాకీర పంక్తిపై - జాలివీడి | భోగభాగ్యాను భవసక్తి - బుద్ధినడఁచి
రమణిసిద్ధునివెంటఁ గు - రంగమెక్కెఁ | గలుగునే స్వజనప్రీతి - కాముకులకు. 102

వ. అపుడమ్మదనతిని హెచ్చరించి సిద్ధుండు. 103

క. పదిలము పదిలము మగువా! | వదలకు చేపట్టుసైంధ - వం బెగయునిఁకన్
జదలఁ జనునపుడు భీతిలి | కదలకుమీ యొక్క నిమిష - కాలంబనినన్. 104

గీ. కదలకుండెదఁ బదిలంబు - గా మహాత్మ ! | వేగ నెగయింపుఁడనియె నా - నెలఁత ; యతఁడు
శీఘ్రముగ నిప్రియుని చెంతఁ - జేర్తు నిన్నుఁ | గనుము నాశేర్పని త్తఱి - నని వచించి. 105

క. అశ్వగ్రీవముఁ దట్టుచు | విశ్వంభర పాహి వేద - వేద్యనమస్తే
శాశ్వతమునినుత ‘జాపర | మేశ్వర’ యని పలికెఁ దురగ - మెగసెన్ దివికిన్. 106

చ. సరగున నట్లు పైకెగసి - చాగిన దంతటి దవ్వుకానిమే
ల్పురములు బొమ్మరిండ్లుగను - భూధరముల్ చిఱుగుల్లరాళ్లుగన్
శరధులు పిల్లకాలువల - చాడ్పునఁగానలు కూరమళ్లుగా
గరితకు సబ్బురంబొదవఁ - గాఁగనుపట్టె ధరిత్రిఁ జూడఁగన్. 107

ఉ. అంబరగామి సిద్ధునిహయంబు రయంబునఁ బోయిపోయి గో
త్రంబులుఁ గాననంబులు పురంబులుఁ బల్లెలు నిర్గమించి వే
గంబునుమాని భీకరముగాఁగనుపట్టు మహాటవీప్రదే
శంబున నొక్కచోట నిము - సంబున దిగ్గన డిగ్గి నిల్చినన్. 108

క. ఇదియేమి యశ్వదేభువి | కిదిడిగినిల్చినది హేతు - వెయ్యదియొకో? నా
హృదయేశుఁ డున్నచోటికిఁ | గడపోదలఁచితిమి తపయఁ - గాదగునెుటకన్. 109

క. అనుచు యశోవతి యడిగిన । వినిసిద్ధుం డిట్టులనియె - వేగిరపడవ
చ్చునె ? యిచ్చినవారముమఱి । చనకిటఁగాపురముఁజేయఁ - జనుదెంచితిమే ? 110

శా. ఈకాంతారములో సమీపమున స-ర్వేష్టార్థముల్గూర్చు మే
లౌకాళీనిలయంబు రాజిలునొకం - డాయంబపాదాబ్జముల్
మాకుంబూజ్యములౌట నెప్పుడును నీ - మార్గంబునం బోవుచో
జోకంబూజ యొనర్చిగాని చననో - శుభ్రాంశుబింబాననా ! 111

క. అరుదుగ నిచ్చటికిందా । నరుదెంచిన పిదపఁబూజ - యగుదనుకఁ బదం
బరుగదు మాయోగాశ్వము । త్వరచెడి యీకాననమునఁ - ధర్మవ్రాలుక్. 112

క. కావుననిలిచెను పూజం । గావించెద వేగఁదడయఁ - గానేమిటికిన్
బోవుదమటుపై ననిమును । తావార్వము డిగ్గెనతఁడు - తరుణియునుదిగెన్. 113

క. ఇటనుండుమ మేనుపూజిం । చుటకుం బూవులనుదెత్తు - సుదతిరో ! యని తా
నటునుండి చనియెసిద్ధుఁడు । కుటిలాలక యచటనుండెఁ - గొంకుచునొంటిన్. 114

వ. అటుల గొంతతడ వటునిటువిలోకించుచుం గ్రుమ్మరుచుండి యాలతాంగి యట్టి సమ
యంబున. 115

క. అటునికటమ్మోజీభృ । త్తటజోత్కట ఘుభఘుభత్వ-తనజలరావ
స్ఫుటమోద ప్రదనిర్మల । తటినీతట సీమఁగాళి - ధామముఁజూచెన్. 116

గీ. చూచిమందెవ్వరికిఁ దగు-చోటులేక । నీమహాటవి నీగుడి - నేమిగొప్ప
సుకృతమనికట్టిరో యంచుఁ - జోద్యమంది । దానిఁజూడంగవలెనను-తలపుగలిగి. 117

క. అలకాళికాలయంబునఁ । గలుగు విశేషంబులైనఁ - గనుఁగొనియెద నీ
స్థలమున నూరకయుండిన । ఫలమేమని గుడికిఁబోయి - ప్రమదం బెసఁగన్. 118

ఉ. మానినిగాంచె భర్మమణి - మండిత సుందరగోపురాంత సో
పానము వజ్రకల్పితక-వాటసమన్విత రమ్యమార్గసం
తానము వంద్యమాన పరి-ణాహసమున్నత మంటపధ్వజ
స్థానము కాళికాలయము-సన్నిభ శిల్పకళా ప్రధానమున్. 119

ఉ. వింతగుపత్త్రకల్పనకు - వేడుకఁజెంది నుతించిచొచ్చి యా
కాంతహృదీశుఁ గూర్పుమని - కాళికిభక్తినమస్కరించి తా
నంతటనుంగనందలఁచి - యట్టిటుగ్రుమ్మరుచుండ గోపుర
ప్రాంతమునన్ శిలాప్రతిమ - ఫక్కున నత్తటినవ్వె నవ్వినన్. 120

మ. అపుడాశ్చర్యముఁజెందినిల్చి యిదియే-మారావిచిత్రంబు తా
నిపుడేసిద్ధుఁడు పూలుదెత్తునని పో-యెన్ యొంటరిన్నేనుఘో

గపు కాంతార మగమ్యమీస్థలము ని-ర్మానుష్యమైనట్టి దిం
దుపరల్ నవ్వుటవింటినా కనులకెం-దుం గానరారెవ్వరుక్. 121

క. నేనెటులవింటినో భ్రమ । చేనంతియుకాని యెవరు - చేరంగలరి
చ్చోనంచుఁ బలుచుచుండం । గానగియెను బొమ్మమరలఁ - గామినిగనఁగన్. 122

క. ఈరీతి మాటిమాటికి । నూరక నగుచున్నమనెని - యులికియిదేమో
కారణమగు నెఱిఁగెదనని । చేరంగాఁబోయి నవ్వు - చిత్రపుబొమ్మన్. 123

వ. పరీక్షించి యదియొక స్త్రీవిగ్రహంబుగానుండినఁ గొంతవడినిలిచి విలోకించి యప్పుడు నవ్వుటమాని యూరకున్న భయాశ్చర్యమగ్నమానసుఁడై యట్టకేలకు ధైర్యంబవలంబించి దానిని సంబోధించి యిట్లనియె. 124

క. క్షితిలోనెన్నఁడును శిలా । ప్రతిమలునగుటెఱుఁగ; నెవరుఁ - బలుకఁగవినలే
దతులాద్భుతమీకారణ । మతిశయమై యుండుఁబలుకు - మమ్మా! బొమ్మా! 125

క. సురసిద్ధ సాధ్యవిద్యా । ధరకిన్నర గరుడయక్ష - దానవభుజగో
త్పరసాదులందు నీవె । వ్వరవై నను నగుదువేమొ - వచియింపుతగన్. 126

క. నగనేర్చిమాటలాడం । దగుసామర్థ్యంబుగలుగ-దా? కతమేమో
మిగులనవీనంబగు నీ । దగునరితముఁ దెలుపుమీ ద - యంద్వరితముగన్. 127

గీ. సత్యమైనట్టి కఠినపా-షాణవిగ్ర । హంబు కానని నా మది - యందుఁదోఁచె
నేమికారణమొకొ్క నీ - కిట్టిమారు । పాటుసంధిల్లుటకు; తేట-పరుపుమిపుడు. 128

గీ. అనుచుఁబెక్కు విధంబుల-ననవిభుని । పుత్త్రియడుగుటయును రాతి-బొమ్మయప్పుడు
మగల నగిమానిసియుఁబోలె - మాటలాడఁదొడఁగి యిట్లనువినుమమ్మ! - పడఁతినీవు.

క. భావింపఁగ సుఖదుఃఖము । లావహిలుక్ ప్రాణికోటి - కపుడపుడుభువిన్
దైవికముగ; నెదిరైనను । వావిరినది యనుభవింప - వలయుంజామ్మా! 130

ఆ. మేలుగలిగినపుడు - మిగులసంతోషించి । చెట్టబొసఁగువేళఁ - జింతనొందఁ
జనదు విజ్ఞులెఱిఁగి - సమముగాభావింతు । రెపుడుఁగష్టసుఖము-లిందునదన! 131

వ. సమస్తఫలాఫలంబులును, భగవత్సంకల్పసిద్ధంబులై ప్రాపించుంగాని తదన్యం బెద్దియుఁ గలుగనేరదని పెద్దలు సెప్పుదురు. కావున. 132

క. దైవికముగ నివ్విధినా । కీవిపరీతస్వరూప-మేర్పడె నీకున్
నావిధమునసే దుర్దశ । యావహిలెన్గద యటంచు - నవలొందిమదిన్. 133

గీ. ఎంతవారలకైన మ-హీస్థలమున । ధాతలిఖితంబుఁ గడవఁగాఁ - దరముగాదు
గద, యనుట నెంచి నీకష్ట - గతిఁదలంచి । యట్టై నినుజూచినవ్వితి-నమ్మ! నేను. 134

క. ఎచ్చోటనో పుట్టితివిపు । డిచ్చటఁ జూనంగవలసె - నిదినీతలవ్రా
ల్వచ్చెడి కష్టసుఖంబుల । నిచ్చ నెఱుంగంగ శక్య-మే శుకవాణీ ! 135

క. అనవుడుఁ గడునాశ్చర్యం । బును భీతియు బెగ్గలింపఁ - బొలఁతుకతనలో
ననుమాన మెసఁగి బొమ్మన్ । గని దైన్యము వగయుమీఱఁ-గా నిట్లనియెన్. 136

మ. నినుసామాన్యపు విగ్రహంబనుచు ని-ర్ణీతంబుఁ జేయంగ రా
దనురక్తిన్ ననుఁ గావఁగాఁ దలఁచి మా-యారూపముం దాల్చివ
చ్చిన నాపాలిటి వేల్పువౌదువు సుమీ! - సిద్ధాపదేశంబునన్
జనరాహిత్యభయంకరాటవికి వి - స్రంభాత్మనై వచ్చితిన్. 137

ఉ. నీ విటవిగ్రహాకృతిని - నిల్చుటకేమికతంబు? చావునా
కే విధిఁ గల్గు? నవ్విధము - నిత్తఱి నెట్టులెఱింగితీవు? నా
కా వివరంబు నంతయును - నాదర మొప్పఁగఁ జెప్పి కావుమిం
కీవిపినంబులోన నను - నెవ్వరు ప్రోవఁగలారు తెల్పుమా! 138

క. అని వేఁడ, బొమ్మయిట్లను । వనితరో! తద్విధముఁ దెలియఁ - బలికెద వినుమీ
నినుఁ గొనివచ్చిన యాసి । ద్ధుని చే నీకిట్టికీడు - దొరకొను నమ్మా! 139

సీ. వాఁడు మాయాదుస్వ - భావుఁడై కాళికా - దేవినిఁ గూర్చి ను - స్థిరమనస్కుఁ
డై పెక్కునాళ్లు మ - హాఘోరతప మొన - రించిన సాక్షాత్క - రించి దేవి
వేఁడుము వరమన్న - వినుతించి నే నెద్దిఁ - దలఁచిన జేకూఱ - నలఘుశక్తి
గలిగింపుమనుఁడు దా - క్షాయణి యోజించి - యాకోర్కె సిద్ధింప - దడుగ కిపుడు

గీ. ప్రాయ మొదవిన యదియును - బరిణయంబు । గానిదియుఁ జక్కనిదియు నా-మానవేంద్రు
పుత్త్రి నొకదానిఁ దెచ్చి యే-ప్రొద్దు నాకు । బలియొనర్తువో యా నాఁడు-పడయఁగలవు. 140

వ. పొమ్మని యాదేశించి యాదేవి తిరోహితయగుటయుఁ దత్ప్రయత్నంబు సేయ సమకట్టి పట్టువీడక. 141

క. అది మొదల వివాహితయును । సదమలలావణ్యవతియు - జవ్వనియును నై
పొదలు నృపపుత్త్రిఁ గొనిరా । వెదకుచుఁ దిరుగంగఁ దొడఁగె - విశ్వంబెల్లన్. 142

గీ. నేఁడు వాఁ డెట్టిమాయలు - నెఱపెనొక్కొ । నిన్నుఁ గొనివచ్చె బలిపెట్ట - నిశ్చయించి
కొమ్మ! నీస్థితిఁ గని కల - గుట్టెఱింగి । నగితివిధిఁ దప్ప శివునికై - ననుదరంబె? 143

క. మాయలు మందులు మంత్రో । పాయంబులుఁ బెక్కునేర్చుఁ - బాపాత్ముఁడు వాఁ
డాయాసమయమునకుఁ దగ । నేయే క్రియలైనఁ జేయు - నిభరాడ్గమనా! 144

వ. మన మొకరికొకరుపకృతిఁ జేసికొనుటకు సమయంబు తటస్థంబయ్యె నే తద్వృత్తాంతంబు నే నెఱింగి పలుకుటకాశ్చర్యంబుఁ జెందవలదు. మదీయచరిత్రంబు సావధానంబుగా నాక

ర్శించిన యిట్టివిషయంబులు నాకుం దెలియవచ్చుటకుఁ దగుకారణంబును, శిలయైయుండి యుమాటలాడ నేర్చియుండుటకు నిమిత్తంబును, మఱియుం గొన్ని విచిత్రంబులగు విశేషంబులును, నీకు విశదంబులు గాఁగలవు. నీకు నిట్టివృత్తాంతంబుఁ దెలిసికొనుట యావశ్యకంబై యుండుఁ; దత్ప్రయోజనంబుఁ గడపటఁ దెలియవచ్చుఁ గావునఁ దొలుత నస్మత్కథా విధానంబుఁ దేటపడంబలికి పిమ్మట సిద్ధసంకల్ప సంప్రాప్తవిపద్దశానిరోధన ప్రకారంబు వివరించెద. ధర్మస్వరూపుఁడగు పరమేశ్వరుని కృపావిశేషంబున నీకు మేలువాటిల్లఁ గలదు. వేఱొకటి వినుమని శాంతచిత్తం జేసి రాజపుత్త్రికి శిలాప్రతిమ యిట్లనియె. 145

## జటిలోపాఖ్యానము.

సీ. వినుము మున్నొకకాల - మనజటిలుండను-మునివింధ్యపర్వత - మునకుఁ గెలన
నొకకోటకానలో - నురునిష్ఠఁ గూర్చుండి - విసువకఁ దపముఁ గా - వించుచుండ
నెఱిఁగి గీర్వాణకు-లేశ్వరుం డతని మ-హత్త్వంబునకు వెఱ-గందిచాల
యోజించి యచ్చర - యువతీమణులలోన - సౌందర్యచాతుర్య - శక్తిమించు
గీ. హేమ యనుదానిఁ జీరి మ - హీస్థలమున | కేఁగి జటిలుని తపముని-వెవ్విధమున
నైన భంగంబుఁ జేసి ర-మ్మరుగుమనిన | నతివ యదివిని గుండె జ-ల్లనఁగ నులికి. 146

ఉ. జడిసిన నంగలేసనిన - శక్రుఁడు దిట్టును బోదునేని నేఁ
జెడుట నిజంబు తాపసుని - చే, నిపుడిందున కేమి సేయుదున్
గొడవ జనించెఁ బో 'వెనుక - కుంజర మున్నను ముందు రేఁగఁగాఁ
బొడుచు'నటన్న చందమిది - పోయినఁ బోవక యున్నఁ గీడగున్. 147

చ. చలమున మానిదిట్టినను - శక్రుఁడు దిట్టిన నెట్టులైన నద
త్ఫలమునుఁ జెందఁ గాఁదగిన - దాననుసే నయితిందలంపఁగా
ములునరటాకులాగొదవె - మోసము వచ్చెను దోఁచ దేమియున్
గొలఁదులె నిర్దయామతులఁ - గొల్చెడివారికిఁ గల్గుకష్టముల్. 148

క. అని హేమ వగచి సురవ | ర్యునితోఁ దగమనవిఁ జేసి - యొరులను పనుపం
జనునని యెద, నతఁడటు గా | దనెనా యటమీఁదఁ జూత - మని తలఁచె మదిన్. 149

వ. అనిచెప్పిన నవ్వలివృత్తాంతంబుఁ దెలుపుమని యడుగుటయు. 150

## అశ్వాసాంతము.

ఉ. పాలితనాగ! నాగధర! భక్తసుపర్వవనాగ! నాగరాట్
శూలినరాజరాజనుత! - సూరిజనావన! రాజరాజని
ర్మూలన యోగ! యోగ! భవ - మోచన! సర్వనియోగయోగసం
కీలితరూప రూప! ఖగ - కేతన! నిర్మలరూప! రూపటా! 151

క. రవినిభశోభాభాసుర ! యవిరళభవ్యాప్వభావ ! - యనుభావగుణీ
భవభవన ! భువననుతవై ! భవ ! భవసఖ ! సుభవ ! భావ - భవభావభవా ! 152

ఉత్సాహవృత్తము.

హారిహీరహార ! సార - సాక్ష ! రాక్షసక్షయా !
ధీర ! నీరజారిహస్త ! దేవదేవ ! పావనా !
వీర ! సారభూరిచేల ! - వేదవాదమోద ! ని
ర్భారకార ! సూరితారణా ! ము-కుంద ! నందనందనా ! 153

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్ఘళచతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్రి,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబునఁ దృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వచరిత్రము

## పూర్వభాగము

---

## చతుర్థాశ్వాసము.

క. శ్రీవర్ధన! విబుధార్చిత! । పావనసంకల్ప! సుప్ర - భాపూర్ణ! విలా
సావాస! జనార్దన! యదు । ర్వీవర! సంకట నిరోధ!-వేంకటనాథా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశాలాంగ సూతుండగు సూతుండిట్లనియె. నట్లు యశోవతితోడ శిలావిగ్రహంబు హేమచరిత్రం బుఁజెప్పుట కుపక్రమించి సిద్ధుండువచ్చునంతకు మున్న వివరింపఁదలంచి, లతాంగీ! వినుమని చెప్పందొడంగె, నవ్విధంబున హేమమనంబున నిశ్చయించి. 2

క. శతమఖునకు భక్తినమ । స్కృతిఁజేసి నయంబుమీఱ - నిట్లనుమీరా
నతియొసఁగిన పనికేగుట । హితమగు మాకైనఁజాల - నెగ్గిందొదవుక్. 3

క. మానుల వంచించుటయనఁ । గా నెంతయుఁ గష్టసాధ్య - కార్యమువారల్
చానలయెడ విముఖత్వము । మానసదార్ఢ్యంబుఁ గలుగు - మానుసులగుటక్. 4

గీ. అచ్చరలమిన్నలైన రం - భాదియువతు । లెట్టిచెట్టలుగనిరిము - న్నిట్టిపనుల
కరిగి; తెలియమె దేవ! యం-తంతలేసి । వారుసనలేని పనికిఁబో-వంగఁగలనె? 5

గీ. అతులసుజ్ఞాన పూర్ణమ - హత్త్వసిద్ధి । నెసఁగుమునులను వంచింప - నెవరితరము?
వారికోపాగ్నినోర్చెడి - వారుఁగలుగ । రెఱిఁగిగానుగలోఁచేయి - నిడుదురయ్యా! 6

వ. కావున నేనీమహత్కార్యంబు దేవరచిత్తానుసారంబుగా నిర్వర్తింపఁగలుగుదునో లేదో యనుసందియంబు మనంబునం బెనంగుచున్నది. మునీంద్రుల మనోనిశ్చయంబును, ననల్పక్రోధసంకల్పప్రకారంబును, నింతకుమున్ను కొంతకొంత యప్పుడప్పుడు నెఱింగియుండుదుఁగానఁ దమసన్నిధానంబున నిన్నిమాటలు విన్నవింపవలసె నింతకంటె మిన్నలననుపుట యుచితంబని తోఁచుచున్నయది; యనియుక్తియుక్తంబుగా నిజాభిమతంబుసూచించిననగి దేవేంద్రుం డిట్లనియె. 7

క. హేమా! వింతలునుమ్మా! । నీమాటలు వినఁగ; నంత - నేగనిబిడవే?
శామింపఁ జేసినేర్పున । యామానిని లోఁగొనంగ - నన్యులవశమే? 8

క. తరుణీ! యీకార్యముల | చ్చరలగు మీవలనగాని - సరిపడదిఁక మీ
రరమరనొందెన మతిరొ | వ్వరు మాపనిఁజేయఁదగిన - వారలు చెపుమా. 9

క. కన్నాకు భంగినప్పర | పన్నగవేణులకు నీవు - పైచేయివియి
ట్లన్న నిపుడిచటననుపఁగ | నున్నారా నిన్నుఁబోలు - యువతులుగనుమీ. 10

వ. నీకు సమయోచితంబగుబుద్ధియుఁ, జాతుర్యంబును, లావణ్యంబును, ధైర్యసాహసంబులును, గలుగునటుల వరంబొసంగితి. నింకమారాడక వేగంబునంజని కార్యంబుసాధించి రమ్మి పొమ్మనవుఁడు పురుహూతునకడ్డు వలకనోడి యావగలాఁడియింకఁబోకున్నఁదీర దని నిశ్చయించి నమస్కరించి శలవుఁగైకొని నిజసదనంబునకరిగి మజ్జనంబొనరించి సముజ్వలవిభూషణగంధమాల్యాంబరాదులుగైసేసి, నెచ్చెలులు వెంటరాబయనంబై శీఘ్రగమనంబున వింధ్యధరాధరపరిసరకాంతారంబుఁజొచ్చి యందలి జటిలాశ్రమంబుఁబరికించి ప్రవేశించి తెగువమీఱఁ దత్సమయంబున. 11

ఆ. నిర్వికల్పభావ - నిష్ఠాగరిష్ఠుఁడై | యోగముద్రఁబూని - యుండునట్టి
జటిలుఁగాంచిచేరఁ - జనలేక వెఱఁగంది | తత్తఱమునఁగొంత - తలఁగినిలిచి. 12

ఉ. హేమమదింగలంగి యిట - కేటికివచ్చితి నేడుబుద్ధిలే
కేమరి; కష్టపాటెఱుఁగ - నే? యపుడేగెద నంటినెంచకిం
దీమునియున్న లాగరయ - నెంతయు భీతిజనించుచున్నదిం
కేమియొనర్తు నెవ్విధిను-రేశ్వరు వాంఛను దీర్తుదైవమా! 13

క. రంభాదులైన మదగజ | కుంభస్తను లరుగమనిన - ఘోరపుపనికిన్
జంభారి నన్నుఁబనుచుట | సంభావితమగునె? - మిగుల సంకటమొదవెన్. 14

క. వాదించి నన్నెయనుపం | గాదివిజేంద్రునకు యింకఁ - గలుగరెయువతుల్
లేదో యూర్వశి మేనక | లేదో యలమంజుఘోష - లేదో యచటన్. 15

క. ఊరకఁబోయిన నాసరి | వారలు నవ్వుదురు తిట్టు - వడుదున్హరిచే
నేరీతినైన సయ్యోడు | వీరడిఁజనరాదు నేర్పు - విధినొనరింతున్. 16

గీ. అనుచుఁజింతించి పలుయుక్తు - లాత్మనెంచి | పడఁతితుదకెద ధైర్యంబుఁ-బాదుకొల్పి
సఖులతోఁగూడి చనివేడ్క-సంయమీంద్రు | కెలన విహరించుచుండెఁ దాఁ-జెలువుదనర.

ఉ. ఆయువతీమణుల్చెలఁగి - యచ్చట నత్తఱిఁదావిపూవులం
గోయుచుఁ, గోకిలధ్వనులఁ - గూయుచు మత్తమరాళి పంక్తులన్
డాయఁగఁబోవుచుం బొదల - డాఁగుచు నింపుఘటిల్లగాన ముం
జేయుచుఁ గీరశారికలఁ - జీరుచుపంతములాడికేరుచున్. 18

క. ఆడుచు జతవీడుచు వెసఁ | గూడుచు వేడుకచెలంగఁ-గుసుమాంబకుఁగొం
డాడుచు నా గహనంబునఁ - జేడెలు విహరించిరతివి - చిత్రముగాఁగన్. 19

వ. మఱియునయ్యువతీమణులుచెలరేఁగిక్రొక్కాఱుమెఱుంగు తీఁగెలంబురుడించుతను వల్లరులుమెఱయ మందగమనంబుల నందందందిరుగుచు, సందంబులగుకుందంబులకడకరుగుచు, పొదరిండ్లదూరుచు, మదహంసలంజీరుచు, కొమ్మలపైనెక్కుచుందమ్మెరలకుం జొక్కుచు, గూతలంబెట్టుచుఁ, జేతులందట్టుచు, ఫలములంగోయుచుఁ, గొలఁకులందాయుచుఁ బతిమాలిననాగుచు, లతలమీఁదనూగుచు, నలరుబంతులమీటుచు, సెలయేరులం దాఁటుచు, చిలుకలవలెఁ బలుకుచుఁ, జెలువుదనరఁగులుకుచు, సొగసినీడలనిల్చుచుఁ, బొగడపూవులురాల్చుచు, దాగిలిమూతలాడుచు, జాగుఁజేసినవేడుచునిట్లనేకవిధంబులం బ్రసూనబాణసూత్రధారకహస్తలాఘవప్రభావసంచలద్రత్నపుత్రికాసముదయంబుడంబున నయ్యచ్చరమచ్చకంటులు సంచరించుచుండి రాసమయంబున. 20

ఉ. వారలలోన హేమముని - వర్యునిచేరువ సంచరించెనొ
య్యారముమీఱఁ బైటచెఱఁ-గంచొకయించుక జాఱవింతయా
సొరొనగూడె హారములు - చన్నవపైఁబగఁజిందులాడశృం
గారము తొంగలింప రహిఁ-గొనుఁబిరుందులు సంచలింపఁగన్. 21

శా. ఈరీతింజరియించువేళ మునియా - హేమాదిహేమాంగలిం
పారంజెంగట సందడించుటను దా-నాలించి యిచ్చోటికె
వ్వారో వచ్చెదరంచు నెంచి తపమున్ - వర్జించి వీక్షించె శృం
గారోల్లాసలసచ్ఛుభాంగనవరే - ఖాసారలన్ వారలన్. 22

చ. అటుకని హేమరూపమున - కచ్చెరువొంది తదీయమోహసం
కటము మదింజనింపఁ బర-కాంతను జూడఁగఁ గొంకికన్నులన్
దటుకున మూయుమూసి ధృతి - తప్పిన నైపఁగలేకఁ జాలనా
రటపడునించుకించుక జ-రన్మునిరెప్పలువిచ్చి కన్గొనున్. 23

చ. శిరమునువాంచు నింకఁ గనఁ - జెల్లదటంచుఁ దలంచియంతలో
మరలఁగనున్ దపోనియతి - మానితిఁగాయని సంస్మరించుఁదా
హరిహరియంచు నామహిమ - యాఱడివోయె నటంచుఁగొంకు దు
స్తరమిది బుద్ధినిల్వదని - తాలిమిఁ దూలివిరాళిపాలగున్. 24

ఉ. అంగనమీఁదభావమిడి - యన్యవిచారముమాను నంతలో
వెంగలినైతి నేననుచు - వెండియు నిష్ఠవహించు బాళినో
ర్వంగతరంబుగాక చెలు-వందలపోసి నుతించుఁ దాఁదపో
భంగము సంఘటిల్లుఁ జెడు-వాంఛజనించె నటంచుఁజింతిలున్. 25

ఆ. మనసు తపమునందు - మగువపైఁ వనజాక్షి । తనరధృతి వహించుఁ - దత్తఱించు
నత్తతలనుచేతు - లంగడిలోబుద్ధి । యనుట తథ్యమయ్యె - నతనియెడల. 26

సీ. ఏమైననయ్యోనే - నీఁకసైఁపలేనని - కలహంసయానతోఁ - బలుకఁదివురుఁ
బరులుసూచిననగు - బాటుగుననియెంచి - నిక్కపల్కురునలు - దిక్కులరియు
నెందుఁజప్పుడువిన్న - నెవరోవచ్చెదరంచుఁ - గడునిష్ఠనున్నట్లు - కనులమూయుఁ
గ్రీడావశంబునఁ - గెలనికి వచ్చినఁ - గామినీమణినిఁగ్రే - గంటఁజూచు

గీ. తహతహనుజెంది యోజించు-తాపమొందుఁ । దనపనులయందుఁ గడువిర-క్తినివహించు
దైన్యమున వెలవెలఁబోవు-తాపసుండు । వలపునకు లోఁగుఁబోయెంత-వాఁడుగాని. 27

వ. ఇట్లాజటిలుండు వియచ్చరకుటిలాలకపై దిటవగు విరాళివహించి యటుపిమ్మట. 28

సీ. ఉదిరిబంగరమున - నుపమానమైయొప్పు - మిసిమిఁగల్గిననును - మేనుఁజూచి
కిలికిరాయంచల - గతిహీనమనిపించు - బెడఁగైనకులుకునె - న్నడలుజూచి
గుత్తంపురైకకె - క్కుడుగామిటారించు - చెండ్లనాఁదగినపా - లిండ్లుజూచి
రాజిల్లుశృంగార - రసరూపమైనట్టి - మగువయొయ్యారంబు - వగలుఁజూచి

గీ. చెలువుమించిన పెనుపిరుం - దులనుఁజూచి । తనరు బిత్తరిచూపుల - గొనబుఁజూచి
తలిరుమోవియుఁ దళుకుఁజె-క్కులనుఁజూచి । మోహపరవశుఁడయ్యె న-మ్మునివరుండు.

ఉ. అత్తతిమన్మథుండు సమ-యంబని హో యని యార్చితియ్యవి
ల్లెత్తిబిరాన బాహుబల - మేర్పడఁ దుమ్మెదనారిఁబోసి యా
యత్తనిశాత భీకరల - తాంతశరావళినేసెఁ జాతురిన్
చిత్తమమంది మానికడుఁ-దాపముమించి చలించికుందఁగన్. 30

గీ. భావభవ బాణకీలికీ - లావిశేష । ఘోరతరతాప.జనితవి-కారహృదయుఁ
డగుచుజటిలుండు నిజనిష్ఠ - నపుడుమఱచె । దైవఘటనము మునిరైనఁ-దప్పఁగలఁడె ?

క. ఈరీతిఁ గడువిరాళిఁ । గూరిమునీంద్రుండు హేమ - గొనబుంగనియా
హారా ! యీచక్కదనం । బే రమణీమణులకైన - నిద్ధరఁగలదే ? 32

క. ఇదియప్సర రజనీచర । వదనయొ గంధర్వవనజ - పత్రాక్షియొ యా
మదనుని రాణియొ మానవ । సుదతియొ తలపోయమిగుల - నుంచెరికనఁగాన్. 33

క. ఈ నెలఁత సోయగము నా । మానసము హరించెనేమి - మాయయొవానుల్
దీనింగని రేనియు ను । జ్ఞానంబటె పోకయుండఁ - జాలుదురెధృతిన్. 34

క. కమలభవుఁ బరిహసింపఁగఁ । గమలాభవుఁడేమొ సృష్టిఁ - గావించెను యీ
కమలారివదన, నిఁతుల । కమలాంగ విలాసమిట్టి - దైయుండవలెన్. 35

గీ. భామనెమ్మొము సోముని - గోముమించు । వాలుమీనులఁ గేరఁగాఁ - జాలుకనులు
నడము పొక్కిలి రహి కోక - నదములడుగు । లరటికంబము లూరువు-లలకలళులు. 36

క. కోదండంబులు దర్పకు । కోదండంబులు - సువర్ణ-కుంభములుచనుల్
సౌదామిని తనులతయిది । సౌదామిని యనెడివేల్పు - చానయదేమో. 37

క. దరకంధర కామినిసుం । దరకంధర సదృశకచను - తన్వీబలారే !
పరితోషము గలిగెనుయీ । పరితోషమవాణిసొగసు - వగలునుఁగన్నన్. 38

సీ. జలజాతములసౌరుఁ - జౌకఁగావించునీ - వనితపాణులుఁగన్ను-లునుగళంబుఁ
జక్రవిఖ్యాతిని - సమయింపఁజాలునీ - చెలువనాభియుఁబిఱుం - దులునుఁజనులు
తారావిలాసంబుఁ - గేరంగనేర్చునీ - చెలిదంతములునఖం - బులునురూపు
హరిగర్వభంగధ-ర్మాస్పదంబెంచనీ - వెలఁదిమధ్యముమోము - వేసలియును

గీ. ఇదిజగన్మోహిని యనంగ - నెసఁగునహహ । యుర్విలో నందమనిన ని-ట్లుండవలదె
దీనిఁగౌఁగిటఁజేర్పఁగా - లేనివాని । జన్మమును నొకజన్మమే - చర్చసేయ. 39

ఉ. చేలయువోలె నేఁ దపముఁ - బెద్దగ నెంచితిఁ గానలేక నా
పాలిటివేల్పు మత్కలుష - భావము మాన్పఁగ నెంచి నేటికీ
బాలకురంగనేత్రఁబరు - వంపుమిటారినిఁ దెచ్చెనిందుమ
చ్ఛీలము నిష్ఫలంబనుటఁ - జిత్తము నందలఁపించెనిత్తఱిన్. 40

క. కోరికఁ దీరఁగానా । రీరత్నము నెటులఁబల్క-రింతునొ నేనే
కారణమున భాషింతునొ । యారాటము మానఁదగిన - యనువెట్టిదియో. 41

క. మున్నెపుడునుఁ గనియుండని । పన్నగవేణినివితా నె-పములేకయయే
తెన్నునఁజేరుదుఁ జేరిన । నన్నెవ్వధిఁదలఁచునో మ-నంబుననంతన్. 42

క. అనుమానమేలనేనై । ననుదీరదుపల్క-రించి - నంగానిభయం
బునులజ్జయుఁగాముకునకు । మొనయునె సౌఖ్యంబుధైర్య - మునవాటిల్లున్. 43

సీ. మునుముట్టమున్నచే - సినవాతపఃఫలం-బుతొలంగిపోయినఁ - బోవనిమ్ము
తపసికీకార్యంబు - తగవుగాదనిజనుల్ - తెగువమైఁదిట్టినఁ - దిట్టనిమ్ము
హీనమైనాశీల - మిందుచేనశియించి - ధర్మంబుఁదప్పినఁ - దప్పనిమ్ము
మానివర్యులుబుద్ధి - లేనివాఁడితఁడెన్నఁ-జెడుగంచుఁజెప్పినఁ-జెప్పనిమ్ము

గీ. దీనికతమున నేపాప-మైనగాని । నూటిగాఁ బొసెనూపిన - నూపనిమ్ము
సంకటము లెన్నియొదవిన -సరకుసేయఁ।గొమ్మనెమ్మైన లోఁగొందుఁ- గూడియుఁదు. 44

క. అనినిశ్చయించి యపుడ । మ్మునిజంకునుమానిలేచి - ముదమున నయ్యం
గన తిరుగుచున్న చోటికిఁ । జనితమినిట్లనియెనిర్వి - చారునిభంగిన్. 45

క. తరుణీలలామ నీవె । వ్వరిదానవు? వెఱపులేక - వనితలతోనిం
దరుదెంచిన కారణమును । బరిణామము నూరుఁబేరుఁ - బలుకుము తెలియన్. 46

క. ఇదిఘోరారణ్యంబను । నదిదెలియవొ? మచ్చుమనంటి - యభిమానంబుల్
వదలిన వారికి నెలవిది । సుదతీ! మీవంటివారు - చొరఁగోరుదురే? 47

వ. అనియడిగిన మునివల్లభునిపల్లవాధర, క్రేఁగంటం జూచి మెల్లనిరవంబుదనరనిట్లనియె. 48

క. అమరాంగనలమువారము । యమివర! మేమీవనంబు - నందిపుడు విహా
రముఁజేయవచ్చితిమి నా । మము హేమయటందురనుచు - మారుఁబలికినన్. 49

చ. వినిముని మేలుమేలు మను - విందుననేకులు నిన్ను మెచ్చఁగాఁ
గనుఁగొనిమాటలాడుటకుఁ - గాంక్షమనంబునఁ బెక్కునాళ్లుగాఁ
బెనఁగొనియుండుఁగాని కడు - భీతిలుచుండుదు నిష్ఠభంగమౌ
నని తటినేఁడుచేకుఱెఁద - నంతనె దైవికమిట్టిదేఁ జుమీ! 50

క. తలఁపని తలఁపుగ జనులకుఁ । గలిమియు లేమిడియుసుఖముఁ-గష్టంబును సం
ధిలు వానిరాకపోకలు । తెలియంగారాదు మదవ - తీనిజముగదా! 51

క. నీకుసరివారలిఁకన్ను । ల్లోకంబులఁ గలుగరని పలుకవిని నిజమే
నోకాదోయని యెంచితి । మాకుంగల సంశయంబు - మానెన్ గనఁగాన్. 52

క. వేసరకఁ బెక్కునాళ్లుగఁ । జేసిననాయోగఫలము - సిద్ధించెను నే
నీసల్లాపోల్లాసమ । హాసౌఖ్యము నొందఁగంటి - హరినీలకచా! 53

ఆ. అనినమారుపలుక - కాననంబునఁజిఱు । నగవు మొలకలెత్త - నానగరుఁ
గాలిబొటనవ్రేలు - నేలవ్రాయుచుఁదల । వాంచి నిలిచియున్నఁ - వనితఁజూచి. 54

ఆ. తపసిమదినిఁజాల - తమిమించిశంకవ । ర్జించి కోర్కి దెలుప - నెంచియపుడు
మంచిమాటలాడి - మగువమిన్నకయున్నఁ । జంచలాత్ముఁడగుచు - సరసకరిగి. 55

గీ. కాంత! యొకమాటఁ జెప్పెదఁ-గాని తప్పు । గాఁగణింపకు మదిని - నిక్కంబువినుము:
సముఖమునరాయభారంబు-జరుపనేల । నెటులనెంతువొ నిన్ను మో - హించినాఁడ. 56

క. నినుఁగనిన మొదలునేమది । నెనలేనివిరాళిఁ జెంది - హెచ్చగుతాపం
బుననలయుచున్నవాఁడన్ । గనికరమునఁగోర్కిఁదీర్పఁ-గాఁ బ్రార్థింతున్. 57

క. అనినమునివలపుపలుకులు । వినియొల్లనిభంగివెగటు - వెఱచూపులఁగ
న్గొనిచాలమంచిమాటయ । వినిపించితిరింకఁజాలు - వేడబమనుచున్. 58

వ. అవ్వోట్టువాసి పోవునదియుంబోలె నటుమొగంబై చనఁగమకించినంగనితత్తఱంబునజటి
లుండప్పుడు. 59

క. మనసిజుఁడు వేగిరింపఁగఁ । బొనరినతమికతనమేనఁ - బులకాంకురముల్
మొనయఁగఁగామినిపైచెయిఁ । గునుసురవడిఁబట్టెఁబట్టు-కొనుటయుఁగినుకన్. 60

మాకెల్లఁగంగరాదుకల - మాటవచించితి యోగదృష్టిమీ
రేకనిపల్కుఁడయ్యయిపు - డేచనినోళ్ని వచ్చియిచ్చెదన్. 210

ఆ. అనినశాంతినొంది - యామునియతనికి । ట్టినిచ్చె, మంచిదశుల - నైననేన
దెలియఁజేతుయోగ - దృష్టిచేఁగనుఁగొని । మెచ్చుకొనినదానిఁ - దెచ్చియిమ్ము. 211

వ. అనిపలికి యొక్కింతతడవు కన్నులుమూసుకొనియుండి మరలవిచ్చియానృపాలునింజూచి
యిట్లనియె. 212

మ. కనుఁగొంటిన్ నరనాథనేనిపుడు లో - కంబెల్లనాబుద్ధికే
వనజాతాక్షియు నెక్కడయ్యెనువృథా - వాంఛించితిన్ నిష్ప్రియో
జనమాటేర్పడెఁ గష్టమొందితివినన్ - సంతృప్తినొందింపనెం
చిననీవున్, మహిలోదరిద్రునకు సం - సిద్ధించునేసంపదల్? 213

ఆ. ధాతయొకనినుదుట - దౌర్భాగ్యుఁడగును వీఁ । డనిలిఖించియున్న - యట్టివానిఁ
దివిరిమంచిదశకుఁ - దేనేర్చునట్టివాఁ । డెవఁడుగలఁడు? తప్పు - నెవనితరము? 214

ఉ. కోరినకోర్కెఁదీర్చుటకుఁ - గోరికఁగల్గినవాఁడవీవునే
నూరకచన్న నీయతిశ - యోన్నతికింగడులోటుసజ్జనుల్
నేరమునాయదేయనిగ - ణింపుదురాటను దీనికొక్కని
ర్ధారణఁజేసినాఁడను ధరావర! దెల్పెదనాలకింపుమా! 215

చ. అడిగితినేనొసంగెదన - టంచివినీవును నింతమాత్రముం
బడయఁగలేమి యిప్పమియఁ - బాపముగావున యున్నవారిలో
యడఁకువఁగల్గు దానిఁ బ్రియ - మారనొకర్తుకనిమ్ము తెల్పెదం
జెడినను సౌఖ్యమొందినను - చిత్తమునంగొఱలేదు పిమ్మటన్. 216

ఆ. తామసంబొనర్పఁ - దగదుకల్గినమాటఁ । దెలుపుమిపుడుకోర్కెఁ - దీర్పఁగలవొ
కాదుపొమ్మనెదవొ - కానరాదయ్యెనీ । తలఁపటన్న విభుఁడు - తపసిఁజూచి. 217

క. కాదనిపలుకుదునే? యో । భూదేవకులాగ్రగణ్య! - పొలఁతుకయునికిన్
మోదముమీఱఁగఁదెలుపుఁడ । యాదరకంధరనుఁదెచ్చి - యర్పింతువడిన్. 218

క. చెప్పినవిప్పుడచనినే । నప్పడఁతినిఁబిలువఁబనిచి - యాడినమాటం
దప్పకమీకొప్పించెద । మెప్పించెదమిమ్మునిజము - మృడనిభమూర్తీ! 219

చ. అనివిజయాశ్వభూపతి మ-హావినయంబునఁ బల్కెమానియా
జనపతిఁజూచిదామరల - శాస్త్యమునందలయూఁచినవ్వి ఁప
ల్కెనఫలమేమి? కానిపని - కింబ్రియమేటికి? యొవ్వరైనన
య్యెనువివరింపనొల్లఁగడు - పోళనకుంగుదురాదుఁజెప్పినన్. 220

క. వినిపించినసీవుమదిం । గనలొందుదువిదినిజంబు - కావునసీకున్
వినిపింపనేల? యదికా । దనిపించుకొనంగనేల? - యఘమునిబోల్కిన్. 221

ఉ. ప్రాప్తముగల్గునేనిజవ - రాలులభింపదె లోకమందు? నే
సప్తసముద్రముల్గడచి - చన్ననుఁబొవ్వనివేళఁజిక్కునే?
వ్యాప్తినిమించుమెచ్చుఁదగు - వాఁడవుదాతవు నీవునిట్లుసం
తృప్తియొనర్పఁజాలక మ - దిన్వెతఁనొందఁదవేమిసేయుదున్. 222

క. నావినిభూపాలుండో । దేవా! నేనేశుభాంగిఁ - దెత్తు? దెలుపుఁడే
లావినుగుఁజెందఁగానిపు । డావెలఁదుకయొచటనుండు - నమరఁగఁజెపుఁడా. 223

వ. అనియడిగిననిట్టూర్చిమునివరుండా జనవరునకిట్లనియె. 224

ఉ. ఎవ్వతెయంచునీవడిగె - దేమనిచెప్పుదుమానవేంద్ర! యా
జవ్వనియింతెయుండుఁగడు - సౌఖ్యములొప్పఁగనిర్విచారయై
పువ్విలుకానిపూములికి - పోయిదినాఁదగుదానిమించువా
రెవ్వరునింకలేరుమది - కింపగుదానలు కోరివేఁడఁగన్. 225

క. దానినొసంగినఁజాలుం । బో! నామదిఁజాలఁదృప్తిఁ - బొందెదనన
న్మాన్యనింగనిమానవపతి । యానెలఁతుకయెవ్వరెచట - నదియుండుఁబురిన్. 226

క. వచియింపుఁడనినఁ దాపసుఁ । డచలుండై పలుకవెఱచి - యటునిటుఁగనె, మీ
కిచటభయమెందనేటికి । యుచితంబగుఁదెలుపుఁడనియె - నుగ్రుఁడుపేడ్కన్. 227

గీ. అంతధైర్యంబునొందిన - ట్లభినయించి । యతఁడురాజునుగనిపల్కె - నైననయ్యెఁ
గాకయుండినఁగాకుండుఁ - గానిదాని । నెఱుఁగఁజెప్పెదవినుము మహీశచంద్ర! 228

చ. పొనరఁగనెందుఁ జల్లఁగొనఁ - బోయినచోటున మంతదాపఁగాఁ
జనదఁటచెప్పఁగాఁదలఁచి - జాగదియేటికి? యోగదృష్టిచేఁ
గనుఁగొని మెచ్చియిమ్మనిన - కంజదళాయతనేత్ర యొవ్వతో
యనిశుదిసంశయింపకుము - స్వర్గమెయర్థమెుకాని తెల్పెదన్. 229

క. సర్వశుభలక్షణంబుల । నుర్విఁగడుఁబేరుఁగొన్న - యువతులలోనన్
సర్వోత్తమగుణయుతయగు । పర్వేందునిభాస్యనీదు - భార్యయనుమీ! 230

క. ఆలలనకంటెశుభవిమతి । మేలగువారెందులేరు - మెచ్చితిదానిం
జాలునని, లేనియువతుల । నేలాగునెందుదెత్తు - వేనడిగినచోన్. 231

ఆ. తగినకాంతగాదు - మగువయటన్న, లే । రధికులంతకన్న - నగుట్రగుడ్డి
యఱదుమెల్లమేల - టంచుఁదలంచినే । మదినిగోరినాఁడఁ - దుడుకుదాని. 232

ఉ. భూవరయెన్నఁడుంబలికి - బొంకనివాఁడవుగాన యా వ్రతం
బేవిధినైనఁ గాచుకొన - నిచ్చదలంపుము దీనికాత్మయం
దేవనుఁ జెందఁగావలద - భీష్టముఁ దీర్పుము వేగ నీయశ
శ్రీవిలసిల్లు లోకమునఁ - జేకుఱు నీకు సమస్తసంపదల్. 233

క. తగుఁదగదని యెంచకు మే । లగుఁ గీడగు ననుభవింతు - నరమరనీలో
దిగవిడిచి యిమ్ము నీసతి । నగడై ననునర్వ్యోఁ గొందు - నంతియచాలున్. 234

క. అని తెలిపి మౌనివరుఁడా । డినమాటలనాలకించి - డీప్పడి నృపుఁడెం
దును మున్ను విని యెఱుంగని । చనవితనికిఁ గలిగెననివి - షాదాత్మకుఁడై. 235

మ. తనలోఁ దత్తఱపాటు భీతియును సం - తాపంబు హెచ్చంగ యి
ట్లని యోచింపఁ దొడంగె నీద్విజుఁడన - ర్హాంబంచుఁ జింతింపకే
మనిపత్నిన్ దనకిమ్మటంచి పుడుదా - సర్థించెనో కాని యె
ట్లొనరింపందగు నీయకార్యమును? న - న్నుర్వీజనుల్ దూఱరే ? 236

ఉ. అర్థులు వస్త్రవాహన గృ - హార్హ విభూషణరత్నజాలరు
క్మార్థము లిష్టవస్తువులు - నందఁగఁ గోరుదు రంతె కాని యీ
ప్రార్థకునట్లయోగ్యమగు - భంగిఁ గులాంగన నిమ్మటందురే ?
వ్యర్థపువాంఛ నొందె నితఁ - డైన ? యొసంగుట నాకుఁ బాడియే ? 237

క. కులకాంత నడుగునని నేఁ । దలఁపఁగలే దీతఁడిది య - ధర్మంబని తాఁ
దెలిసియు వేఁడుట చిత్రము । కలరా యిటువంటి యాచ - కజనులునుర్విన్. 238

చ. అడుగుము దేనినైనను బ్రి - యంబున నిచ్చెదనంటిఁ గాన నా
నడిగె నితండు, లేదితని - యందపరాధము నంతయేనియుం
గడిదిగనెంచి నేనిపుడు - కాదనవచ్చునె ? మౌనికోరికన్
విడువఁడు వేఁడ నన్యమును - భీతిలఁ డించుకయైన నిందకున్. 239

మ. సతి నర్పించుట ధర్మమా ? మిగుల దూ - ష్యంబింక నే దేని స
మ్మతి నీకిచ్చెద వేఁడుమన్న నదిధ - ర్మంబౌనె ? యట్లన్న నా
వ్రతభంగంబగు నేమి సేయుదు నవా - ర్యంబై నకష్టంపుదు
స్థితికిం బాల్పడి కుందఁగావలసెనే - జింతింపఁగా నేమగున్ ? 240

ఉ. ఏమి వచింతునే తపసి - కీలువుఁ దప్పనిదైన మత్సతిన్
నేమము వీడ కిచ్చుటయొ - నేనుడిఁ దప్పుటొ యొండుగాక నిం
కేమొగిఁ దీఱునీయదరు - హీనుని భంగినిఁ బల్కి బొంకఁగా
నామతి యొల్లకున్న దవ - నాయపు కార్యము నెట్లు సేయుదున్ ? 241

క. యాచకుఁడు తగనుతగదని । యౌచిత్యము ననుచితంబు - నాత్మ నెఱిఁగి దా
యాచించునె? ముదమునసం । కోచింపక వేఁడుఁగాని - కోరినభంగిన్. 242

ఆ. అనుచు పెక్కుగతులఁ - దనలోనఁ దలపోసి । తత్తఱించుచున్న - ధరణిపతినిఁ
గాంచిమునివరుండు - కన్నులెఱ్ఱఁగఁజేసి । బెట్టిదంబుగాగ - నిట్టులనియె. 243

శా. ఏరా! యోరివివేకదూర! మును నీ - వెద్దానినర్థించినన్
ధారాళంబుగ నిచ్చువానివలె వా - గ్దానంబుఁగావించి నీ
దారన్ గోరితినిమ్మటన్నఁ గడుచిం - తన్ బూని మారాడవె
వ్వారైనన్ నినుమెత్తురే? కపటదు - ర్వాచాట! నీచాత్మకా! 244

చ. గుడసరి! యోజనల్ విడిచి - కోమలినిమ్ము ఱలేక సత్యమున్
విడువనివాఁడవైన విను - వెంగలివై సతిమీఁది యాసచే
నుడివిన మాటఁదప్పిన ని - నున్ బహుళాఘమలంచు నీయశం
బడఁగును సంపదల్దొలఁగు - నాత్మఁదలంపుము హానివృద్ధులన్. 245

మ. మరుమాటాడకయున్నఁ బోదునె? వృథా - మాకేలనీతోడయీ
పరుషోక్తుల్ తగ వర్థితంబొసఁగినీ - ప్రఖ్యాతిరక్షించుకో
మ్మరవాయింగొను టొప్పుదింకనిముసం - బైనన్ బ్రతీక్షింపనో
ధరణీశా! తడయంగనేమిటికి? కాం - తన్ వేగనర్పింపుమా! 246

క. లేకున్న నినుశపించెద । నాకుంగోపంబుమించె - నా? యటుపైనే
నేకీడొదవిననొదవుం । గాకవిచారించువాఁడఁ - గానుకరిసుఁడన్. 247

మ. అనిగద్దించిమహోగ్రుఁడై వలుకయు - గ్రాఖ్యుండుదానొజ్జకి
ట్లను, నోమానివరేణ్య! కూళుఁడును మా - యాశీలుఁడున్ వీఁడుసాం
త్వనయోక్తుల్తగ నీఖలుండువినునే? - తర్కింపుఁడా! యెంతదె
ల్పిన భస్మంబున నేయుహోమమును వో - లెన్ వ్యర్థమౌనెంచఁగన్. 248

శా. సందేహించిన నేమిమేలొదవు? మీ - శాంతంబుపట్టియ్యె వీఁ
డిందాకన్ మునిమెచ్చులాడుటకు ము - న్నెగంటినీతత్త్వమున్
విందోమిత్రుఁడొ వియ్యమందినతఁడో - విశ్వాసపాత్రుండొ యీ
నిందార్హుండెవఁడో శపింపఁదగదే? - నిస్త్రింశభావంబునన్. 249

చ. ఘనతరదారుఖండపరి - కల్పితమూర్తిపరంజమధ్యమం
దునిచి, తదీయమైన రస - మెల్లఁగ నొత్తడిగల్గుభంగిఁద్రి
ప్పినతఱిఁగాని, యోచెఱక! - బెల్లముఁబెట్టుమటన్నఁ బెట్టునే?
మననుడి వీనికింపగునె? - మంచితనంబున నెంతఁజెప్పినన్. 250

క. నుడివిననుడువుం దప్పిన । చెడుగునుఁగని కరముమాని - చెడఁదిట్టినఁగ
ల్గెడిదోషమేమి గలదీ । వడువున దైన్యమున వేఁడ - వలయునె ? వీనిన్. 251

మ. తరువా ! నాకొకపండుని మ్ముడుగుమా ! - దాటింపుమీ వాహినిన్
సురభీ ! క్షీరములిమ్మటన్న యవియా - శోకంబ్రసాదించునే ?
ధరమీఁదంబడ రాల్పకున్నను నరి - త్రద్వంద్వమున్ బూనితాన్
జరుగన్ ద్రోయకయున్ననుం బిదుకమ - న్నన్ మానివంశాగ్రణీ ! 252

ఆ. కాంతనిచ్చుననుట - కల్లమీరడియాస । మానిచనుట మేలు - మార్గమింక
నుచితమైనచోట - నువిదనార్జింపఁగాఁ । దగునిదేటిగొడవ - ధన్యచరిత ! 253

చ. అనవుఁడు నోరి ! మెచ్చితియ - ధార్మముఁబల్కితి వింతమంచి శి
ష్యునిఁగలనాకుఁ జేకుఱదె ? - సుందరియొక్కతె, యైనవీఁడుము
న్ననుమతిమాటలం బలికి - యంజికని త్తఁటి మారుఁబల్కకుం
డిన విడువంగనానె ? మన - నేర్పుకొఱంతయె ? వీనిశక్తికిన్. 254

క. పైదలి నర్పించుటయో । లేదనుటయొరెంటనొకటి - లెస్సవినకనేఁ
బోదునె ? యారక, యిఁకనా । వైదగ్ధ్యము నీకుఁదెలియ - వచ్చుంగనుమా ! 255

క. అనిమోము జేవురింపఁగఁ । దనకభిముఖుఁడై వచింపఁ - దలఁచినమానిన్
గనుఁగొని విజయాశ్వుఁడుగడు । వినయంబున నిట్టులనియె - వెఱమదిఁగదురన్. 256

ఉ. పూజ్యచరిత్ర నేఁ బలికి - బొంకెడువాఁడనుగాను మీకు నా
రాజ్యమునైననిచ్చెదను - రక్షలుగావు భవత్కృపాప్తిసా
యుజ్య ఫలప్రదాయకము - యోగ్యముగా దనియెంచ కివ్విధిన్
త్యాజ్యము సేయఁగాఁదగిన - దానము వేఁడితిరాటఁ గొంకెదన్. 257

క. పరసతినిఁ గోరుటెంతయు । దురితంబని బుధులువల్క - దురుసర్వజ్ఞా
ల్బరికింపఁగమీరొకరుని । తరుణినపేక్షించు టేమి - ధర్మంబనఘా ! 258

క. ధనకనక విభూషణవా । హనచయములఁ గోరియడుగ - కన్యాంగనని
మ్మనివేఁడుదురే ? యొండై । నను, దారినెఱింగిమడువు - నంజొరఁదగునే ? 259

క. కలుగవెపురములు భూములుఁ । గలుగరె లావణ్యమొదవు - కామినులింకం
గలుగవెవేఁడఁగఁదగునవి । కులకాంతనొసంగుమనుచుఁ - గోరుటుచితమే ? 260

క. అనఘా ! శాస్త్రనిషిద్ధం । బును కిల్బిషకరమునసుట - బుద్ధినిఁదగరో
జనసేయకన్యసతియగు । వనితనుఁగైకొనఁదలంప - వచ్చునె ? చెపుఁడా ! 261

శా. అశ్వానేకముగో శతాంగమయుగే - హారామసౌధంబులో
విశ్వంబోపరివారమో పటములో - విత్తంబొరత్నంబులో

విశ్వేశాకృతి నొప్పమీకిపుడె య - ర్పింతుం గొనుండయ్యా ! యి
ట్లైశ్వర్యంబును వేఁడలేకఁదగునే - యర్థింపఁగా మత్సతిన్. 262

ఆ. తారతమ్య మెఱిఁగి - దానంబునడుగఁగా । వలయునర్థియనుచుఁ - బలుకవినవె ?
తగనివస్తువైన - దత్తంబుఁజేయరా । దటవదాన్యుఁడెపుడు - యాచకునకు. 263

సీ. అవనినేదానమున నఘం - బవఘళించు । నట్టిదానంబుఁజేయరా - దండ్రుబుధులు
కొడుకకొసఁగినవాఁడునుఁ-గొనినవాఁడు । మేలుఁజెందరనెడు సుద్ది-మీరువినరె ? 264

క. కావునఁగూడని కార్యముఁ । గావింపఁగనేటి కెన్ని - గలుగవుకొనఁగా
దేవా ! యర్హంబగునది । గావేటొకటడుగుఁడనినఁ - గడుకోపమునన్. 265

ఆ. ఉగ్రదృష్టిఁజూచి - యుర్వీశునదలించి । మానియిట్టులనియె - మదిచలింపఁ
దెలిసెనోరి ! నీదు - తెగువరి తనమెల్లఁ । గల్లరీఁడవీవు - కలుషహృదయ ! 266

క. అడుగు మదియెట్టిదైనం । గడువడినిచ్చెద నటంచు - ఘనులువినంగా
నుడువఁగలేదే ? యిపుడీ । చెడుమతమును బూననీకుఁ - జెల్లునెచెప్పుమా ! 267

క. పుడమిని మానధనుల్ తా । మొడఁబడికంబలికి బొంక - నోడుదు రెపుడున్
జెడినఁజెడుదురు యేకీ । డడరిన సైఁపుదురువిడువ - రలసత్యంబున్. 268

క. కోరినయర్థంబొసఁగఁగ । నేరకయీలాగునీవు - నీతులువలుకం
గారాజధర్మమగునే? । యోరీ! నీవంటికుటిలుఁ - డుర్విం గలఁడే? 269

చ. వలసినదానిఁగైకొనక - వాంఛనుగొందునె యన్యవస్తువుల్
గలవనినీవు మాకొసఁగఁ - గాఁదలపోసిన, మున్నెదెల్పనే?
పలుమఱు, వేఁడినంతనిది - బాగదియోగనరాదు నీమదిం
దలఁచివచింపుమీయనుచు; - దప్పిదమెవ్వని దెంచిచూడుమా! 270

క. కులకాంతనుఁ గోరుటకడుఁ । గలుషంబగునంటివెందుఁ - గలధర్మంబోఁ
దొలుతనెదియడుగునోయని । తలపోయనినేరమెవని - తలపైఁగలదో. 271

క. తెలివిచెడిపోనివృద్ధులఁ । దలఁపకఁగావించుకొనిన-తప్పన్యులదా ?
జలచరముమిట్టిధాత్రీ । స్థలమునఁబడియలయుతప్పు - సలిలమదగునే ? 272

క. సతినర్పించుటకున్నీ । మతియొప్పమిననెదవిట్టి - మర్మపుమాటల్
కితవుఁడవునీవుసత్య । వ్రతముంబాలించుకొనఁగ - వశమానీకున్. 273

క. వినువాగ్దత్తంబునుజే । సినదాదిగమాధనంబు - చెలువముఁగలనీ
కులకాంతగాన తగువిధ । మునమాకొప్పింపుమింక - మోమోటేలన్. 274

క. ఒకనిమిషమైననీఁకపై । సకియనుమాకొసఁగకున్న - సైఁపనునిన్నున్
ముకుఁబట్టిలాగుదుంగని । పకపకనీపాటుఁజూచి - పదుగురునవ్వన్, 275

క. అనిలేచినిలిచి బిరబిరఁ । దనపైఁగలనారచేలఁ - దగఁగటిసీమన్
బెనవెట్టిచుట్టిసభ్యులు । గనుఁగొని వెఱఁగందఁగోప - కలితాననుఁడై. 276

ఆ. రాజుచేయిఁబట్టి - రమణినర్పింపుము । తడవుసేయుచున్న - విడువనిన్ను
సంశయింతువేని - శపియింతునిపుడని । యార్చిపండ్లుగీఁటి - యైట్టితిగిచి. 277

శా. రారమ్మింతినిఁ బిల్వఁబొమ్మనుచుని - ర్బంధింపరాజిట్లనున్
దారాదత్తమొనర్చినాఁడ నెమహా - త్మా! మీకు? మీరింతని
ష్కారుణ్యంబుగఁ బల్కనొప్పునె? నమ - స్కారంబుఁగావించెదన్
నేరం బెద్దియులేదు నాయెడవృథా - నిర్మింపఁగానేటికిన్. 278

క. కోరినయదియొసఁగెదనని । నేరూఢిగననినమాట - నేరంబగునే?
ధారుణి నెవరైనను బర । దారంగోరుదురె? చెపుడ - ధర్మవిచారా! 279

క. మీకుం దెలియనిధర్మము । లోకంబున నెందుఁగలదు? - లోఁజూపుఁగలా
రికీలు నెఱుఁగకుందురె? । సాకొక్కటిగలిగెఁగాని - సంకటపెట్టన్. 280

వ. అనినమతియుం గినిసి వెగటుగానగి తపసియిట్లనియె. 281

క. అడిగినదిచ్చెదనంటివి । యడగినవన్నియునుదత్త - మైనట్లెగదా!
యొడఁబడకున్నందీఱునె? । వెడఁగా! నీభార్యయైన - వేఁడందగదో. 282

క. మటుమాయలచేగికురిం । చుటకుం జూచెదవునీదు - చొప్పెఱుఁగుదునేఁ
గుటిలుఁడవసత్యవాదివి । కటకటనీమోముఁజూడఁ - గాదోసమగున్. 283

క. లేదనుమువోయెదనుయీ । ఖేదమునీకేలనోరి! - కృపణుఁడవుధరి
త్రీదేవులతరమెఱుఁగవు । ప్రాదేశనమిట్టిదగునె? - పాపస్వాంతా! 284

ఉ. న్యాయములన్ వచించెదవు - నానయొకింతయులేక యొప్పదీ
ప్రాయిఁడిచేష్టమానుముధ - రావర! యాడినమాటఁదప్పినన్
శ్రేయముగాదు మాదృశులు - చేకొనరిట్టివివేకహీనునిన్
న్యాయుఁడనాటఁగాంచియొక - సక్కముఁజేయఁదలంచినాఁడవే? 285

క. నీవలెనింతకుమున్నె । భూవల్లభులెచటఁబలికి - బొంకిరి? తామే
నోవ్వెతలొందియు విడిచిరె? । పావనమగునట్టిసత్య - భాషావ్రతమున్. 286

సీ. చండాలునకుహరి - శ్చంద్రుఁడమ్ముడువోఁడె - ధనమునకైయాడి - తప్పలేకఁ
బుత్రునిఁగాననం - బునకుఁబంపడెయజా - త్మజుఁడుచెప్పినమాటఁ - దప్పలేక
సర్వస్వమునుబ్రహ్మ - చారికివ్వఁడెబలి - ముప్పెతింగితయునుడిఁ - దప్పలేక
రుక్మాంగదుఁడుకుమా - రునిఁజంపఁబూనఁడే - తరుణికిచ్చినబాసఁ - దప్పలేక. 287

గీ. మఱియునిలనెందఱో సత్య - మతులుమున్ను । పలికిబొంకఁగఁజాలక - పడఁగరాని
కష్టములనొందిసత్కీర్తిఁ - గాంచినారు । వారనీవంటివారలు - గారొ చెప్పుమ! 288

క. అనిరోషకషాయితలో । చనుఁడైముష్కరముగాఁగ - సతినిమ్మనున
మ్మునియుద్ధతిఁగనివగరిచి । మనుజేశ్వరుఁడిట్టులనియె - మర్షముమీఱన్. 289

క. ఇపుడేమిపలికిబొంకితి? । విపులానురవంశభూష! - వివరింపుఁడ! యీ
విపరీతమైనయాచన । యపకృష్టమువేఁడరాద - టంటినినుండీ! 290

క. ఆదిష్టోదనపరదా । రాదులుగొనరానివగుట - నవిగోరంగా
రాదందురభిజ్ఞులుమీ । రాదుర్నయమెంచకుండు - టబ్రమునాకున్. 291

ఆ. ఇంతకంటెమించు - కాంతగల్గదెమీకు । వసుధ, మనసుగలుగ - వలయుఁగాని
యరసితగిననుంద - రాంగినిరావించి । యొప్పగింతుమాటఁ - దప్పఁజాల. 292

క. నావుఁడు పకపకనగిధా । త్రీవరునింగాంచియట్టె - తెక్కలిమునిక్రో
ధావిష్టుఁడగుచునిట్లను । నీవలెనే నెఱుఁగనేర్తు - నే? ధర్మంబున్. 293

చ. పలుకకుమప్రయోజకపుఁ - బల్కులునీకడధర్మశాస్త్రమున్
దెలిసికొనంగవచ్చితినె? - నేరక, నీసతినిమ్మటన్న నా
తలఁపునుదీర్పఁబూనక వృ - థాతడవిట్లొనరించినేఁడు మ
మ్మలఁచుటకెంచినాఁడవుదు - రాత్మక! నీవొక క్షత్రియుండవే ? 294

ఆ. దత్తమైననీదు - దారనుమాకిమ్ము । మనసుగలుగకున్న - మాటదప్పి
నాఁడననుమువిడుచు - వాఁడఁగానంతటి । దనుకవేయిమాట - లనఁగనేల. 295

గీ. భ్రూణహత్యాదిపాతకంబులనొనర్చు । వానికంటెనునన్నృతంబు - వలుకువాఁడు
కరముఘోరంబుతనకని - ధరణిమున్ను । విధినిఁగనిపల్కెననుగాథ - వినఁగలేదె ? 296

వ. అసత్యదోషంబుబొరయకుండువిధంబునబోటినొసంగిమాటంగాచుకొనుము. నీకుసత్యవంతుఁడవనువిఖ్యాతియతిశయింపఁగలదు. కాదేనియపారంబగుపాపంబునునావలనశాపంబునుననుభవింపఁబాత్రుండవగుదువనినయతనిమాటకుమారాడఁజాలకనిజసత్యవ్రతభంగంబునకువెఱచి,యెట్టకేలకుమనంబునధైర్యంబుఁబాదుకొలిపి, మాటదప్పక యత్తపసియభీష్టంబుఁ దీర్చుటయుత్తమపక్షంబని నిశ్చయించియతనినీక్షించి యిట్లనియె. 297

క. ఓపుణ్యమూర్తి! నాపైఁ । గోపింపఁగవలదుమీరు - కోరినభంగిన్
నాపడఁతినిచ్చెదనుకృపఁ । జేపట్టిసుఖింపుఁడాస - జెందితిరగుటన్. 298

వ. అనిపలికినమస్కరించినమునివరుండుసంతసించియతనిదీవించిపరమానందనిమగ్నుండయ్యెననిచెప్పిన, యవ్వలివృత్తాంతంబునెఱింగింపుఁడనియడుగుటయు. 299

ఆశ్వాసాంతము.

శా. శేషక్ష్మాధరగేహ ! శాంతహృదయా ! - సిద్ధౌఘసంరక్ష ! సం
తోషాధార ! చిరా ! సురేశ్వర ! మహా - స్థూలాణుచిద్రూప ! వి
ద్వేషిధ్వంస ! యశేషదోషహరణా ! - విశ్వాత్మ ! రత్నోల్లస
ద్భూషా ! నిర్మల ! దేవదేవ ! వికచాం - భోజాతపత్రేక్షణా ! 300

క. వేదాంతవేద్య ! భయవి
చ్ఛేద ! జగత్త్రియవినోద ! - సింధురపతి స
మ్మోద ప్రద ! నృహరీ ! ప్ర
హ్లాదావన ! మునివిహార ! - యబ్ధిగభీరా ! 301

తరళావృత్తము

భువనరక్షక ! కైటభాంతక ! - భోగితల్ప ! ధనంజయ
స్తవ ! శివంకర ! పంకజాసన - జప్రసన్న ! బుధాశ్రయా !
ప్రవిమలాంగ గుణత్రయాకర ! - భక్తవత్సల ! మాధవా !
పవనభుక్పయవైరివాహన ! - భామినీజనమోహనా ! 302

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహాత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్రి,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబునందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## ఉత్తరభాగము

---

### ద్వితీయాశ్వాసము.

క. శ్రీమత్పయఃపయోధిసు । తామంజులతరకపోల - దర్పణవిలస
చ్ఛ్రీముఖబింబ ! వరాంబర ! । శామిత్రోద్ధార ! శేష - శైలవిహారా ! 1

వ. దేవా ! అవధరింపుము సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశతాంగ సూతుండగు సూతుండిట్లనియె. నవ్విధంబున విజయాశ్వమహీశ్వరుండు విశ్వంభరాహ్వయతాపసోత్తమునకు నిజదారనర్పింపయత్నించుటయు నయ్యవసరంబుననించుక సేపుయోజించి తత్పూర్వంబు నొందినసంతోషంబుమానిఋషివర్యుండతనితో నిట్లనియె. 2

క. వినువిజయాశ్వనరేశ్వర ! । నినునడిగెదనొకటినీవు - నిర్మలబుద్ధిన్
వనితనొసంగెదనంటివొ । యనరునఁజెప్పితివొతెలియ - దయ్యెం జెపుమా, 3

చ. అడిగొఁడగాఁగనీవుయిపు - డాడినమాటనుఁదప్పలేక, నే
నెడఁగొనుటన్ మదిందలఁచి - యిచ్చెదపత్నినిఁగొండటంచుఁజె
న్వొఅపుడఁబల్కినట్లుగ వివేచనఁజేయఁగఁదోఁచెబుద్ధి క
త్తెడఁగునన్నె ననేనుపరి - తృప్తినిఁజెందను గైకొనం జుమీ ! 4

క. అప్రియదానపరిగ్రహ । ణప్రియులము గాము మేము - నలకువతనరన్
విప్రునకేవఁడెదియొసఁగిన ! నాప్రతిపాదనమువ్యర్థ - మంద్రుమనీషుల్. 5

ఆ. మనసుకలుగకున్న - మాకేమిటికికాంత । చనెదనేగ్రహింపఁ - జాలఁ నిన
నంతయైనఁగొంకుఁ-జింతయునామదిఁ । గలుగదనఘ ! యనుచుఁ - బలికెవృద్ధుఁడు. 6

ఉ. అంతటతాపసుండునగి - యట్లగునేనిపరిగ్రహించెదన్
సంతసమొప్ప, నింకొకవిచారము నామదిలోనఁగల్గె నీ
యంతటివారుగాక మఱి - యన్యులుదానినిఁదీర్పలేరెఱిం
గింతును, కోర్కిదీఱఁగను - ఖింపఁగనెంచితలంకనేటికిన్ ? 7

మ. వినుమాచింతనుసావధానమతివై - విశ్వంభరాధీశ ! యో
జనఁగావింపకనీసతింగొనుట యే - సౌఖ్యంబుగానే మదిం

దనివింజెందిరియొసంగుమం చెనిసుమీ ! - తప్పెయ్యోనాయాసయిం
దునవొక్కింతయుఁదృష్టిచేయుఁడు సం-తోషింబుగా దెంచఁగన్. 8

ఉ. సర్వవిధంబులన్ మిగుల - సంతసమొప్పఁగసంతతంబుదా
నిన్వృతిమీఱఁజేటికలు - సేవ్వనసేవయొనర్పనొప్పన
ప్పర్వసుధాకరాననుఁ - భాగ్యవిహీనుఁడనై నేసమహా
గర్వమెలర్పఁగైకొనినఁ - గల్గునె సౌఖ్యమునుంభయేరికున్. 9

క. ఊరకఁబోవక నేనై । నేరక పైఁబెట్టుకొనిన - నేగంబిదియో
భూనమణి ! విచారింపక । కోరంగాఁదగనికోర్కిఁ - గోరితినకటా ! 10

ఆ. కాపురంబు ఘోర - కాంతారమందున । నుండునట్టిపెద్ద - కొండచెంత
పులులుసింగములును- మెలఁగుచుండెడిచోట । వెలఁదిగనినమనెని - వెఱవకున్నె ? 11

సీ. అనయంబుఁగందమూ - లాహారమేకాని - షడ్రసోపేతభో - జనములేదు
పతసపార్శ్వప్రత్న - పర్ణశాలయెకాని - సౌధిష్ఠరమ్యావే - శ్మంబులేదు
చటులభీకరమృగ - సందోహమేకాని - పరిచారికాజన - ప్రతతిలేదు
ప్రవిమలతరభూర్జ - పత్రంబులేకాని - రాజిల్లుచీనాంబ - రంబులేదు

ఆ. కుడుచఁగావసింపఁ - గొలువంగఁగరియింప । లేనిపేదతపసి - నైననేను
కాపురంబునెట్లు - కాంతుభోగంబు । లనుభవింపచున్న - యతివఁగూడి. 12

సీ. మృదులతల్పంబుపై - మేనుసేర్చెడిలేమ - కటికినేలఁబరుండి - గాసిఁబడునె ?
పరిచారికలచేత - పనిఁగొనుకోమలి - యింటిపనుల్ నిర్వ - హింపఁగలదె ?
యొక్కింతనడువంగ - నోపనిసుకుమారి - ధృతిమీఱముండ్లలోఁ - దిరుగవశమె ?
పాకభుజియించి - విహరించుసుందరి - యుపవాసములనుక్కు - చుండఁదరమె ?

గీ. వఱలువెన్నెలవేఁడికి - వాడిపోవు । చానశీతాతపములకు - సైఁచియున్నె ?
చాలఁగాఁగలవిటిక - ష్టంబులచట । నెతలుగుడువంగఁగోరునె ? - విద్రుమోష్ఠి. 13

గీ. తెల్లవాఱినదాదిగా - దినదినంబు । నింటనెయ్యదిలేకున్నఁ - గంటగించి
తెమ్ముతెమ్మనినన్నువే - ధించుఁగాని । తరుణిసైరించునే పేద - తనముఁదెలిసి. 14

చ. అతులితమైనభోగముల - హర్నిశముల్ గొఱలేకఁగల్గువే
వితములఁగోరినట్లనుభ - వించులతాంగిననూనసంకట
స్థితినలయించిమాచుటకుఁ - జిత్తమొడంబడదయ్యెఁగాననీ
సతియునునేను జక్కఁవడు - చందముగల్గినఁదెల్పుమేర్పడన్. 15

క. మతిహీనునివలెమీఁదటి । గతిఎంచకనీదుసతినిఁ - గైకొనిచనిదు
స్థితికింబాల్పడఁజేసిన । క్షితిలోప్రజలెల్లనింద - సేయరె ? నన్నున్. 16

క. కావ్యనసీదానము మా । కేవిధమునఁగనినఁజాల - నైగ్గితోఁజెన్
భావంబున, నేనొల్లను । నీవేసుఖమెందుమింతి - నింగూడినృపా. 17

క. కపటపటఁదానేవలదను । జడిసితపసి, యనుచుసెంచి - సమ్మతిపడినే
నడిగియునడుగకమున్నే । పడతుకనర్పింతుననుచుఁ - బలికితివహహా ! 18

శా. ఈకాపట్యమెఱుంగలేకయిపుడిం - దీసభ్యులాలింపఁగా
మీకుందారనొసంగఁదన్నదదియే - మేలంచుభావించితిన్
గైకొన్నం జెడుఁబో ? భరింపఁగలడే ? - కాంతామణిన్ విప్రుఁడా
లోకింతున్ త్వరయేలనంచుమదినా - లోచించితే ? దుర్మతీ ! 19

క. కాడెఱుఁగనివారమురె । ట్లాడినసమ్మదుము సత్య - మని, మేమెదలో
కీడును మేలునుదలఁపము । బాడబులముగిక్కురింపఁ - బాడియెమమ్మున్. 20

క. తలఁపొకటియుఁబలుకొకటియుఁ । గలవారలనాశ్రయింపఁ - గారాదిటుయీ
వలవనిదానము దానమె ? । పలుకంగాఁదగదె ? కాని - పనియదియనుచున్. 21

గీ. జాయనర్పించినంతట - సంభవించు । చెట్టలన్నియు నెఱిఁగియుఁ - జెప్పవైతి
వించుకైననునార ! నీ - సంచుమాకుఁ । దెలిసెనరిపరి ! నీకాంత - వలదువలదు. 22

గీ. పదరివాగ్దానమొనరించి - పిదపనాయ । భీష్టసంపూర్తిఁగావింప - కిట్లుకపట
తంత్రములుచేసితివిగాన - దానిసలనఁ । బలికిబొంకినదోషంబు - గలుగునీకు. 23

వ. అని పలికిన. 24

ఉ. నిర్మలమానసుండు ధర - ణీవిభుఁడిట్లనియెన్ యిదేమయా !
ధర్మమిదెట్లగున్ ? వెలయ - దత్తముఁజేసినకాంత నొల్లకి
ట్లార్మిలినీవయేలుకొను - మంచువచింపఁగఁబాడియే ? భువిన్
శర్మతొలంగుకార్యమును - నేనొనరింపఁదలంతునే ? మదిన్. 25

ఆ. కోరియొసఁగుమనిన - దారనర్పించెద । నంటిమరలవలవ - దనుటకడున
ధర్మమైనమాట - దత్తాపహారంబుఁ । జేయఁజాలనేను - శిష్టచరిత! 26

మ. అమరబ్రాహ్మణవృత్తి సంగ్రహణదు - ర్వ్యాపారులన్యాపకా
రమతుల్గోగణ జాలహంతకులు ధ - ర్మధ్వంసకుల్ సంతతా
క్రమకార్యప్రియు లాదిగాఁగలుగువా - రల్మేలుదత్తాపహా
రముఁగావించినవానికంటె ననిశా - స్త్రంబుల్ప్రబోధింపవే? 27

గీ. చానమకుమారి కష్టసం - సారమెట్లు । జరుపుకొననేర్తు ? ననియెదు - జడుపువలవ
దద్దిరయైననునిచ్చెద - నిపుడుమీకు । వేఁడుఁడా! వాంఛగలవాని - విమలభావ! 28

ఉ. నావుఁడుభూసురుండునగి - నల్లవొమెచ్చుకొసంగరాదె ? ని
న్నావటమైననీనుడువు - లర్థముతెంతయు రాజచంద్ర! యీ

భావము పూర్వపుణ్యపరి - పాకసముద్భవమౌను కోరితో
గావలెనన్న(గల్గదుజ - గంబున(జేయుట యెల్లవారికిన్. 29

ఉ. ఇంతినొసంగి, 'వాంఛితము - నిచ్చితిబొమ్మనకింకనున్ 'సమ
ర్పింతునుమీకు(గోరినది - తృప్తిగ' నంటివిచాలమేలును
మ్మెంతయుసంతసంబొదవె - నింకవచించెద(గాని 'హానియ
త్యంతముగా(గవే(డెనుదు - రాశ(గలాం' డనియెంచకాత్మలోన్. 30

చ. తివుటను(దీర్ప(గాననుమ - తించితివోటమదీయవాక్యముల్
దెవడకవేక్కతో భవద - ధీనముసంగలవారణోష్ట్రసైం
ధవరథ యానసౌధధన - ధాన్యములాదిగ( గల్గుసర్వమున్
బ్రవిమలబుద్ధినిమ్మ్రజన - పాలక! యంతియ చాలువే(డితిన్. 31

మ. అటులైనన్ భవదంగనన్ బడసిసౌ - ఖ్యంబొందుదుంజుమ్మ్రనే
నటవీవాసముమాని సర్వజనస - న్మాననార్హమైనట్టి యీ
పుటభేదంబుననుండెదన్ దనివిమై - భూయిష్ఠభోగంబు లొం
దుటకీమాత్రము చాలు(జాలునిదియెం - తోగొప్పనాబోటికిన్. 32

క. అత్యాశతగదుగానయ । గత్యము(గలవఱకు మితము - గానడిగితినో
సత్యవ్రత! యల్పంబన । కత్యర్థముగా(గ నెంచి - యవినాశిమ్మా! 33

క. ఇచ్చెదనంటివివెఱచిన । మెచ్చరునినుసాటివారు - మేకొనునీకున్
హెచ్చగుపాపమువినుమా! । రచ్చకుపాలగుదుమవల - రాజన్యమణీ! 34

క. కీర్తి(గొననెంచుచును(డప । కీర్తికిమదివెఱపు(గొన(డు - కింజా(డుధరణీ
భర్తవుధర్మపథంబున । వర్తించుటమేలునీకు - వరగుణశీలా! 35

క. భక్తియువినయంబునునను । రక్తియుసౌజన్యమొరిమ - రాజులకు పరి
త్యక్తము సేయ(గ(దగనివ । యుక్తంబగునట్టి నడత - యొప్పదెవనికిన్. 36

వ. కావున సత్యంబు(దప్పక ప్రవర్తింపుమనినదరహాసితవదనుండై విజయాశ్వుండతనికిట్లనియె

శా. భూగీర్వాణవరేణ్యా ! మీరలుమహా - పూజ్యుల్మహాప్రాయు లా
భోగజ్ఞాన విరాజితుల్ సుగుణ రూ - పుల్ గాన నన్నెంతయుం
ద్యాగింగా మదినెంచివే(డితిరి మే - లయ్యెంగడున్నీకునా
వైగారాబము సంఘటిల్లెనగుటన్ - ప్రాకామ్యముల్ చేకుఱున్. 38

గీ. ద్వాపరమునొంద కొస(గితి(-దాపసేంద్ర ! । యడిగినవియెల్ల, ననుడు మే-లయ్యెమాకు
మెచ్చితిని నిన్నునీవలె - నిచ్చునట్టి । పార్థివు(డులే(డు భువినిన్ను - పాల ! నిజము. 39

ఉ. కోరినవెల్ల నిచ్చితివి - కొంటి నసౌఖ్యతపః ప్రవృత్తికిం
దూరు(డనైతి నాత్మ(గల - దుఃఖము నే(టికి( దీఱెనింకసం

సారమహా సుఖానుభవ - సక్తి మెలంగెదవంచుఁ బల్కి యా
గారడపుం దపస్వి త్రుటి - కాలము యోజనఁ జేసి యంతటన్. 40

క. బెగడొందిమానసంబున । వగగదిరిన వానివలె వి - వర్ణముఖుండై
జగతీవరుఁగనియిట్లను । సెగయార్పులునిగుడ, నోయి! - చెడితింజెడితిన్. 41

క. నేజడమతినై బాగుగ । యోజనఁగావింపనైతి - నోహో! తెలిసెన్
వ్యాజము, వెతనొందుటకున్ । భాజనునిగఁ జేయనీవు - పాల్పడితివయో! 42

క. అనిపలికిననదియెల్లం । దునఁగీడుపాసంగునొక్క - తోఁచదునాకున్
వినిపింపుఁడయ్య! యనియడి । గిననృపతింగాంచిమౌని - కినుకయెసంగన్. 43

క. అతనికినిట్లను, నోరీ! । మతిహీనుఁడ! యెఱుగనట్లు - మమ్మడిగెదవీ
చతురతకేమందును? నీ । సతినొల్లను సిరులనొల్లఁ - జాలుంజాలున్. 44

చ. మముఁ జెఱుపంగ నెంచితగు - మాటలచేఁ గడు వేలు పుచ్చి ధ
ర్మమును నధర్మమాత్మనణు - మాత్రము నెంచక యిట్లు పుణ్యపా
పములవిచారమున్ విడిచి - ప్రాపని చేరఁగ వచ్చినంతన
క్రమమగు దుష్క్రియావిధులఁ - గారియ పెట్టియలంచఁ బాడియే? 45

ఉ. ఇచ్చెదనంటివన్నియును - నిందఱునున్ వినగొప్పగాఁగనీ
విచ్చును వేఱు గాఁదలఁచు - టిప్పుడెటెంగితినోరి! నేవృథా
మెచ్చితిగానలేక నిను - మిక్కిలియోగ్యుఁడ వంచునమ్మి, యీ
తచ్చనమాటలుం గ్రియలు - తాపసవర్యులచెంతఁ జెల్లునే? 46

ఉ. వృద్ధుఁడనౌట బాగుగవి - వేచనఁ జేయఁగలేమిఁ జేసినే
వృద్ధియుహానియుం దెలిసి - వేఁడకపోయితి, నైన? నోరి! య
శ్రద్ధననర్హదానము నొ - సంగుటయొప్పునె? నీకు మేలు మే
లిద్ధరలోననీచెయిద - మెవ్వరు మెత్తురు? పార్థివాధమా! 47

క. నేనడుగుటకున్ మఱచిన । వానిని నీవైనఁ దెలుప - వలదే? మమునె
ల్లైనియుఁగికురించుటకుం । బూనిననీకెట్టులబుద్ధి - బుట్టువలుకఁగన్ 48

క. తమమాటలు మృదుమధురము । లమితకఠోరంబుహృదయ - మఱజాతులుని
క్కముగఁదృణాచ్ఛాదితకూ । పములునృపుల్ నమ్మరాదు - వారలనెపుడున్. 49

క. భూవరులతీరు వేఱొక । భావంబును నొక్కమాట, - పలుకరునిజమిం
కేవిధమునఁగావింపఁగ । నీవెంచితివో యెఱుంగ - నేరంజుమ్మీ! 50

క. వలదువలదునీదానము । వలనంబాలిలేదుమాకు - వసుధామరుఁజి
క్కులుపెట్టఁదగునె? యివ్వఁగఁ । దలపోదవకయున్నఁ జెప్పఁ - దగదేమాతోన్. 51

క. అఱిమరతఁగదిఁకఁగడున | క్కఱఁగొని వేఁడితినొసంగఁ - గలవని, నీకుం
గఱదజనింపకయుండిన | మఱియొక్కనినాశ్రయింతు - మర్మముఁజెపుమా! 52

క. ఒవ్వనియీవియునీవియొ ? | నవ్వులపాలగుటెకాని - నలఁకువమాకీ
చివ్వవలదింకననవిని | నివ్వెఱపడి యతనితోడ - నృపుఁడిట్లనియెన్. 53

క. అయ్యో! నాసేరంబిపు | డెయ్యది? యడిగినవివేఢ్క - నిచ్చెదనంటిన్
నెయ్యంబుమానియివ్విధి | వయ్యముగానిందసేయ - వచ్చునె? నన్నున్. 54

మ. అనఁడున్మానివరేణ్యుఁడోరి! వినుస - ర్వైశ్వర్య ముజ్జైందినే
ఘనతన్బొందుదు నన్ననన్నుసిరిన్ - గావంగసైన్యంబుగ
ల్గినఁగాదే? సుఖముల్బ్రసంగునకటా! - లేకున్నవిప్రుఁడువీఁ
డెనమాకెంతనికొల్లలాడరె? దురా - హంకారులౌదుర్జనుల్. 55

శా. ఏమోమాటలసందడిన్ మఱచినే - నీకోరికంజెప్పలే
దామూలంబుగ సర్వసంపదలుఁదా - నర్పించెనింకీభట
స్తోమంబీతనికేమిసేయుటకు? యి - చ్చ్ంగాపుగానుంటకం
చామోదించితి, సేనమీఁదనకనీ - వాసింపఁగాఁజెల్లునే ? 56

చ "పదుగురిలోనొసంగనని - పల్కుటగొప్పతనంబుగాదుయి
చ్చెదననిచెప్పెదన్మునికిఁ - జిత్తములోఁదమకించి యింతలోఁ
నెదవడరాదుకైకొనిన - నెల్లనుఁగైకొనుఁగాక సైన్యమున్
వదలెనితండుచాలుబల - వంతునకున్ సిరిగల్గకుండునే? 57

చ. పదరకయుండిపిమ్మటనె - పంబులు కొన్నివచించియెట్లునీ
ముదుకనిఁబాఱఁదోలిసిరిఁ - బొందుదుఁగాక బలంబులున్ననా
కిదియొకలెక్కగా" దనుచు - నెంచియెఱుంగనివానిభంగిస
మ్మదమునఁజెప్పవై తివిటు - మాటొడఁజేయఁ దలంచుటొప్పునే? 58

క. కరిఁగొన్ననంకుశంబె | వ్వరిదోరి వచింపుమిపుడు - ప్రకటంబుగనీ
సిరినంతయునిచ్చియుభట | వరులనొసఁగవలయుననుచు - భావింపవొకో ? 59

ఆ. అనుచుఁగనలిపలికె, - నతనిఁగన్గొని విజ | యాశ్వుఁడిచ్చినాఁడ - ననియెసైన్య
ములను, మఱలతపసి-తలయూఁచియోజించి | యాసుఁగఅచిసంశ- యంబుఁజెంది. 60

క. గజిబిజిపడియిట్లనునో | యిజనాధిప! నామనమున - నింకనునొకయ
క్కజమగుశంకయొదవెనది | నిజముగఁగావింతుననిన - నీకతెఁగింతున్. 61

క. ఆలోపమపనయింపని | చోలేదునుఖంబుమాకు - నుడివోవును నీ
చేలబ్ధమైనదంతయుఁ | జాలఁగసంకటములొదవు - సత్యమునుమ్మా! 62

వ. దీనికేమియుపాయంబుఁజెప్పెదవో యెఱింగింపుము. నేనడిగిన విధంబునఁ జేయఁజా లవేనిదత్తంబొనరించిన సర్వంబునుం బెట్టుకొని నీవేసుఖంబులనుభవింపుము. నేనెందేని యుంజనియోగ్యులగు వదాన్యులనాశ్రయించి వేఁడి వాంఛితార్థంబుఁగొని సుఖంబునొం దెద, ననినతనిమాటలకుఁ దలంకకరాజిట్లనియె. 63

క. మునిపనమీకెయ్యదియై । ననునిచ్చెదసంకమాని - నన్నడుగఁగనెం చినసియునేజేయఁగవల । సినదియునుం జెప్పఁడ ! తాప - సిఁపకవింకన్. 64

గీ. అనెనవాచంయమీశ్వరుం - డవనివిభునిఁ । జూచియిట్లనుయోజించి - లోచెయిపడి పలుకుమడిగిన - పిమ్మట కలతఁబడఁగఁ । దగదునీయిష్టమింక నా - తప్పలేదు. 65

క. అనిగట్టిగఁజెప్పిననగి । యనుమానంబేలనోమ - హాత్మా ! యేమై ననునయ్యెనడుగుఁడిచ్చెద । ననిచెప్పితినిన్ని మాట - లనేమిటికిన్ ? 66

క. అతిముతిపడిమదిలోనే । మతియొకవిధమెంచికిఱుదు - మాటాడుదునే ? వెఱవనుపలుకుఁడ ! యనవుఁడు । నెఱిఁగెదనీమతమువినుమ - హీవర ! కోర్కిన్. 67

వ. అనిపలికిమౌనీశ్వరుఁడొక్కింతతడవుయోజనఁగావించి. 68

క. మాటికిమాటికినొక్కక । పేటికివేఁడుటయుఁగొనుట - హీనంబదినే నోటిల్లకవలసినయవి । ధాటిగనొకమారె యడిగె - దన్ వినుమధిపా ! 69

మ. గృహదారా ధనవస్తువాహనభట - క్రీడావనాదుల్ కృపన్ స్పృహదీఱంగనొసంగినాఁడవికన - క్షీణోన్నతింగొంటినే మహదైశ్వర్యముఁగల్గువాఁడఁగద ! నీ - మాడ్కిన్ మహీశత్వమున్ వహియింపందగునంచునెంచితిఁగడుం - బ్రఖ్యాతిశోభిల్లగన్. 70

ఆ. రాజ్యాగాకయున్న - రక్షించుకొనుపెట్లు । బహుళమైనయట్టి - భాగ్యలక్ష్మి నాధిపత్యమొసఁగి - యలరజేయుమునన్ను । ననిన, నిచ్చినాఁడ - నదియుమీకు. 71

క. మీరేనేఁడుమొదల్కొని । నారాజ్యంబంతటికిని - నాయకులనఘా ! కోరినవన్నియునిచ్చితి । గారవమునసెద్దిచేయఁ - గలదిఁకననుఁడున్. 72

క. సంతసమునన్నృపుఁగని యె । క్కింతవిచారించివిప్రుఁ - డిట్లనియెను నీ యంతటివారలఁగలరే ? । యంతయునొసఁగితివివేఁడి - నంతనెభూపా. 73

క. కొఱలేకసర్వమునుఁజే । కుఱగానియొకింత తలఁపుఁ - గొని తలఁకకయి త్తఱినీవుసేయవలసిన । చిఱుపనులొకకొన్నిగలవు - చెప్పెదవినుమా. 74

సీ. సర్వసర్వంసహా - చక్రప్రభుత్వోప - యుక్తమౌముద్రిక - నొసఁగవలయు నొసఁగుపేకాకన - నొద్దయనిఁగాఁబ్రజ - త్వేకొనులాగున - సేయవలయుఁ

జేయుటే కాకయే - చెట్టయుమముఁజెంద - కుండులాగునఁగాచి - యుండవలయు
నుండుటే కాకమా - యొద్దనే సేవకా - వృత్తినినీవు జీ - వింపవలయు
ఆ. నిదియనాయభీష్ట - మింతమాత్రముచాలు। నింకమీఁదనడుగ । నెదియునిన్నుఁ
బొసఁగునెల్లగతుల - భోగంబులలైన । నీమతంబదేమొ - నిజముఁజెపుమ ! 75

క. అనినిర్బంధముగానడి । గినమునికోరికలనాల - కించినరేంద్రుం
డనుమానముమదిఁగదురఁగఁ । దనలోనిట్లనుచునపుడు - దలఁపఁగఁదొడఁగెన్. 76

క. ఇవ్వసుధామరవర్యుని । నవ్వడిఁగననిక్కమైన - సంయమియనరా
దొవ్వనికోర్కులఁగోరుట । కువ్వాడమెగానియెందు - కొఱకివితనకున్. 77

మ. ఇతఁడాకైటభదైత్యమర్దనుఁడొభూ - తేశుండొచండాంశువో
శతమన్యుండొధరానురాకృతిని మ - త్సత్యంబునాదార్యమున్
ధృతియుంభక్తియుఁగన్గొనంగనిటకే - తెంచెన్నిజంబింతయిం
కితరుండైననసర్వమాననకదా - నిభ్భంగివాంఛించునే? 78

ఉ. ఆకులుకాయలుందినివ - నాంతరభూములనుండి కోరిక
లొప్పికడఁబెట్టిసంతతము - బుద్ధిఁజలింపఁగనీకనిల్పియ
స్తోకతపఃక్రియానియతిఁ - జొక్కుమునీంద్రుఁడు బాహ్యకాంక్షచే
వ్యాకులమొందనెంచియిటు - యాచనఁజేయఁగనిందువచ్చునే ? 79

క. ఏతపసిమున్నరాజ్యం । బీతనివలెనేలుకొనెద - నిమ్మనితానే
భూతలపతినడిగె? నిదే । మోతంత్రముగాఁగఁదోఁచు - చున్నదినాకున్. 80

క. అడిగినవన్నియుఁదలఁకక । యొడఁబడియర్పింతువ్రతము - నుడుగఁగఁజాలన్
జెడుగొదవినమేలొదవినఁ । గడపటనేదైనదైవి - కంబదితలఁపన్. 81

మ. అనియోజించిధృతిన్ వహించితన స - త్యాచారదాతృత్వము
ల్జనముల్మెచ్చఁగ సంశయింపకపుడా - సర్వంసహాభర్తయ
మ్మునినాథుంగని, యోమహాత్మ! కొనుఁడా ! - మోదంబుతో మీకుస
ర్పణముంజేసినవాఁడ రాజ్యమును స - ర్వస్వంబునుందృప్తిగాన్. 82

క. వినుఁడా! మఱియునుమీరడి । గిననాలుగువిధములైన - క్రియలునుఁగావిం
తునుతప్పకమదిసంశయ । మునుఁజెందఁగవలదుసత్య - మునువీడుదునే ? 83

క. అనిపలికియించుకేనియుఁ । దనలోలోశంకింపకతఁడు - తత్క్షణమునఁబూ
జనమొనరించెను మునిఁబరి । జననికరానీతవస్తు - సమితింగొనితాన్. 84

క. పూతాక్షతాంబువులఁగొని । త్రాతారంమాంమదీయ - దానేనహారి
ప్రీతోభవతనియమ్మని । చేతులలోధారవోసె - స్థిరమగుభక్తిన్. 85

క. ఈరీతిని నిజరాజ్య | శ్రీరూఢిగ నర్పణంబుఁ - జేసి తపస్వి౯
గౌరవమున నిజపీఠస | మారూఢుఁ గొనర్చి మెచ్చి - యపుడిట్లనియె౯. 86

క. జయ లోకచక్రవర్తీ! | జయ తేజోకలితమూర్తి! - జయనుతకీర్తీ!
జయ పుణ్యభావ! పావన! | జయ సద్గుణభవన! దోష - జలదపవనా! 87

క. దేవా! కోరినభంగిం | గావించితి మేలు నొందఁ - గంటిని నేమీ
సేవకుఁడనై మెలంగెద | నావనితయు మిమ్ముఁ గొలుచు - నయవినయములన్. 88

ఆ. సాధ్వియగు మదీయ - జాయ బాయకఁ జాలఁ | బ్రియము మెసంగ నుపచ - రింపుచుండ
నెందుఁ గొఱఁతలేని - యిచ్ఛాసుఖంబుల | ననుభవింపుఁ డింక - మునివరేణ్యా! 89

క. మీ రే యాజ్ఞ యొసంగిన | గౌరముగఁ దలధరించి - కావింపుదు నా
తీరున ననిమకలనము | స్కారం బొనరించి మిగుల - సంతోషమునన్. 90

క. ధరణీపాలకుఁ డీముని | వరుఁ డిది మొదలితనిఁ గొలువ - వలయును మీరల్
నిరతంబు ననుచు నంతటఁ | బరువడిఁ జాటంగఁ బనిచెఁ - బ్రజలకుఁ దెలియన్. 91

ఉ. పౌరుల నెల్లరాఁ బనిచి - భక్తియురక్తియు నగ్గలింపఁగా
మేర నెఱింగి మానినుఁడి - మీరకనామెడవోలె సంతతం
బారడ మొప్పఁ గొల్చి విన - యంబెసఁగంగ మెలంగఁగావలెన్
మీరలు మీరు మీరనుచు - మేకొనఁ జెప్పి నృపాలుఁ డేర్పడన్. 92

క. వారపుడు రాజుమాటకు | మారుం బలుకంగలేక - మర్యాదమునై
యూరకతల లూఁచిసరే! | యారీతిగ మెలఁగువార - మనిరప్రీతిన్. 93

గీ. ఇటుల సంయమివరుఁడాను - పీఠు సేఁచి | యతని పత్నినిమఱియును - సతిశయించు
సకలసామ్రాజ్యపదవిని - సంగ్రహించి | యుగ్రునకు సచివత్వంబు - నొసఁగి వేడ్క. 94

క. తనయిచ్ఛ బాగు దుశ్శా | సనములఁ గావింపఁగాంచి - జను, లెన్నఁడు నె
క్కనివాఁడు గుఱ్ఱమెక్కిన | వెనుకయ్యో ముందటంచు - వికవికనవ్వన్. 95

క. వాకలపరిహాసోక్తుల | తీరున్ బరికించి యట్టై - తెక్కలిముని తా
పౌరులఁ గనికలుగని గం | భీరత వహియించి తిట్టి - వెఱపించుటయున్. 96

క. ఉఱవెఱుఁగడు రాజనుటకు | గుఱుతా? యిది వీనికింత - కోపము దగునే?
యఱజాతియనుచుఁ జిఱ్ఱున్ | జిఱచిఱలాడుచుఁ గలంగి - చీరికిఁగొనకన్. 97

క. వీనికి వెఱచెడివారి | చ్చో నెవ్వరుగాని, రాజు - చూచినఁగినియున్
బోనిండని మారాడక | మానంబున నుండిరచటి - మాన్యులు ఘనుల్. 98

క. ఆసమయంబున మాయా! భూసురుఁ డుల్లాపమెదను - బొదలఁగఁ దనకున్
దానుండై నిజకల్పిత | శాసనసంబద్ధుఁడైన - జనపతిఁ గని తాన్. 99

వ. మందహాసవదనారవిందుఁడైయాతనిఁజేరంజీరియిట్లనియె. 100

ఉ. ఓవిజయాశ్వ! నీవుమది - నోడకవేఁడినవానినెల్లని
చ్ఛావిధినిచ్చిలోకమున - శాశ్వతకీర్తికిఁగర్తవైతివి
ట్లీవియుభక్తియుంస్మృతియు - నెందునుజూచియెఱుంగనెప్పుడున్
నీవలెనిచ్చమెచ్చఁగలుగు - నేతయొకండొసఁగెంగులాంగనన్. 101

ఉ. సంతసమయ్యెనాకుమది - సర్వముఁజేకుఱెసట్లుగాఁగనా
హింతునుగాని, యైననిపు - డింకొకయోజనగల్గవింకెొ ? నీ
కాంతయనన్యయౌవనవి - కత్థనసుందరమూర్తియంతెగా
దంతయుఁగోమలాంగినిజ - మెన్నఁగనేజరఁబొందఁజాలఁగన్. 102

గీ. వయసుఁగలదానికినిముది - వగ్గనకును | నెటులపొత్తగునెద్దుతా - నెండలోని
కీడుచునుదున్ననీపల - కీడ్చునెడి | జాపసరిపడదంతరం - బేడకేడ. 103

క. వినుమా ! నాదేహస్థితి | మునుపటిలాగనఁగరాదు - ముదిసితిచాలన్
ననఁజివ్రుకుననుచులెక్కకుఁ | గొనరెవరును నీకుభక్తి - కుదిరెనునాపై. 104

క. వయసుఁగలకాలమంతయు | వ్యయమొనరించితినిసుమ్ము - వ్యర్థంబుగనేఁ
బ్రియముననేఁటికినీదగు | దయనొకసంసారినయ్యుఁ - దలఁకెదజరకున్. 105

సీ. బారెడునడిచినఁ - బాదములుసేఁబడు - సడలెమైబిగిసుంత - శక్తిలేదు
గట్టిగామాటాడి - నట్టైనయలసట - జనియించుమునువలె - వినవుచెవులు
దూరదృష్టినశించెఁ - దొరకొనెఁబెడుకాస - వికృతిగాత్రములు - వెలికిఁదోఁచెఁ
దుచలింపఁగసాగె - దవడలుబ్రేలెను - దంతపటుత్వంబు - దప్పిపోయె.

గీ. క్రమముగాయిట్లు ముదుకల-క్షణములెల్ల|నొక్కటొకటిగఁబొడమిన-నొప్పింపఁదొడఁగె
నింతజరనుండకాటఁదా - నేలిగొనక | సేయునేకాపురంబునీ - జాయచెపుమ! 106

క. ఇంతటివృద్ధుఁడనయ్యును | నింతులపైమమతమాత్ర - మెపుడునువిడదప
త్యంతంబదియగుటనెయి | ట్లింతయునినువేఁడికొంటి - నిపుడాసక్తిన్. 107

గీ. కోరియైశ్వర్యమంతయుఁ - గొనియునిష్ట | సిద్ధిగాఁజాలదనియెడు - చింతదోఁచె
వనితననుమెచ్చదగుటనీ - వైభవంబు | లెల్లవలదింకమరలవీ - కిచ్చిచనెద. 108

గీ. అటులఁగైకొనఁగానొల్ల - నందువేని | యడఁపుమెట్లైన నామనో - వ్యథయుఁగొంకుఁ
జెట్టునాటితివదివృద్ధిఁ - జెందునటుల | నీరుఁబోయకమానుట - నీకుదగదు. 109

ఉ. పంచినవేడ్కవేఁడితిశు - భంబనినీబహుళార్థరాజ్యభో
గంబులుసర్వమున్, మిగుల - గౌరవమొప్పఁగనిచ్చినాఁడవై .

నంబోలిలేదనుమ్మ! జన - నాయక! బోధనఁజేసి వేము వా
క్షంబును జెందుభంగినివ - శంబొనరింపుము మాకునీసతిన్. 110

క. ఆరీతిఁజేయకుండిన । నారీమణివలచుననుచు - నమ్మఁగఁజాలన్.
భూరమణ కోరినాతోఁ । జేరివిడకఁగాపురంబుఁ - జేయ దలంచున్. 111

క. ఎంతటి నేర్పరియైనను । నింతికిమదిగలుగకున్న - నెబ్భంగినిఁగా
వింతునుసంసారమునొక । సుంతైనను గలదెచెపుము - సుఖమట్టి తతిన్. 112

గీ. ఒల్లకలయించుచుండెడి - యువిదతోడఁ । గాపురముఁజేయు టెంతయుఁ -గష్టతరము
కోలవిఁగొనినడితలగోకు-కొనినయట్లు । గాదె? సంతృప్తియెవ్విధిఁ-గలుగుస్పృహకి. 113

సీ. ముదితరో! నాకొక - ముద్దుపెట్టుమటన్న - ముదుకకేమిటికంచు - మోముఁద్రిప్పి
కాంతాశిరోమణీ! - కౌఁగలీవేయన్న - సదలించి జెదరించి - యవలికేగి
సకియనీమోవిపా - నకమానినిమ్మన్న - చుఱచుఱచూపులఁ - జూచి తెగడి
చెలువనీగబ్బిచ - న్నులనంటనిమ్మన్న - వెగటొందినెటికలు - విఱిచి నవ్వి

ఆ. పలుకవేయటన్న - నలిగిమానముఁబూని । సరసముగవచింప - విరసమొంది
యలఁచుబోటిఁగూడి-యక్కటా! సంసార । మెవఁడొనర్పనేర్చు?-నేమిసుఖము? 114

ఆ. సతికిఁబూరుషునకును - మతిమతిగలియక । యుండెనేనికష్ట - మెందునిజము
చుట్టుకొనెడిచాప - కట్టడియాలునై । యున్నఁదృప్తినెటుల - నొందుమగఁడు. 115

వ. కావున. 116

ఉ. వంచనవీడినీవుసని - వారిజగంధికిమత్ప్రభావము
గ్గించివచించిరక్తిమదిఁ - గీల్కొనురీతిననీతులంబ్రబో
ధించికలంకుమాన్చితగు - తీరునఁదోడ్కొనిరమ్మునీవడిన్
మించిననేన వచ్చెదను - మీఁదటనెవ్విధినైననయ్యెడున్. 117

క. ఏమనునో, నీవువినం । గామానినితోడనేమ - ఖాముఖిఁదెలియం
గామాటలాడవలయున్ । మోమోటంబేల? యింక - మఁదమఁదయేలా? 118

క. ఆధవళాబ్జనయనమా । స్వాధీనంబై మదాజ్ఞ - జవదాటకని
ప్రౌఢమతిమెలఁగుతత్త్వము । సాధించెడిదనుక నీవు - చనరాదెందున్. 119

క. అనియాజ్ఞాపించినమీ । యనుమతిఁదలఁదాల్చిపోయి - హరిమధ్యనువే
గొనివచ్చెదమీచెంతకుఁ ! గనుఁడీకననుకూలవతినిఁ - గానొరింతున్. 120

క. అనిపలికిపిలువఁబనిచెన్ । మనుజేంద్రుండవలనేగి - మంజులవాణిన్
ఘనవేణిన్సుశ్రోణిన్ । వనరుహశంకాశరమ్య - పాణిన్రాణిన్. 121

చ. పతిపిలువంగఁబంచుటయు - భామినిచాలఁగసంశయించియా
గతిఁదనరాణివాసమునుఁ - గాదనితొయ్యలిఁదాసభాంతర
క్షితికిపుడేలరమ్మనియె? - శీఘ్రముగా, నటనంతసంకట
స్థితియదియేమిచేసునొకొ - డెందముచిత్రముగాఁగఁదోఁచెడిన్. 122

క. కారణములేకసభకే । లారావించున్? విభుండ - లంఘ్యంబగును
ర్వీరమణునిశాసనమున్ । మీరిచరింపంగఁదరమె? - మృడునకునైనన్. 123

క. తెలియనివాఁడాతానే । తలఁపునరమ్మనియెనొక్కొ - తగదీకార్యం
బలఁతియనర్థంబనినేఁ । దలఁకినఫలమేమిగలదు? - తప్పదుచనకన్. 124

ఆ. అనుచునిశ్చయించి - యంతఃపురమునుండి । వెడలెఁగొలువుకరుగ - విద్రుమోష్ఠి
తనరమేఘమధ్య - మునుండివెలువడి । మెఱయునట్టికారు - మెఱుఁగువోలె. 125

మ. పతియాజ్ఞన్ శిరసావహించిపరువుం - బ్రహ్లాదమొప్పన్ యశో
వతియవ్వేటికి వచ్చెమత్తకరిరే - ఖన్మందయానంబునన్
సతులిర్వంకలఁగూడిరాఁగవిలస - త్సౌందర్యసౌభాగ్యసం
యుత సమ్మోహనవిగ్రహంబనఁగఁదా - నొయ్యారమొప్పారఁగన్. 126

క. ఆరమణీమణిదివ్యా । కారంబునుజగ్గునిగ్గుఁ - గనుఁగొనిసభ్యుల్
దారునతనువులెఱుంగఁగ । నేరకఁగూర్చుండిరట్టె - నిశ్చేష్టితులై. 127

చ. అతివనుఁగాంచిమానియహా - హా! యిదిజూడఁగమేఘమధ్యని
ర్గతమగుచంచలాలతయొ - కైరవబాణునిసాయకంబొయా
రతియొకొజీవముల్గలుగు - రత్నపుబొమ్మయొలేకయామినీ
పతికళయోయటంచుమదిఁ - భావనఁజేయఁదొడంగెమెచ్చితాన్. 128

మ. అపుడాసుందరపూర్ణచంద్రముఖిడా - యన్ వచ్చిసందేహమున్
ద్రపయున్ భక్తియుసంభ్రమంబు వెలయన్ - దైవాఱ తేజంబుచే
త్రిపురధ్వంసినిఁబోలుమానికినిబ్బ్ర - శ్రీవభక్తకున్ మ్రొక్కిగా
ర్యపురీతిన్వినమించిచెంతనొకచో - టన్నిల్చియున్నంతటన్. 129

ఉ. రాజటుచూచియోమదవ - రాళసమానవిలాసయాన! న
న్నీజటిరాజ్యమున్ సిరులు - నిమ్మనినిన్నును వేఁడవేఁడినన్
భాజనమైనకార్యమని - భక్తినొసంగిత మాటఁదప్పకన్
భూజనులెల్లమెచ్చుమని - పుంగవునింబరితృప్తుఁజేయుమీ! 130

క. నియమంబువిడిచినిరిపైఁ । బ్రియమునవెట్టొసఁగకుండు - వేఁడిన 'ధర్మో
జయతి' యనుమాటవినవే? । భయమొందునెసత్యధర్మ - పథవర్తిమదిన్. 131

ఉ. కావునరాజ్యముఁ గ్రమ్మఱియుఁ - గాంచనవస్త్రసమూహదాసదా
సీజనహర్మ్యసౌధచయ - చిత్రవిభూష రథద్విపాశ్వముల్
నీకును నేనుసర్వమును - నేఁడు మొదల్గనుఁ దైన మానికిన్
గైవశమైనసొమ్ముదోలఁ - గన్ జనదీతని యాజ్ఞ సెప్పుడున్. 132

క. నాయెడల నెటుల మెలఁగుదు । వో యటుల నె మెలఁగి తృప్తిఁ - బొందింపుము సా
ధ్వీ ! యుక్తము నీకిది కడు । శ్రేయంబని తలఁపు మెదను - జేకుఱు శుభముల్. 133

క. మునినాథుని యాజ్ఞను మీ । రిననాదగు దానఫలము - రిత్తయగుంగా
వున నీపాతివ్రత్యం । బును సంరక్షించుకొనఁగ - బోలుం దరుణీ ! 134

క. ఎపుడె ట్లెయ్యది సెప్పిన । నపుడట్లెయ్యదియొనర్పు - మరమర విడిచీ
వపరాధ మొదవెనా ? భువి । నపకీర్తియు దూఱు నఘము - నందుదు మబలా ! 135

క. అనిపల్లభుఁ డాజ్ఞ యొసం । గిసని వ్వెఱపాటు గదిరి - గిరిశుచమారా
డిన నేమి తప్పుగలుగునొ । యని కొంకును జింతమీఱ - నపుడెడలోనన్. 136

మ. అకటా ! మానివరుండు వేఁడెసని ప్రా - జ్యంబైన రాజ్యంబుతో
సకలంబర్పణఁ జేసి చాలక సతిన్ - సాధ్వి న్ననున్ గర్మమెం
చక నెట్లుంగినొసంగె యోగ్యమని తా - క్ష్మాభర్త ; యర్ధాంగిని
ట్లొకఁడాసించిననిచ్చువాఁడుఁ గలఁడే ? - యోజింపరాదే ? మదిన్. 137

క. సతినితరునకొసఁగుట స । మ్మతినన్యుఁడు గొనుట తగునె ? - మతిమంతులిస
త్కృతియందురె ? దీనినియీ । క్షితి నెందును విననియట్టి - చిత్రము పొసఁగెన్ 138

క. పరపురుషులఁ గనియెఱుఁగని । తరుణిఁ బరాధీనఁ గాఁగఁ - దలఁ వ్రాసిన పం
కరుహాసనున నవలెఁగా । కొరులనసం గార్యమేమి - యుఁ లేదెన్నన్. 139

క. అనఘ ! యిది కడుఁ బతివ్రత । యనఁగా నుతి కెక్కె గోర - టన్యాయంబా
ననరాదె ? నృపతి, దానం । బనఁగా నిట్టిదియె ? యిట్టి - యాజ్ఞ యుఁగలదే ? 140

చ. ఒడఁబడి యెవ్విధింబరుని - యొద్దనొసర్పుదుఁ గాపురంబు నె
క్కుడి వికటంపు ధర్మమిది, - కష్టము చేకుఱె నేమి సేయుదున్ ?
చెడుపని యెంచు భూవిభుఁడు - సెప్పినమాటను మీఱ సాధ్యమే ?
కడఁగిసనుఁ బయోమతినిఁ - గావఁగలారెవరింక నీశ్వరా ! 141

క. అడిగినదానినొసంగుట । విడువంగారాని వ్రతము - పృథివీపతికి
ట్లడిగిన నేరంబిపుడీ । జడదారిదిగాక రాజ - చంద్రునిదగునే ? 142

క. బాడబుఁడు జాయ నిమ్మని । యోడక దగదనక నడిగె - యోగ్యంబని తా
తోడ నెయొసఁగక మఱుమా । టాడునె పతి యతని నేర - మగునే యిధియున్. 143

క. సత్యాత్ముఁడనఘుఁడసదృశుఁ । డత్యర్థార్థిప్రదుఁడుగు - ణాధారుఁడుదు
ష్కృత్యవిదూరుఁడుదలఁపఁగ । నత్యంతీనుఁడనంగ - నగునే ? నృపతిన్. 144

క. అతఁడేమిసేయు ? నాదులి । ఖితమివ్విధినుండెతపసి - కిన్ననుగోరన్
మతిగలిగెదైవగతియీ । క్షితినెవ్వరుగడువగలరు ? - చింతించినచోన్. 145

ఆ. ఇటకుదినదినంబు - నెందఱర్థులువచ్చి । కోరివలయువానిఁ - గొనుటలేదు
నేనెఱుంగనీమః - నింబోలుయాచకు । నెందునుండివచ్చె - నిందితండు. 146

క. వచ్చినవాఁడెదియడిగిన । నిచ్చుఁగదా ! యనుచుఁగోరె - నిమ్మనినన్నిన్
మెచ్చి ; యనిచానమదిలో । హెచ్చుగఁజింతించిమరల - నిట్లనితలఁచెన్. 147

ఆ. అవనిలోనదాత - యర్థులఁబిలిపింప । వలెనె ? తమకుఁదామ - వత్తురెఱిఁగి
ఫలయుతంపుఁదరువు - పక్షులఁజీరునే ? । చెలఁగివానికవియ - చేరుఁగాని. 148

క. పతియాజ్ఞమీఱినడుచుట । సతికిన్ధర్మంబుగాదు - నర్పింపఁగస
మ్మతమైననుగాకున్నను । ప్రతిపలుకకచెప్పినట్టి - పనిసేయవలెన్. 149

చ. పతికిహితంబుఁగోరునది - భార్యయనంబడుఁగాని పూనిదు
ర్గతులఁజరించుచుండునది - కాదుకులాంగన, యట్టికాంతదు
ష్కృతఫలమొందఁబాలగుఁగు - శీలయనంబడునంద్రు; నేమదిన్
ధృతినివహించిమద్విభుఁడు - దృష్టినిఁజెందువిధిన్ మెలంగెదన్. 150

గీ. విభునకపకీర్తిఁగలిగించు - వెలఁదియును వె । లందియే ? యదిహాలాహ - లంబుగాని
నేనునాపతియానతిఁ - బూనిచేసి । యతనిఁగీర్తిభాజనునిఁజే - యంగఁదగును. 151

క. అనిపెక్కువిధులఁదనలోఁ । గొనకొనియోజించుచున్నఁ - గోమలిఁగనియా
మునికోపాటోపంబున । జననాథునివంకఁజూచి - సహాసహితుఁడై. 152

శా. ఓహోహో ! తెలిసెన్భవత్కపటనీ - చోద్యోగమోసజ్జన
ద్రోహీ ! 'యాననిసమ్మతింపకుమునీం - ద్రుంజేరఁగా, నంచునీ
వీహేమాంగికిసన్నఁజేసితివియిం - కెట్లిచ్చగించున్ ? ఘనం
బీహావాకమునీకుఁగాకకలదే ? - యింకొండ్లకెందున్ ధరన్. 153

క. నిర్మలమతివైప్రియమున । ధర్మాధర్మములఁదెలిసి - తగఁజెప్పినన
న్నర్మిలిఁజేకొనకుండునె ? । దుర్మతమునసుండియొసఁగు - దువె ? నీదుసతిన్. 154

క. ఛీ ! నీకుంజెల్లదుఃయీ । దానవ్రతమింకవిడిచి - దాస్యుఁడనసుటన్
మానుమువేలదియనికడు । హీనంబుగఁబలుకుటయును మ - హీపతిచింతన్. 155

క. కపటమెఱుంగనినాకుం । గపటకళంకంబునొకటిఁ - గలిగింపకుఁడా !
చపలాక్షికిఁగనుసన్నల । నెపుడొసరించితి ? మునీంద్ర ! - యిట్లనఁదగునే ? 156

గీ. దైవ మెఱుఁగును నాయెడఁ - దప్పు లేదు । మిమ్ము సేవింపకున్న ? యీ - మించుఁబోణి
చేకొనుఁడు మీ శాసనం బయ్యెఁ - జెలువ నింకఁ । గోప మేఁదంగ మీ కెందు - గొదువ గలదు. 157

వ. అనిన నాగ్రహంబు మాని యొక్కింత దశవృత్రయోజించి యా చంచలాక్షి నీక్షించి, మందహాసం
బొనరించి విజయాశ్వనకిట్లనియె. 158

క. గుణవతి గాఁ దోఁపదుదు । ర్గుణములకున్ నిలయమిది, య - గుం గాదనవే
మణిరదన నీవు చెప్పిన । యణఁగిమణఁగి మెలఁగుచుండు - నా? యిఁక మీఁదన్. 159

గీ. దంతి తనదు శిరంబుపైఁ - దాన మన్నుఁ । జల్లుకొను నట్టులయ్యెనీ - చంద మిపుడు
గన్న, నా చేతఁ గలత్రాట - నన్ను నేన । గట్టుకొంటి నినిన్నన్నఁ - గలదె ఫలము? 160

క. మాకుఁ దగదనుటఁ దెలిసియు । నీకాంతకు మించువారు - లేక లేమి నినేఁ
జేకొనఁ దలఁచితిఁ, గడపటి । నేకరణిం జేయునొక్కొ - యీ చెడిపె, నృపా! 161

ఉ. ఇంతటి దుస్స్వభావయగు - చేర్పడఁ బల్కక కోరినంతయొ
క్కింతయుఁ గొంకు లేక సతి - నిచ్చెదనంటివి మంచిదైనయ
ర్థింతువె? సత్యభాషియను - పేరు వహించుట కిట్లు చేసితో
సంతసమయ్యె నీకపట - జాలమెఱింగితిఁ జాల మెచ్చితిన్. 162

క. తోలుత నిది చెడిపెయగుటం । బలికిన మారాడక పుడె - పరువుగఁ జనియ
న్యులవేఁడికొనసె? నను నీ । వలయింపఁదలంచి తెలుప - వైతివి కాదే? 163

క కొలఁగాని దానమును నే । నెఱుఁగక కైకొంటి నింక - నేమనినను జే
కుఱుచేమి గలదు? నేఁడే । యఱగొఱనాయందె పొసఁగె - నకటా! చెడితిన్. 164

క. అనిమానివగచి పలుకుట । వినిశాంతుని జేయునట్టి - విధమెట్లనియా
జననాథుఁ డెంచి మిక్కిలి । వినయంబున నిట్టులనియె - వెగటొందక తాన్. 165

చ. మిముఁ గికురింపలేదుకడు - మీయెడలం బ్రియమొందియున్నదీ
రమణి తలంకనేమిటికి? - రక్తినిఁ గూడి యభీష్టయోగ్యభో
గము లెసఁగంగ భూవరుని - కాయము గొల్వఁగ రాజ్యపాలనం
బమరఁగఁ జేయుఁడయ్యా! కృప - నాగయుఁడయ్యా! మమున్ బుధాగ్రణీ! 166

క ఈసుదతి సాధ్వి మీదగు । శాసనమును మీఱినడువఁ - జాలద హితముం
జేసిన నాపై గలదా । దోసము, శిక్షింపుఁ డెట్టులఁ - దోఁచిన నన్నున్. 167

క. అని చెప్పిన మంచిదికనుఁ । గొని మొదనుగదా! యిదెంత - గుణవతియో యిం
త నెవేగిరపడి యట్టి । ట్టనవలయునె? యెఱుఁగవచ్చు - నా వివరంబున్. 168

ఆ. అతివ యెట్టిదైన - నయ్యోనేఁ జెప్పిన । మాడ్కిఁ జేయుచున్న - మాకుఁ జాలుఁ
గొయ్యపిల్లి యైన - గొదు వేమి? యెలుకల । నలమి పట్టెనేని - యదియ మేలు. 169

చ. అనితలయూఁచి చూడ్కులున్న - పొంగనవ్వైఁబ్రసరింపఁజేయఁగ
న్గొని విజయాశ్వుఁడత్తఱిని - గొబ్బుననింతికిఁ గన్నుసన్న స
ల్పినపతిభావముం దెలిసి - లేమతలంకును సంభ్రమంబునన్
మొనయఁగ నానతోడమని - ముఖ్యునిఁ గన్గొని మానసంబునన్. 170

సీ. గాంగేయమయచేల - గాంగేయపరిపాల - సర్వేశచక్రహా - స్త్రాబ్జహార
భూదేవచయపక్ష - భూదేవసంరక్ష - పాపస్నుభవ్యరూ - పాబ్జహార
నాగేంద్రశయనిత్య - నాగేంద్రనుతనృత్య - చారిత్రరమ్యావే - సాబ్జహార
పుష్కరహితభాస - పుష్కరనునివాస - సదమలానర్ఘభూ - షాబ్జహార

ఆ. దీనపోషనాప - తీవ్రతాత్వమునకు । భంగ మొదవకుండు - భంగిఁ గరుణఁ
గాపుమనుచు భక్తి - తో వినుతించియా । యతివ తలఁకుమాని - ధృతివహించి. 171

ఉ. చన్నుల వ్రేగు సన్నడుము - సైఁచఁగలేక సియాడ భృంగపం
క్తిన్నగఁ జాలు ముంగురులఁ - దీరుగ నట్టిటుఁ బాయదీటు చుం
బన్నగఁ దాఁగ రాంగుళులఁ - బయ్యెదఁ జక్కఁగ నొత్తుకొంచు మై
వన్నియు మీఱ వచ్చి ముని - వర్యునకొయ్యన మ్రొక్కి యిట్లనున్. 172

క. వీడకి నేఁడా దిగమి । మ్మేడుగడగ నెంచి భక్తి - నెల్లప్పుడు నే
వేడుకతో మాటకు బదు । లాడక మెలఁగెదను సంశ - యము వలదనఘా! 173

క. మీరలు కోపించినయె । వ్వారిఁక మమ్మాదరించు - వారలు? మమ్మే
తీరునఁ జూచినఁ జూడుఁడు । నేరంబిది యనుచుఁ బలుక - నేర్తుమె యనఘా! 174

క. నావుఁడు ముని యిట్లను నా । రా వింతలు నీ పలుకులు - రాజతఁడుండం
గావగ్గుచు నేనోడయఁడఁ । గావలయునె? యిట్టివెఱ్ఱి - కలికియును న్నే? 175

క. కిగ్గాడిము దుకఁడీతని । పగ్గియకుం గొదువ రాజ్య - పాలనమా? యం
చెగ్గాడి పరిహసించెద । వెగ్గాడఁగఁ దగునె? మునుల - నిదియుం గోలియే? 176

చ. తగదిటు వల్కఁగాన వినఁ - దాపసశేఖర! మాఁవవైరిసా
క్షిగ నకలంకబుద్ధిని వచించితి నేమిము గేలికొందు నే?
తగనిఁక నన్నుఁ గూడి సుఖ - దంబగు రాజ్యము నేలుఁడయ్య! పెం
పుగ, భవదాజ్ఞఁ జెందలను - బూని మెలంగెదఁ దృష్టి చేకుఱన్. 177

గీ. అనిన విని చాలఁగా ముద - మందితపసి । మంచిదగ్గైన నేసమ్మ - తించినాఁడ
నీవు నాదానవిది మొదల్ - నీకు మొదటఁ । జెప్పవలెనొక విషయంబుఁ - జెలువ! వినుము. 178

క. తిలలుండ్రైలము పుష్పం । బులు నుందావియు నుదుగ్ధ - ములు నీరంబుం
బలెఁ గలిసి యభేదముగా । మెలఁగం గావలయు నింక - మీదట మాతోన్. 179

క. చెప్పినపనిఁజేయుటకుం । దప్పఁగరాదలఁతిగొప్ప - తగుఁదగదనరా
దప్పగిది మెలఁగకుండిన । ముప్పనుగలిగింతునీవి - భువనమునీకున్. 180

క. చనుమంత్రపురమునకుం । జను దెంచెద నేనుననిన - చంద్రాననమే
లనియాజ్ఞఁగొనిరయంబున । పనివినిమొదననిమెనాత్మ - పతిఁగనిభక్తిన్. 181

గీ. అతఁడొకింతయుశంకింప - కరుగుమబల! । పావనాకారుఁడగుమౌని - భావమెఱిఁగి
యాజ్ఞఁదలఁదాల్చివర్తింపు-మదియకీర్తి।యనియె, వందన మొనరించి -యతివ*నియె. 182

చ. అటులఁగులాంగనన్ బరున - కర్పణముల్ బొనరించిక్రీరతం
దటుకునరాజ్యముల్ సిరులు - దత్తమొనర్చిపరిద్రునట్లుసం
కటములనొందఁబాల్పడియుఁ - గన్నుఅఁజెందకయున్న రాజున
చ్చటఁగలసభ్యులట్టిఁగని - చాలఁగభీతిలిదుఃఖితాత్ములై. 183

క. కులసతులునుసుతులును మి । త్రులుధనముం బ్రాణములకు - తుల్యములుసుఖం
బులకుంబాదీనాల్గును । గలనైననువీనివిడువఁ - గాఁచగదనరే? 184

క. ఇదియోగ్యమయోగ్యంబని । మదినెంచకశంకమాని - మక్కువపడియీ
ముదుకఁడడిగిననృపుఁడి । చ్చెదననఁగానగునె? తాను - చెడుటనెఱిఁగియున్. 185

ఆ. యాచకులకువాంఛి - తార్థంబులిచ్చిన । వారుఁగలరుగాని - వసుధలోన
నితనిభంగినాలి - నిచ్చినవారలే । రెందుఁగొనినవారు - నెందులేరు. 186

సీ. అగ్నిసాక్షిగఁబెండ్లి - యాడిన భార్యనే - మనిరాజుమునికిచ్చె - ననెడివారు
నడుగఁగాఁదగువాని - నడుగకిల్లాలినె - ట్లర్థించెనీవిప్రుఁ - డనెడివారు
వేఁడిననొసఁగెభూ - విభుఁడొల్లననలేక - యతనిస్వద్వతమది - యనెడివారు
నిచ్చెదనినంత - నేకూహెదనకఁదాఁ - గొనుటయీమునినేర - మనెడివారు.

గీ. వారెఱుంగనిధర్మము - ల్వసుధఁగలవె? । మనముపలుకంగరాదిపు - డనెడివారు
నిటులఁగోరుటఁదెలియుతే - కీన్నృపాలుఁ । డక్కటా! మోసపోయెఁబా-ననెడివారు 187

క. ఇటువంటియీవిమున్నె । చ్చటనేనియుఁ గలదటంచు - జనులాడఁగమీ
రెట్లైనవింటిరే? యని । కటకటపడువారు మిగులఁ - గలఁగెడువారున్. 188

ఆ. నీచుడనుచుమునిని - నిందించువారును । తప్పునృపతిదనుచుఁ - దలఁచువారు
నగుచుపెక్కుగతుల - నావేశగుసగుస । లాడ్వుచుండిరెగ్గు - బుట్టెననుచు. 189

ఉ. అంతటతాపసప్రవరుఁ - డారడమొప్పఁగఁజెంతనుండుభూ
కాంతునిఁజూచి, యోయి' చనఁ - గావలెమేమిఁక తామసింపరా
దింతటనుండివేతనము - నిచ్చెదఁగైకొనినీవు భక్తిమా
చెంతనజస్రముల్ గొలువు - సేయుము పొమ్మిదియాజ్ఞ, చెప్పితిన్. 190

వ. అప్రమత్తుండవై ప్రవర్తింపుమని యాజ్ఞాపించి, మఱియుం గలుగు నారలకుం దత్కాలోచితంబుగా సేయవలసిన పనులు నిర్ణయించి కొలువు సాలించి వెడలి, మహీనరార్హంబైన మహాడాంబరంబు విలసిల్ల శిష్య సమేతంబుగా మెల్లమెల్లనంజని, నిరుపమాన మణి నికర శోభావిరాజితంబును బహువర్ణ చిత్ర విచిత్రాలంకారకలితంబును, పురందర మందిర సదృశంబును నగు రాజగృహంబుఁ బ్రవేశించి, పరిజనంబులు సముచితోపచారంబులొనరింపనిం పైనయ యున్నత హర్మ్యాభ్యంతర భాగంబున నొక్క మనోజ్ఞ ప్రదేశంబునందు తమకై యమర్పఁబడిన యుచితాసనంబులపై తానును నుగ్రుండును నాసీనులై, యిష్టాలాపంబులం బ్రసంగించుచున్న సమయంబున. 191

క. ఎవ్వరిపైఁ గోపించునో । యెవ్వరిని శపించునో మ - హీసురుఁడనితా
మవ్వగ్గురు గనిభీతిలి । దవ్వగఁ జనిరిలిచిర పురు - వాసీజనముల్. 192

సీ. చంపకగంధియౌ రత్తముని - చంద్రుని సన్నిధికేగు దెంచి భా
షింపఁగ నోడి జిల్లవడి - చీకురవంబున మజ్జనంబుఁ గా
వింపఁగ వేళయయ్యోనని - విన్నసంతసమంది లేచి యుక్
గుంపుఁదోలంచి పార్శ్వముల - కుంబరి చారిక లేగి నిల్వఁగన్. 193

క. ఇదెయిదె యిట్టిట్టని యొక । సుదతీమణి దారిఁ జూప - సుందరమగు స
త్సదనాంతర శిల్పంబుల । మది మెచ్చుచు వేగ నేగి - మజ్జనశాలన్. 194

ఉ. చేరినయంత నొక్క సర - సీదళసన్నిభ నేత్ర యానికిం
గైరికరమ్య పీఠమిడి - కంకణరత్నంకృతులుల్ల సిల్లగా
సౌరభ తైలమంటె, నొక - చంద్రసమానన నల్లువెట్టెఁ జె
ల్వారనొకర్తె వేజలక - మార్చెనుష్ణోష్ణ సుగంధ వారిచేన్. 195

గీ. అతుల మజ్జన మొనరించి - యా మునీంద్రుఁ । డపుడు పరిచారి కానీత - మైన ప్రవిమలాంబరంబులు ధరియించి - యచ్చోటు వాసి । సంతసము మీరభోజన-శాలకరిగి. 196

మ. అతివల్చెట్టిన కాంచనాసనముపై - నాసీనుఁడై భర్మని
ర్మితరంభాదళమందు షడ్రసములున్ - మింపొందురు చ్యంబులొ
ప్రతిలేనట్టి పదార్థముల్వారు సగాఁ - బద్మాక్షియొక్కర్తు స
మ్మతి వడ్డింపఁగ నారగించెఁ బ్రియమా - మడ్కిన్ రుచుల్మెచ్చుచున్. 197

ఆ. అఖిలజీవులకును - నాహారమొసఁగు ప । రాత్పరుండు లోక - రక్షకుండు
వేడ్కఁదన కొకర్తు - వెట్టిన యన్నంబుఁ । గుడిచి తృప్తిఁ జెందెఁ దడయకపుడు. 198

వ. ఇట్లు భుజించి లేచి, సుందరీకరారవిందసంభృత సువర్ణ కలశముఖ వర్షమాన వారిధారా క్షాళితకరచరణయుగళుండై, యున్న యతనిం గని యశోవతియను మతి ప్రకారంబున. 199

క. కుసుమసుగంధులు కొంచెఱు । గుసగుసలంబోయినవ్వు - కొనియిదెమీరి
దెసఁజను దెండనికొని చని । యసదృశమగు కేళికాగృ - హముఁజేర్చుటయున్. 200

ఉ. అంచలిశిల్పచిత్రమున - కచ్చెరువొంది నుతించిచాలనా
నందముతోడ యోగ్యశయ - నంబునఁ దానుపవిష్టుఁడై నృపా
లేందుని సత్యమీవిధృతి - హెచ్చుగఁదోఁచిన మెచ్చియింకనే
సుందరిసాధ్విమానిని య - శోవతి మానసశుద్ధిఁగాంచెదన్. 201

వ. అనియోజించుచున్న సమయంబున. 202

చ. రయమునసుగ్రుఁడుం దనపరి - రంబునకుం బగిసల్లుపోయి తాఁ
ప్రియమున మజ్జనంబు నొన - రించి భుజించి మునీంద్రుఁడున్నయా
శయనగృహంబు చెంగటికిఁ - జయ్యనవచ్చెగురు ప్రచోది త
క్రియలను నేర్పు మీఱగమ - కించియొనర్పఁగ నెంచి వేడుకన్. 203

క. అటువచ్చి మందిరముఁ జొ । చ్చుటకు మదిన్ సంశయించి - చూచుచుసట వా
కిటనిలిచియున్న శిష్యునిఁ । దటుకునఁ దలయెత్తి కాంచి - దండనము నితన్. 204

చ. సరసకువచ్చి యున్నపరి - చారికలన్ బెదరించి తిట్టియీ
చిరమరబుద్ధి మీకగునె? - శిష్యుఁడు వచ్చినవచ్చెనంచుఁ జె
ప్పరుగద! మంచిదయ్యెఁదగు - భంగినిఁ దత్ఫలమొందఁజేతునా
తరము నెఱుంగ రేమొకొక - దా! యిఁకమీఁద నెఱుఁగవచ్చెడిన్. 205

క. అతఁడెల్లభంగులను నా । మతికెక్కన వాఁడనియును - మంత్రియనియు మీ
మతిఁదోఁచదె? సామాన్యుని । గతినెంచితి రింతలోన - గర్వము దగునే? 206

క. మంచిదికా నిండింతనె । మించినగద్దియును లేదు - మీమానమునపం
గించెదనింకను జేయఁగ । నెంచినదంతయును జేయు - డిపుడగలేకన్. 207

క. ఆయంబోనాకపకున్ । మీరేలికసాని రాక - మిముఁబంచెనుగ
ర్వాయత్తమతి, నిసీ! మీ । గీయెదనుంపంగవలన - దీఁకపొంచవలన్. 208

చ. అనిభయమొందనార్చి యతఁ - డంతట శిష్యునిఁజేరఁ జీరియి
ట్లనియెను, కంటె? వీరలయ - నాదగ దుర్మతి మిట్టిచెడ్డవా
రినిఁదగునంచు నాకుపచ - రింపఁగఁ బంచెను యుక్తమే? నృపాం
గనకిపుడెల్లి సంబయితఁ - గల్గునె భక్తి? దురాత్మపత్నికిన్. 209

క. అట్టిదినాతోడె వ్విధి । గట్టుగఁగాపురముఁజేయఁ - గోరుంజెపుమా!
తుట్టతుదసబలతానే । కట్టడితననుసకుఁబూనఁ - గలదో యెఱుఁగన్. 210

చ. అదికడు మాయలాఁడి జర - తాంగుఁడనే నటుగాననేమి యా
పదఁగలిగించునోకపట - పద్ధతినొంటరి పాటుఁజూచి యీ
సదనముకేళికా గృహము - చయ్యనఁనిచ్చటి కన్యలెవ్వరుం
గొదకొని రారుచిక్కు_వడి - కూతలువెట్టినఁగానియుం ధృతిన్. 211

క. ఏవేళకెటులనగునో । భావింపఁగఁదరముగాదు - బాసటయిచ్చో
నీవే ! కావునరెందుం । బోవకు మీ ! కాచియుంట - పోలును నీకున్. 212

వ. అని యంచయును వినంబలికి యుగ్రునిఁబనిచి పిమ్మట. 213

క. మునికనలునఁదనపలుకులు । వినిభీతిలియున్న యచటి - వెలదుల నెల్లన్
గనితిట్టికొట్టిమీాఁద ! భ్యనినోడ్కొ_నిరండుపోయి - వేగ మెయనినన్. 214

క. కొట్టుపడితిట్టుపడివా । రిట్టులమగుచింతతోడ - నేతెంచివడిం
దొట్టినయలుకన్ భూపతి । పట్టపుదేవికి నెఱింగి - భ_క్తిదలిర్పన్. 215

క. వటుఁడరుదెంచిన నేమటి । తటుకున నెఱిఁగింపమనెడి - తప్పునకై యా
చటమూనితిట్టెఁగొట్టెన్ । కటికమునీంద్రుండు మమ్ముఁ-గాఱియపెట్టెన్. 216

క. నీపాలిటి పాపగ్రహ । మోపడతిరో ! యతఁడు, తాపసో త్తముఁడనరా
దేపగిది వానితోనిఁకెఁ । గాపురముం జేయుదువో సు - ఖంబనియకటా ! 217

క. నినునిపుడేయటకుం దో । డ్కొ_నిరమ్మనెనమ్మ ! యతని - కోపంబింతిం
తనరాదు మాకువెఱఁగ । య్యొనుగండము తప్పెనేటి - కిందునిభాస్యా ! 218

గీ. తడవు సేయకుమమ్మ ! పోఁ - దలఁచియున్నఁ । నేమికీడెంచునో క్రూరుఁ - డింపలోన
వేగఁబోవమ్మ ! పోయి నే - వింపవమ్మ । యచటికిఁక మేముఱాఁజాల-మమ్మదేవి 219

గీ. అతనివలన సుఖంబులే - దమ్మ ! నీకు । విమతుఁడేవేళ కెట్లుగా - వించునొక్కొ_
యువిదరో ! యేటికిట్టున-నుండు మ్రాని । కెన్నటికిఁ జేటుదప్పఁబో-దిదినిజంబు. 220

క. అనిసమునిచి_త్తవృ_త్తిని । మునుదాఁగనియున్న దగుట - ముద్దియయతఁడే
మనునోయాగొనరించిన । ననుచుఁదలఁచివేగలేచి - యాసమయమునన్. 221

సీ. గొజ్జంగినీటను - మజ్జనంబొనరించి - రాజిల్లు చీనాంబ - రంబుఁగట్టి
మణిగణస్థగితభూ - షణములుధరియించి - రాణించు పేరైన - రైకఁదొడిగి
సౌరభకాశ్మీర - చందనంబునలంది - కాటుక రేఖలు - కనులఁదీర్చి
పాలుపుమీాఁగముఖం - బునదిలకముదిద్ది - తుఱుముసఁబూవులు - త్తులనుఁదుఱిమి

గీ. పద్రసోపేతమైనభో - జనమొనర్చి । తరళలోచనయొకతెకై - దండయిడఁగ
లలితమన్మథసామ్రాజ్య - లక్ష్మివోలె । తరుణిచనఁజెను కేళికా - ధామమునకు. 222

టులవెడలిలతాంగి జా - గయ్యోననుచుఁ । గినిసిరేమనునోగదా ! - మునివరుండు
రములఁబూన్చఁగాని మ-న్నించఁడెంత । చెప్పినను వినఁడనిభీతిఁ-జెందియపుడు. 223

త్తఅపాటున నెంతయు । న త్తలపడుచున్న రెఁటిఁగి - యువిదలు దై న్యా
 త్తమతులగుచుఁగనియా ! బి త్తరికిట్లనిరిమిగుల - వేసటతోడఁన్. 224

బింబాధర ! మేమునీచెలుల మ - న్యుల్ గామును మెృద్దిగా
 బాహాటముగాఁచింతు మెపుడున్ - నీబాగుమాబాగుగా
బాల్యంబుగ నెంచు వారలము మే - మాగాములూహించిగా
బంబొప్పఁగసర్వకార్యములు ని-ర్వ ర్తింతుమింపొందఁగన్. 225

స్తై మేమునీకు - హితమునువలుకుదు । మెపుడుమానసమున - నేవపడక
వచించుమంచి - మాటలనాలించి । నడుచుకొనుము మేలా - నరులతాంగి ! 226

అనఁగ నేటికాముదుక - విప్రునకుంగొఅగానిదానమ
_అపడికొన్నయంత నె ను - ఖంబదియంచుఁదలంచెఁగాని పై
అఁగు నెఱుంగఁడయ్యోవిను - తెల్పెదమేర్పడనీకుయోగ్యమా
అకువ, చేల ! నేననుమ - తింపనుపొమ్మని చెప్పిపంపుమీ ! 227

టులనైనవిసికి - యతఁడుకైకొనినస । ర్వమునువిడిచిపోవు - వచ్చినట్లె
ుందె నేనిచనక - యుండెఁబోమనకేమి ! పిచపనైనఁనేగు - నిదినిజంబు. 228

రియిటు నెచ్చెలుల్పలుక - నయ్యలికుంతలమందహాసమా
మునఁజెన్ను మీఅనర - నాధునియాజ్ఞఁదలంచివారికి
మఁ, గడుసాధ్వినాఁబరగి - నట్టిననున్ బతిమాటకన్యథా
నకొని చేయుచుంచనఁగఁ - గూడునె ? ధర్మమెఱుంగఁబాలకన్. 229

ునికర్పించెనునన్నుభూపవరుఁడా - ముష్యాయణాం డైనయా
మునిన్ దుర్యశమొందజేయుటకు సం - కల్పింపరాదమ్మ ! చె
నమాడ్కిం బొనరించి నేవిభునకున్ - విఖ్యాతిఁజేకూర్తునె
ను, మానీశ్వరుఁడెట్టిడైననునొకం - డుంజెప్పరాదాతనిన్. 230

తఁడేపతియతఁడే స । ద్గతికాధారంబురాజు - దైవమునతఁడె !
ఁతఁడేబంధువుపోషకుఁ । డతఁడే ! నాదేహమతని - దగుఁజెలులారా ! 231

నినయాశుభాంగి - యసమానదృఢబుద్ధి । కబ్బురంబునొంది - యతివయొకతె
రలనిట్టులనియె, - మానిసంగతినీకుఁ । దగదుమానుమమ్మ ! - తరళనయన ! 232

చెల్ల ! కపటహృదయుఁడు । వాచంయమిమిమ్మునేప - వచ్చెనుతానిం
చకయూరకఁబోవం । డేచట్టలనింకఁజేయు - నెంచునొసువిమ్మా ! 233

ఉ. ఎక్కడనుండియో జరుఁ - డిచ్చటికేతటిదాపురించెనో
యక్కట ! పల్కిబొంకని మ - హాగుణవంతునిధర్మమూర్తిఁ బెం
పెక్కినశాంతభావునవ - నీశ్వరశేఖరున ప్రసిద్ధమౌ
ఫక్కినివేఁడిరాజ్యమును - భాగ్యముఁ గైకొనియంతఁబోవకన్. 234

శా. హేయంబైనదురాశఁ జెందితననో - రెట్లాడెనో కాని, నీ
జాయన్ దత్తముసేయుమంచడిగె, యా - సత్యవ్రతుండైనరా
జాయజ్ఞానునకిచ్చెకూడదని సుం - తైనన్ విచారింపకే
న్యాయంబెచ్చటనైననుంగలదె ? నీ - వాత్మన్ విచారింపుమా ! 235

చ. సకియరో ! పూనియోగ్యుని కొ - సంగినదానముసార్థకం, బసా
ర్థకమగుఁ జుమ్ము పాత్రునకు - దానమొసంగినవాననిశ్లుత
ప్పకపడిమంచినీరగును - పల్లపుసైకతభూమిలోన నిం
కొకయెడనుప్పనేలఁబడి - యెయ్యనఁదద్గుణమొందునేకదా ! 236

ఉ. భావజమర్మకర్మపరి - వర్జితుఁడెంతయుఘాఁదసుండపెలం
డేవిధినిన్నుఁ గూడిసుఖి - యింపఁగనేర్చును ? నీవటన్నఁ బ్ర
థ్వీవరపత్ని వందను భ - వించునదేమియులేదుచన్న, న
య్యో ! విపరీతకార్యమిది - యొప్పునె ? నీమదమానుమీభ్రమన్. 237

ఉ. చిత్తరుబొమ్మవంటినినుఁ - జేకొనెనంతియ కానివానికిన్
హత్తునెతృప్తి ? కాంతరో ! య - హర్నిశముంగొఱలేనిభోగసం
పత్తినెసంగుభూవరుని - పట్టపుదేవినినిన్ను సాధ్విని
ట్లెత్తినయాసఁ గూడియతఁ - డేమిసుఖంబునునొందుఁ జెప్పుమా. 238

క. ఆపాపపు విప్రుఁడుని ! స్నేపాటిగనింపుమీఱ - నేలఁగఁగలఁడీ
వ్యాపారముతగదమ్మా ! ! మాపలుకులువినఁగదమ్మ ! - మంజులవాణీ ! 239

గీ. ప్రకటవైభవకలితుఁడౌ-ప్రభునివిడిచి ! తపసితోఁ బొందుఁగోరుట-తగునె ? చెప్పుమ !
కల్పకంబునువిడనాడి - గచ్చపొదను ! బట్టుకొనబోవువిధమిది - పద్మగంధి ! 240

క. అతఁడొకరాజఁట విభుఁడఁట ! యతనిం బ్రియ మెప్పుగలయ - నరిగెదవఁటభూ
పతిపత్నివౌర ! వినమీ ! కతలెందునుఁ దపసికెంత - ఘనతఘటిల్లెన్. 241

క. వనితా ! యామునియెంతటి ! ఘనుఁడైనను నిట్టిపనికిఁ - గడఁగుదునే ? మే
లనిపసిడికత్తియగునని ! కొనికుత్తుకనెవరుగోసి - కొందురు ? చెప్పుమా ! 242

ఉ. కానలలోననాకులును - గాయలునుండిని యాటనీటులం
బానముఁజేసియుద్ధరత - సంబొనరించుధరామరుండుతా

నానిరాజ్యముం గొనిన - యంతనె పాలనఁ జేయనేర్చునే ?
వీనుగ నాటి నీరిడిన - వేఁగిన విత్తన మంకురించునో ? 243

చ. మతిచెడెనే మొవార్ధికపు - మానిసిగావునఁ, గాదటన్నదు
ర్గతిఁ గలిగించునింద్యమగు - కార్యమటంచుఁ దలంకకంబతి
వ్రతనిటు భంగపెట్టుటకుఁ - బాల్పడునే? యెటులైననా నప
మృతము నెఱుంగ సేయుమను - మానముమాని మదేభగామినీ! 244

ఆ. ఇటుల రాజ్యమతని - కిచ్చి మీరలు చెడు | టేమిన్యాయమమ్మ - కోమలాంగి!
కన్నుబోవునట్టి - కాటుకఁ బెట్టుకొ | నంగనానె? పొమ్మ - నంగరాదె ? 245

క. పతియాజ్ఞ మీఱరాదని | కొతికిన ఫలమేమి? వెఱవ - కుమునీకుఱాస
మృతిగానియకార్యము నే | గతిఁ జేయుమటంచుఁ బలుకఁ - గలరెవ్వరైనన్. 246

చ. కొకిబికిరైన దంతములుఁ - గొంకిరివోయిన వాఁడిగోళ్లుఁ జూ
డ్కికివెగటైనయెమ్ములును - గిల్లిననెత్తురు లేని దేహముల్
వికృతపురోమముల్ వడఁకు - వేపటయున్మదికంపుకాన్సలో
నికిఁజనినట్టికన్నులును - నీమదికింబ్రియమానె ? సుందరీ ! 247

సీ. కంపయునల్లలే - కెండిదుస్వేదంబు - మించుచిత్తడిమేన - మేనుసేర్చి
నిడుమీసములుమీఁద - నెఱసినలొత్తలా - ముదుకచెక్కులనట్టె - ముద్దులాడి
రసహీనమైవిన - రానినీచపుఘాంద - సోక్తులువినిముదం - బొందిమెచ్చి
వెరవెఱుంగకఁ జేయు - వికటంపుఁ జేష్టల - కేవఁ జెందకఁ జాల - నిచ్చయించి
గీ. వీడకీవేళ ముదిముని - తోడఁ గూడి | మదనకేళీవిలాససా - మ్రాజ్యసుఖము
ననుభవించుట కెవ్విధి - నాత్మలోనఁ | దలఁచిపోయెదవమ్మ! యో - తలిరుబోణి. 248

సీ. సరససల్లాపము - ల్జరుపఁగానేర్చునే? - సతతంబు మంత్రము - ల్జదువువాఁడు
చిన్నెలు శృంగార - చేష్టలు నెఱుఁగునే? - వైదికక్రియలలో - వఱలువాఁడు
మొనసి కౌఁగిటఁ జేర్చి - ముద్దాడ నోపునే? - విసువకహోమముల్ - వ్రేల్చువాఁడు
సురతకేళిఁ బెనంగి - సుఖమొందఁ గల్గునే? - పరతత్త్వవాంఛలోఁ - బరఁగువాఁడు
ఆ. పారుఁడతఁడు నీవు - పార్థివకులజాత | వతఁడు తపసి సాధ్వి - వగుదువీవు
జరఠుఁడతఁడు నీవు - జవ్వనివెవ్విధిఁ | బొసఁగునమ్మ! మీకుఁ - బొంతమబల! 249

సీ. క్రూరమౌనఖములఁ - గులుకుగుబ్బలనట్టె - గ్రుచ్చఁగా నెట్లోర్చు - కొందువమ్మ
కఱకుదంతంబులు - గాడఁగా కెమ్మోవిఁ - గొఱికిన నెటుతాళు - కొనెదవమ్మ
కఠినబాహువులనీ - కడుమెత్తనగుమేను - బొదివిన నెటుతాల్మిఁ - బూనెదమ్మ
ముదివగ్గుకదిసి ప్రేపే - ముడిఁగూడి పెనఁగుచో - నెవ్విధినింపున - హింతువమ్మ

గీ. హరిహరీ! యీయసత్యాకా - ర్యాభిలాష । వలననీకేమిలాభంబు - గలుగునమ్మ
పుణ్యమనియేటిలోఁబడ - బోవునట్లు । తోఁచుచున్నదినీలాగు - తోయజాక్షి! 250

ఆ. వ్రతముచెడినఁగలుగ - వలదచేసుఖమైన । నట్టునిట్టుగాని - యట్టికార్య
మెగ్గుగాదొ? కంటి - కింపైనమదికింపు । వానిపైనదెట్లు - వాంఛగలిగె? 251

మ. సరసాలాపములా, నఖక్షతములా - సంశ్లేషమాహావమా
వరబింబాధరపానచుంబనములా - వైదగ్ధ్యమాచేష్టలా
స్మరశాస్త్రోక్తములైన తక్కుపనులా - చాశీతిబంధంబులా
తరుణీ! దేనినెఱుంగునమ్ముదుకఁడే - తద్వాంఛయున్ వాంఛయే? 252

ఉ. తిట్టినఁదిట్టుఁగాక కడు - దెప్పరమైనను నయ్యెఁగాక యీ
పట్టుననుండకెందయినఁ - బద్దున బొమ్మనినన్ గొఱంతయే?
పట్టిబికారిపో, యతని - వంటివికారపు వానిఁబోయిచే
పట్టుటకంటెనూతఁబడి - ప్రాణములన్ విడిపించు టొప్పగున్. 253

క. తగదమ్మాయీయత్నము । వెగటొందక జెప్పినట్లు - వినవమ్మా! మా
నగదమ్మాసంశయమే । మగువా! పోవలవదటకు - మరలుముస్మృతితోన్. 254

క. ఈయలఁతిపనినితగునని । సేయఁగనీకెట్లునేఁడు - చేతఃప్రియమై
న్యాయమనితోఁచెనో నా । రాయణమాకిదితలంప - రాకున్నదమో' 255

క. మావలనఁదప్పులేదిఁక । నేవడువుననీకుసేయు - టిపుడుహితవుగా
భావములోఁదోఁచెడినో । యావిధమునఁజేయవమ్మ! - యనిపలుకుటయున్. 256

క, వినివారలమాటలకుం । గినుకజనించియునుమీఁది - కింపోఁపఁగని
కనె, వెగటునగవునెమ్మొగ । మునఁదనరఁగ శాంతవచన - ములనిట్లనియెన్. 257

శా. యుక్తాయుక్తములెంచ కివ్విధిమహో - యోగ్యున్ దపస్విన్ ప్రథా
యుక్తున్ సన్నుతిఁజేయనొల్లకపవి - త్రోక్తుల్ వృథాబల్కినన్
ముక్తక్లేశుల రౌదురిందఱునుస - మ్మోదంబుమీఱంగస
ద్భక్తిన్ మీరలు గొల్వఁడాయనఘునిం - దానన్ గడున్మేలగున్. 258

గీ. హానివృద్ధులనెంచక - యవనిభర్త । యతనికర్పించెసర్వంబు - ననఁగఁదగునె?
యాచకుఁడువేఁడినపుడులే - దనగలండె । యసమసత్యవ్రతముఁగల - యట్టిదాత. 259

క. పేదపడియునువదాన్యుఁడు । లేదనఁగాఁజాలఁడొసఁగు - లేశంబైనన్
మేదినిలోనదివట్టియు । నీదే? తనయూఁటనీరొ - కింతజనులకున్. 260

క. ఒకనాఁడుకుడువకుండినఁ । దికమకయగు రెండునాళ్లు - తినుతిండినీఁదా
నొకనాఁడుతినఁగఁజాలఁడు । సకలవిధంబులనరునకు - సంకటముజుఁడీ! 261

క. ఎక్కడికి కష్టమంతం । బెక్కడికి సుఖంబు, సమము - లెఱిఁగిన రెండున్
లెక్కింపఁ దగదు ధర్మము । దొక్కటియే తోడు జనుల - కుర్విన్ దలఁపన్. 262

క. మీకిట్టులఁ దోఁచినను యిది । నాకుం బ్రియమగును చాల - నాథుని యాజ్ఞన్
గైకొని చేయుట యుక్తం । బాకర్ణింపుదు నెయిట్టి-యహితవచనముల్. 263

క. గయమునఁ జనిమునికిమనః । ప్రియ మొనరించుట యమిగుల - పెంపగు మీరీ
క్రియఁ బలుకుటను చితమునా । నియమము విడనాడ నేర్తు-నేయే మైనన్ ? 264

గీ. ఎన్ని కష్టంబు లొదవిన - నన్నియును స । హించి మానీంద్రుఁ గొలుతునే - నెల్ల విధుల
వలదు వారింపఁగా నన్ను - వనితలార । యనుచు వారలతోఁ బల్కి-యచ్చోటుఁ గదలి. 265

గీ. ఊరుతరద్విపకుంభయు - గ్మోపమాన । కర్కశ స్తనయుగళిచ - గట్టిలోనఁ
గులుకుచుండఁగఁ బెనుపిఱుం-దులు జలింప । మునినిఁ జేరంగ వచ్చెన-మ్ముద్దుగుమ్మ. 266

క. క్రూరవ్యాఘ్రము గలపొదఁ । జేరిన లేడియును వోలె - చెలువ యటకుఁ జే
ల్వారఁగ వచ్చిన నదిమం । జీరగవళి వలన నెఱిఁగి - శీఘ్రము ముని తాన్. 267

క. మృదులంబగు పానుపుపైఁ । గదలకఁ బవళించి కన్ను - గవ మోడ్చి కడున్
నిదురించుచున్న మనుజుని । పదురున గుఱపెట్టుచున్నఁ - బరికించి వెఱన్. 268

గీ. చెలఁగి నారాకకై ప్రతీ - క్షించుచుండి । తామసంబాటఁగినిసియా - ధన్యచరితుఁ
డుడుకువనుమాని నిద్రించు-చున్న వాఁడు । మేలుకొనుటింక నెపుడొ న-న్నేలు నెపుడొ ?

ఉ. కూరుకు జెందియున్నపుడు - గొబ్బున మేల్కొనఁ జేయు టెంతయు
నేరము కిల్బిషం బొదవు - నీతి నెఱింగినవారు నిద్రితున్
దారున మేలుకొల్పుటకుఁ - దాముతలంపరు, మిన్నకుందునో
చేరువ కేగి లేపుదునో - చీరిన నెవ్విధిఁ గోపగింపునో. 270

చ. వలదని యున్న లేచికని - వచ్చిన దానవు వచ్చినప్పుడే
తెలియఁగ మేలుకొల్పఁదగ - దే ? యనినా పయిఁ దప్పుఁ బూన్చి తా
నలుక వహించి చేకొనక - పోవడిపెట్టిన శాంతుఁ జేసినా
యలుకను మాన్పువారెవరు ? - యుక్తముగా దిది యుందలంపఁగన్. 271

మ. అనిసందేహముఁ జెందికొంతదడవ - భ్యగ్రస్థలిన్ నిల్చియా
ఘనసంకాశ వినీలరమ్యకచ తాఁ - గర్తవ్య మూహించి మె
ల్లన మేల్కొల్పుదునంచు డాయఁజనిత - ల్పంబం బెహాస్తంబునం
దనలో భీతియుఁ దత్తఱంబొదవియుం-తన్ మేను కంపింపఁగన్. 272

ఆ. అతులశయ్యనంటి - యటపార్శ్వమందుఁ గూ । ర్చుండ బోవ నుసిలి - యొడలు విఱిచి
గారడంపు దపసి - కాంతతనుస్పర్శ । మునకు వెఱచి సాధ్వి - యనుచు మెచ్చి. 273

చ. తటుకున మేలుకొల్పినవి - ఘంబునమై సడలంగనీల్గితా
నటునిటుశయ్యపైఁబొరలి - యల్లనఁగన్నులు విచ్చియంగుళు
ల్జిటచిటనెట్టి కల్వితెచి - చేతులుఁగాళ్లు విదిర్చిలేచియం
తటనతఁడావులించికనెఁ - దచ్ఛయనాగ్రతలస్థఁగోమలిన్. 274

క. కనికినిసిపండ్లుగీటుచుఁ । గనుగోయిని నిప్పులొలుకఁ - గాభీతిలులా
గుననార్చియశోవతిపైఁ । దనయధికారంబునెఱపఁ - దలఁచియదయుఁడై. 275

ఆ. ఓసిదుష్టురాల! - యొప్పనొప్పదటంచు । కొంచెమైనమదినిఁ - గొంకకిపుడు
చేయరానిపనినిఁ - జేయంగఁజెల్లునె? । యజ్ఞగొనకశయ్య - నంటఁదగునె ? 276

ఉ. అంటిపయునంతఁబోకనను - నల్పునిఁగాఁదలపోసి నిన్నుఁజే
కొంటినటంచుగర్వమున - గొబ్బునఁదల్పముసెక్కఁబాడియే?
తుంటతనంబుగామనినిఁ - దోఁచదెనీకిది, మాయలాఁడి ? నీ
వంటిదురాత్మురాళ్లలదె? - పాపిని వీన్దలంచి మాఁచఁగన్. 277

శా. ఈసౌధంబుననిట్టులంకృతులు నీ - శృంగారముల్చిత్రముల్
పీఠంబుంగొఱగానివాసనలుని - వ్వెల్లిన్వలీయందమున్
మాసంపత్తికిలోటువచ్చుననియే - మాత్రంబుయోజింపవో
రా ! సంసారులకిట్టివైభవముఁగో - రంబాడియే ? చెప్పుమా ! 278

శా. ఈకార్యంబులనేమిలాభమయయో - యిభ్భంగినావిత్తమున్
బోకార్పందలపెట్టుటేల ? నిదియిం - పోపెంపొయేమానొకో
నాకుంబోఁచఁగలేదునీదుమతము - న్యాయంపురాజెవ్విధిన్
నీకున్బోధనఁజేసిపంచెనొనమన్ - నిర్భాగ్యనింజేయఁగన్. 279

క. ఇన్నకముతేకనినుమా । కిచ్చినవాఁడగుటవలన - నెల్లధనంబున్
వెచ్చింపుముజనునమ్మని । వచ్చినగతిననుచుఁజెప్పి - పనుపకయున్నే ? 280

క. ఈవిధమునమితిఁదెలియక । గావించినయెటులనెగ్గు - గాపురముగడున్
లావరియులొల్లెకాఁడై । పోవడె ? తానిటులవెచ్చ - ముంజేసినచోన్. 281

ఆ. ఆయమునకువెచ్చ - మధికమైయుండిన । కూలిమిత్రుఁడైన - జోగియగును
జగతినదివిలోమ - మగునేనితప్పక । యగునుజోగిరైన - యక్షరాజు. 282

క. ఈరీతినియోజింపక । యారా ! వ్యయమునకుమూల - మగుపనులుమహా
గౌరవమనికావించితి । వే ? రాజసపించుఁగొఱ్ఱు - నెక్కినమనునే ? 283

చ. చెడుమనినన్నునిర్ధనునిఁ - జేసి, వివేకవిహీనుఁడైన యీ
గడుపరివిప్రుఁడిష్టతమ - కంబునఁగైకొనెరాజ్యమేలువ్వే

వడిదెలియంగలేకతడ - బాటును జెందిదరిద్రుఁడయ్యెనిం
కుడుగఁగరాదెయామతము - యుక్తముగాదనితోఁచలేదొకో. 284

గీ. భూమిఁబాలించుటనఁగదా - బుద్ధిలోన | సులభమనియెంచెఁగాఁబోలుఁ-దెలివిహీనుఁ
డాయఁబోయింకఁ, బారుని-యధిపతిత్వ|మింతకాకెంత ? రాజొనె!-యిట్టిదేబె. 285

క. అనినలుగురుపరిహాసం | బునుఁజేయఁగఁజూచినీవి - భుండునునీవుక్
తనివిఁగొనిసంతసించుట | కొనరించినయత్నమిది, ప-యోరుహనయనా ! 286

గీ. వ్యర్థముగనిట్టితగనికా - ర్యములుసేయు | టంతెకాదించుకైననా - యందునీకుఁ
బ్రియముగలుగదునిక్కము-పేదతపసి | ననుచుఁదలచితివే ? రాజ-నగుటమఱచి. 287

క. నీరాకనిరీక్షింపుచు | కోరికతోనిచటనొంటిఁ - గొందలపడునా
పైరమణమానిచయ్యనఁ | జేరఁగరాకుంటనీకుఁ - జెల్లునె ? చెపుమా ! 288

చ. పగమదినుంచినీవుచెడు - పామువిధంబునఁబూనికిడుఁజే
యగమకముక్ పౌనర్భసమ - యంబునువేచిప్రియంబుతోఁపమం
చిగనటియింపవచ్చితివి - సీ ! తెలిసెక్ కపటాత్మురాల ! నీ
పొగరునడంచినీమగని - పూరినిమేయఁగఁజేతుఁజూడుమీ ! 289

ఉ. ఆలరివృద్ధుఁడీశులున - కంగనయాకొఱ ? పుట్టిమున్గెనా ?
వైశమబోవకున్న, పయి - వచ్చినదేమియులేదు; యింతలో
బాళిసహింపలేడొ ? యని - భక్తియుశక్తియువీడియుండియా
వేళకుమెల్లగాపరిభ - వింపఁగవచ్చితివే·ననుం ? బళీ ! 290

ఉ. ఏలిదమైన నొల్లనన - కంపుగనేర్పునేలి మాటలం
బ్రేలుటలేనిభక్తిఁ బచ - రించుటయొప్పునె ? యాటపాటలం
గాలముఁబుచ్చి నీకుమది - గల్గినవేళను వచ్చినంతనే
మేలని మెత్తునే ? కడుత - మింజను దెంచితి పంచునెంతునే ? 291

క. నీపతిపైఁగల మక్కువ | నాపైఁగలుగంగవలదె ? - నాధనమైనన్
బ్రాపెవ్వఁడింకనీకున్ | భూపాలుఁడునేనొనీవి - భుండోచెపుమా ! 292

క. గౌరవమున నేఁజెప్పిన | తీరునవర్తింపుమనుచు - ధృఢముగపతివే
మారువచింపఁడె ? పలుకం | గారాదే ? యపుడె మనను - గలుగకయున్నన్. 293

క. ఇనుమున దైలముపుట్టిన | మునిడికిఁ దీపొడవినను స - ముద్రోదకముల్
వినుమాసముగా పట్టినఁ | బొసఁగదు మీజాతికవల - బుద్ధితలంపన్. 294

క. నినునొల్లను నీతోపొం | దునునొల్లను చాలుఁజాలు - తొలఁగుము వేగం
బుననవిశోపంబున నిర | సన మొనరించుటయు వెఱచి - సంరంభమునన్. 295

క. కనకాంగి యపుడుమాయా । మునిపదములకెఱఁగి హస్తములుమోడ్చి మహా
వినయంబు మీఱఁగాని । ట్లనియెనతండట్టి విముఖుఁ - డై వినుచుండన్. 296

క. ఓడురీతదూర ! నాయెడ । నేదియు నేరంబుగలుగ - దిదిసత్యముమీ
పాదంబులాన యివ్విధి । నాదటవిడినింపసేయ - నగునే ? నన్నున్. 297

క. గాటముగ నెన్నియిడుములు । పాటిల్లిన నేనులేదు - బంతివచింపన్
నేటినియమంబుగాదిది । పాటింపుదు నీవ్రతంబుఁ - బాయక నెపుడున్. 298

ఉ. కోరినసంగ్రహించి మతి - గొల్పదు నీపయినన్నయెవ్వనిం
జేరఁగఁబోదు దిక్కనుచుఁ - జిత్తమునందలపోసి ? యక్కటా !
మీరలెవల్కెఁడీనుతము - మేలగునోమఱియెట్టిదోనొ యి
ట్లూరక నేపఁగాఁదగునె ? - యొద్దకువచ్చినవేళ మానినిన్. 299

క. మీరుదయమాని చేకొనఁ । గోరకపొమ్మనినపిదపఁ - గుఱఁగటికినన్
రారమ్మను వారిఁకను । న్నారా ? యీకోపమేల - నాపైమీకున్. 300

ఉ. పొమ్మనినంత నేమరలి - భూపతిచెంతకుఁ బోవుదానఁగా
నిమ్మగు నిమ్మగాకమతి - యెవ్విధినైనను నయ్యోమీపదా
బ్జమ్ములు గొల్చుచుండెదఁ గృ - పారసమెప్పటికేనిఁగల్గదే ?
యమ్మెయిఁ గల్గకున్న ఫల - మంతియయించు మదిందలంచెదన్. 301

ఉ. నావుఁడు మౌనిపుంగవుఁడు - నాతిమృదూక్తులు ధర్మశీలముల్
భావములోన మెచ్చియిది - భవ్యచరిత్రయటంచు నెంచి తా
నావిధమాత్మయందడఁచి - యంగనదిక్కు మొగంబుఁజేసి కో
పావిలదృష్టిలంగనిని - రాదరణోక్తుల నప్పుడిట్లనెన్. 302

ఉ. నీజగజంత మాటలును - నీకపటప్రియమెట్లు నమ్మదున్
రాజనిభాస్య ! నిన్ననఁగ - రాదదినాదగునేరమేయగున్
నేజరతుండనయ్యుమది - నిన్నువరించుట తప్పగాదె ? యే
యోజననుంగొనంగలన - యోగ్యునిఁ దాజవరాలు మెచ్చునే ? 303

శా. నాపైనక్కువ గల్గియుండిననిసిన్ - నన్నొంటివినిచ్చోటని
ట్లీపర్యంకముమీఁదఁజేర్చి వెసరా - కిందాకనీయిచ్చనే
వ్యాపారంబున నోర్కొయుండితపట - వ్యామోహముంజూపిన
న్నేపంబూనియె కాదెవచ్చితివి ? నీ - వీవేళకుంగోమలీ ! 304

ఉ. నీచతురత్వముల్ నృపుని - నేర్పునెఱుంగుదుమీరలెంతయున్
నీచగుణప్రయుక్తులరు - నిక్కము నన్నిపుడేమరింపఁగాఁ

జూచెదవిట్టిమాయలకుఁ - జోటునొసంగెడివాఁడఁగానుచే
రాచినయంతమాత్రమున - రాలరుగంగలవే? కరంబులున్. 305

చ. హితమతి నెద్ది వేఁడినను - నిచ్చెదనంచువచించి నేనునీ
సతినిఁ గొనంగఁ గోరితినొ - సంగుమనంగనె కొంకెరాజునీ
వతనికి ధర్మపత్నినఁట - యంతటికెవ్వఁడు బుద్ధిగల్గునే?
యతివరో! చెట్టునందొడిమ - నంటియయుండును కాయవీడకన్. 306

క. అనిమన్నింపక కోపం । బునఁబలికిన యబలమాని - పుంగవునిమదిం
గనలుడుపఁగఁదగు వెఱవున్ । దనలోయోచించియపుడు - తగనిట్లనియెన్. 307

శా. క్రోధింపఁదగునే మునీశ్వర! మిమ్ముం - గొండాడెదన్ ధారుణీ
నాథుం డెవ్వఁడు నాథుఁడెవ్వఁడికపై - నాకున్ గనన్ మీరెకా
దే? ధారాళముగాననుంగలసి సం - తృప్తిన్ వహింపంగరా
దో? ధర్షించినయేమి సేయుదును సంతోషంబుఁ గావింపుఁడా. 308

మ. కదియంగానటువచ్చి యాకుమడుపుల్ - గ్రంపుబాగాలొసం
గుదునో? గంధము మైనలందుదునో? నే - గూర్చుండిపాదంబులొ
త్తుదునో? కాఁగిటఁజేర్తునో? యిపుడునా - తోఁబల్కుఁడా! యిష్టమె
య్యదియో చేసెదనింతలోననుమీ - నిట్టిట్టనంబాడియే? 309

క. పగదాననెదిగనాఁడఁగఁ । బగునా? నన్నునుచుమరల - దగ్గఱఁజనఁగా
మగువా! నిలునిలుమంతటి । తెగువా, మగవారియనుమ - తింగొనవలదే? 310

క. త్వరపడకు నియమమొక్కటి । స్థిరపడినంగానినిన్నుఁ - జేకొననదియె
వ్వరికినిఁ జెప్పఁగరాదో । కరిగమనా యబ్బురంబు - గాఁదోఁచుఁగడున్. 311

క. నానుడువుమీరినడువని । దానవుఁగడుప్రియముగలుగు - దానవునైనం
బూనియొనర్పుము తగుఁదగ । దౌనిది కాదనకఁ జెప్పి - నట్లుగఁబనులన్. 312

క. తెలియఁగఁ జెప్పినపిమ్మటఁ । దలఁకినశోపియింతునిన్నుఁ - దప్పక, నాజ్ఞన్
దొలఁగకఁ జేసినఁబడయం । గలవుమహాసుఖమునీవు - గట్టిగ, ననుఁడున్. 313

చ. అలికులవేణియిట్లనియె - నయ్యో! తలంపున సంశయింపఁగా
గలయునె? మాటిమాటికిని, - బల్కెదె! యెవ్విధిఁ నెద్ది సెప్పినం
గలఁగకఁ జేయుదున్ వెగటు - గల్గునె? సేవకురాలఁగాదొ? నే
నలుగుదునే? యిదేమిపరి - హాసమొ నిక్కమొ పల్కుఁడా! తగన్. 314

క. ఈజజ్జగమాటలుమీ । కేటితపడుమిమ్ముమీర - లేమదినమ్మం
గాజంకెదరిఁక నమ్ముఁడు । రాజడ్డనఁబరులఁ, బలుక - రాదేతలఁపున్. 315

వ. అనిపలికినయత్లేని శుభంబగుంగాకయని సంతోషించిమునివరుండు. 316

క. కనుమనియాపర్యంకం | బుననుండిక్కృపాణమొకటి - పొలఁతికనఁగది
గ్గనఁదీసిపట్టినవ్వుచు | వినుమువెఱపుమానియొక్క - విషయంబబలా ! 317

క. ఇదినీవుగ్గైకొనుము జె | ప్పెదనటు పైఁజేయఁదగిన - విధమనియెనతం
డదిగనినివ్వెఱపడియా | మదవతియనుమానమపుడు - మదిఁగదురంగన్. 318

క. తాపసునిఁజూచిఖడ్గం | బీపర్యంకమునకెటుల - నేతెంచెనుమున్
మీపాలఁగలుగదిదియే | పాపాత్ములిచటనేమి - పనికిడిరొక్కో. 319

చ. అరమరదోఁచెఁదెల్పుఁడని - యచ్చెరువొందివినంగఁగోరియా
గురుకుచవేగిరింపముని - కుంజరుఁడల్లననవ్విదీనినె
వ్వరుగొనివచ్చిరంచడుగ - వచ్చునె ? సత్యమెఱింగియుంబళీ !
యొరులననేల ? నీదగుని - యోగమెకాదె ? సుధాకరాననా ! 320

మ. అనుమానించియెఱుంగనట్లడిగెదే - లా ? యీకుతంత్రంబు నేఁ
గనుఁగొంటిన్ మదినీర్ష్యఁబూనియనురా - గంబెంతయుంగల్గులా
గునవర్తింపుచునన్ను నేమఱిచి - కొంకున్ వీడిఖండింపదీ
నినినీవేయునిపించియుందువిదియే - నిక్కంబుయోచింపఁగన్. 321

మ. అనినన్ గుండెలుఝల్లనంగనయయో ! - యన్యాయమన్యాయమే
మనినేఁబల్కుదునింకనోర ! మునినాథా ! యింతపాపంపుయో
జనగావించుదురాత్మురాలనె ? యిదే - చందంబునన్ వచ్చెనో
యనిమిత్తంబుగనిందు, నేనెఱుఁగస - త్యంబింతయున్ నమ్ముఁడా ! 322

క. వింతలుమీమాటలు నే | నంతటికిఁదెగించుదాన - ననితలఁపకుఁడా !
కాంతధృతిఁగందుననిజం | కింతురదేమోయెఱుంగఁ - గిటుకునిజముగన్. 323

క. మీపదములుసాక్షిగయిం | దీపట్టెముచేరినట్టి - హేతువదేమో
రూహింపరాకయున్నది | తాపసవరనిందమోపఁ - దగునే ? నాపైన్. 324

ఆ. ఏమితలఁచియిచట - నిదియెవ్వరునిచిరో | గానిమత్కృతంబు - గాదుకాదు
నీళ్లులోతెఱుంగు - నిజముదేవుఁడెఱుంగు | నెవరుచెప్పనేర్తు - రిట్టులంచు. 325

క. అనినఁదలయూఁచియాశా | ననువంచింపదిమకాన - నంబుననున్నం
తనెతెలివిహీనుఁడగునే ? | ముని, చాలునుమానుమింక - మోసపుమాటల్. 326

వ. నీవుమాకపకారంబుఁజేయదలంచినను లెక్కింపకనీయెడంగలప్రియంబునఁజేసియానేరం
బులన్నియుమన్నించితి. ఇంకనిట్టిదుష్కార్యంబులనాచరింపఁదలంపకు మాయందుభక్తి

గలిగి ప్రవర్తింపుచు మదీయశాసనంబుఁ దప్పక నడుపుచుండుమని చెప్పిన యతని పలుకులకు
సమ్మతించియున్న యావన్నె లాడిం జూచి మగలనతం డిట్లనియె. 327

ధ. మదకలయానవింతయగు - మంచిరహస్యపుమాట నీకుఁ జె
ప్పెద వినుమీ కృపాణముల - భించుట చేయొక మేలు గల్గెనిం
దిదియె వరుంచినం జెడిన - దేవియు లేదిపుడించుకైన నా
యుదిలతొ లంగుఁ బోమలచి - యుండిన దొక్కటితోఁ జెనా మదిన్. 328

క. అదియేమిమాటయని యడి । గెదవేలియుఁ జెప్పెదన్ సు-ఖించుటకదియా
స్పదమగునుగానతగదని । పదరకునీపలననొక్క - పనిగాపలయున్. 329

శా. శ్రద్ధాభక్తులెసంగనుగ్రమగుని - ష్ఠంబూని నేమున్న సం -
తద్ధారాళనిపాతపర్వతరిఝరీ - ధారాంతరాళస్థలిన్
శుద్ధాంభఃకణముల్భుజించి స్తృతిమై - శోషిల్లకీశున్ త్రిలో
కోద్ధర్తన్ మృడుఁగూర్చి చేసితిదపం - బొండొండ మూడబ్దముల్. 330

గీ. అటులఘోరనిష్ఠనుదప - మాచరింప । నన్నుఁ జాలగ మెచ్చిపి - నాకపాణి
కరుణఁబొడసూపియడుగుము-వరమటన్న । యప్పుడుశంకరుఁడౌ దేవుఁ-డని యెఱింగి. 331

చ. మదిముదమందిభక్తిని న-మస్కృతిఁ జేసి నుతించి దేవ నే
ముదిమినిఁ జెందకుండువర - మున్కృపసేయవె యంచు వేఁడితిన్
మదనవిరోధి నన్నుఁగని - మంచిదిగాని, యతేని నీకు నేఁ
డదిసమకూఱదింకపయి - నవ్విధిఁ గల్గెడు నెట్టులన్న చోన్. 332

వ. ఇంకఁ గొంతకాలమునకు జరాభారంబు సంభవిల్లినపుడు నీవు తత్త్వవిచారాసక్తి నుజ్జగించి సంసారసుఖంబుల ననుభవింపఁ గోరికపడి చని యొకపుష్పమితుని నర్థించి యతని రాజ్యంబును భాగ్యముఁ బరిగ్రహించి ప్రభుత్వంబుఁ జేయఁగలవాఁడవు. ఆసమయంబు నభవదిచ్ఛాపర్తినియైన యారాజపత్ని యంబురీకొలిపిభీతిల్లక యాపల్లవాధరచే నిశాకాలంబున శయనాగారంబునందు ఖండింపఁబడితివేని, తక్షణంబున నవయౌవన సుందరాకారుఁడవై పునర్జీవితుండవు గాఁగలవు. అటుమీఁదట నీకు వార్ధక్యంబు సంప్రాప్తింపదు. పొమ్మని నిర్దేశించి తిరోహితుండయ్యె. అంతసంతసించి పరమేశ్వరుని సంస్తుతించి యది మొదలు జరాసంభవకాలంబుఁ బ్రతీక్షించుచుండ, ప్రావృట్కాలవిద్యుల్లతా సంకాశంబై నచతుర్థవయోవస్థ యావేశించె నప్పుడు. 333

మ. గిరిజావల్లభుఁడానతిచ్చిన జరా - క్లేశాపనోదప్రకా
రరహస్యంబు మదిందలంచి నుతపో - రక్తిన్ విసర్జించి స
త్వరనిచ్చోటికివచ్చి నీవిభుని నే - ప్రార్థించి కైకొంటి నుం
దరి వౌనిన్ను నురాజ్యమున్ యిదియథా - ర్థంబో వినీలాలకా! 334

క. అగజాపతివాక్యముపొ । ల్లగునే? పుడమియునుమిన్ను - నట్టి ప్రైనక్
మగువరో! కోరికిసఫలం । బగుటమతతిరియోదవెనిచట - నన్నియుఁగూడెన్. 335

చ. ముదుకఁడనాటచేమఱచి - మున్నెగహస్యపు వచ్చరిత్రమున్
విదితముసేయనైతినిని - వెఱ్ఱిలనంబగుఁజో, లతాంగిరో!
యదిమనిఁదోఁచెనిప్పుడు శి - తాసినినిన్నుఁగాఁ జూచినంతనే
ముదిమిఁదొలంగినేనుసుఖ - మున్ బడయంగల నింకనెంతయున్. 336

క. వలిఫలితాంగుఁడనగునా । వలనన్ సుఖమొందనీవు - భావించినచోఁ
గలుగదు మే, లగజాపతి । దెలిపినపనిఁజేసినవ్య - దేహముఁగొందున్. 337

చ. అరమరమానియీనునిశి - తాసినిఁగైకొని పూనినీవుతీ
వరమునమద్గళంబుఁదెగ - వందెగ్రవేయుమునాకుఁగల్గునుం
దరనవయౌవనాకృతిపి - నాకివరంబిదిభీతిలేదునా
సరసకురమ్మునమ్మమని - జంబగునింతయుఁ గీరభాషిణీ! 338

క. ఈపనినొనరింపంగా । నోపననఁగరాదుసౌఖ్య - మొందెదుమార్గం
బోపద్మనయన! యిదియా । పాపపువార్ధిక్యబాధ - బాయుస్సన్నున్. 339

క. నీపతిదానవ్రతమున్ । నీపాతివ్రత్యమహిమ - నేఁడుఫలించెన్
నాపలుకులువినుముత్తమ । రూపముఁగైకొందునిపుడె - రూఢంబబలా! 340

వ. నామాటలనాలకించిచెప్పినభంగిఁజేయకమదీయాజ్ఞోల్లంఘనంబుఁగావింతువేని, యనంతం బగుపాపంబు సంఘటిల్లునంతియకాక నిన్నునీభర్తనుంగడువరానియిడుములనొందఁ బాల్పడంజేయుదుసుమీ! ఇన్నిసంకటంబులకులోనుగానేల ? నామేలుఁగోరుదానవైన, మచ్ఛాసనం బతిక్రమింపకచెప్పినకార్యంబునెఱవేర్చి నవయౌవనశోభాకారుండవైనస నన్నుంగూడి సమస్తభోగంబులనుభవింపుము. మనకిక మేలుకాలంబగుంగావున సంశయభయంబులుమానుము. తరుణీమణీ! ఇదెకైకొనుమనియాఖడ్గంబు నయ్యంబుజనదనచే నొసంగిన, నెసంగినతత్తఱంబునమారాడనోడి ఖడ్గహస్తయైనపరాశక్తియుం బోలెనిలిచియున్నయశోవతింజూచి వాచంయమియిట్లనియె. 341

మ. అనుమానించెదవేలనే? విధుముఖీ! - యాలస్యముంజేయకో
య్యనఖండింపుముమత్స్వరూపమిపుడె - బ్లానోవిలోకింతువిం
తనెనేసేవచియింపనేమిటికి? సిద్ధ - న్నుత్యుఁడీశుండొసం
గినమేలైనవరంబుదప్పదుజరా - క్లేశంబువీడున్ననున్. 342

క. త్రుటిలోననీవునన్నిపు । డిటుగనుచుండఁగనెసేవ - వింపుదుఁకడుమ
చ్ఛటయగువినుతాకృతినిం । కిటురా! నిస్త్రింశమెత్తు - మేయుఁమటన్నన్. 343

క. నుడువులుతడఁబడఁబదములు | గడగడయనివడఁకుచుండఁ - గాభయపడియా
జడదారివేగిరంబున | నుడుగనిపూనికయుఁగాంచి - యువిదవెఱపునన్. 344

క. ఓపుణ్యమూర్తి! కటకట! | కాపట్యమొనిజమొయెందు - గలదీపాప
వ్యాపారమవనిఁదగునని | ప్రాపగుమిముసంహరింపఁ - బాడియొ? నాకున్. 345

క. మైచలియించెడువిన్నవె | యోచెల్ల! యకార్యమునకు - నోజింపకయి
ట్లేచెలువసేయనేర్చున్? | యాచించినయట్లొసంగె - హరుఁడీనగమున్. 346

ఉ. మున్నెవరైననిట్టినర - ముంగొనిరే? భువిలోననెన్నఁడుం
గన్నదిలేదులోకులనఁ - గామతివిన్నదిలేదుచాలఁజా
వన్నజనుల్దలంకుదుర - యారె! మిముంబలెఁజావఁగోరువా
రెన్నఁగనెందులేరిఁకము - నీశ్వర! చిత్రముగాఁగఁదోఁచెడిన్. 347

క. నామానసమెఱుఁగుటకొఱ | కీమాడ్కినిఁబలికినార - దేమోయకారా
రా! మిమ్మునమ్మియుండెడి | భామినినగునన్నుఁగలత - పఱపందగునే? 348

ఉ. చెచ్చెఱనింపుమీఱనను - జెంతకుఁజేర్పఁగరాదొ? చేరఁగా
వచ్చినయంతలోనెయొక - వాదముఁగల్పనఁజేసినారు మీ
రిచ్చకమైనమాటయొక - టేనియుఁబల్కకయంటనీకనేఁ
డిచ్చనెఱుంగనోమతియ - టేలనొయివ్విధినుంటఁజెప్పఁడా! 349

ఆ. కత్తియొకటినిచ్చి - కుత్తుకఁగోయుమం | చనెదరిదియుధర్మ - మగునె? మీకు?
మిమ్ముఁదునిమియేమి - మేలొందఁగలదాన | నెటులనేఁదెగింతు - నిట్టిపనికి. 350

గీ. కోరిననురాజునడిగితి - కొంటిరింత | లోననాయందువెగటేలఁ - బూనవలసె?
మీకుప్రేమెక్కుడఁగాని, యీ-వ్యాకులంపు|మాటలనుమానుఁడా! విన-మనసురాదు. 351

క. మీవిషయంబునలోపముఁ | గావించినదానఁగాను - కలిగిననదియే
దోవివరింపుఁడ! కోమలి | నీవిధమునఁనలఁచఁదగునె? - యెడఁదఁగలంగన్. 352

వ. అనిశిరఃకంపంబొనరించియాచంచలాక్షినీక్షించిపారికాంక్షియిట్లనియె. 353

క. లోపములెంచఁగఁబూనినఁ | జూపట్టకయున్నె? ముగుద! - సురలందైనన్
నీపలుకులుచిత్రంబులు | లోపవిహీనుండుగలఁడె? - లోకములోనన్. 354

క. 'వినిపింపుమునానేరం' | బనియంటివినేరమిట్టి - దనితెల్పిసరయే
మనియెదవో, నాశాసన | మునునడుపకయుంటనేర - మోమతికాదో. 355

క. ఇదినీయెడఁగలనేరమె | గద; యింతటికెక్కుడేమి - గావలయును? నీ
మదియొప్పదేనియూరక | వదరకపొమ్మింకపెక్కు - వచియింపకుమీ! 356

క. కోరినపని నెరవేర్పఁగ । నేరననుచు వలుకరాదు - నీవని నేమ
స్నైరూఢిగఁ బలుకగలే । దే? రాజీవాస్య! చెపుమ; - యిట్లనఁదగునే? 357

చ. అతులితపుణ్యలక్షణ శు - భాంగి నొకర్తుఁ బరిగ్రహింపఁగా
వ్రతమును బూని పల్లెలును - పట్టణముల్ బలుమాఱు రోసి నే
వెతలు సహించి సుంతయును - వేసట నొందక సంచరించి, యీ
సతి తగునంచు తుట్టతుద - సమ్మతి నైనినుఁ గొంటి వెట్టినై. 358

క. నీవలన నాయభీష్టం । బీవేళ ఫలించు ననుచు - నెంచితి నిదియే
మో వెగటుగ నీవు మదిన్ । భావించి యొనర్చననుచుఁ - బల్కితివి కదా! 359

క. ఈపని జేయమిచే నగు । పాపం బట్లుండ యింక - పైఁ బొసఁగెడిమ
త్కోపానలో గ్రక్కిలా । తాప క్లేశంబు నీకుఁ - దప్పునె కుమతీ! 360

క. పోమ్మనుట యుభయము నఁబో । దమ్ములుగడగడవడంకఁ - దత్తరమున నే
నెమ్మెయి నిమ్ముని మదిఁగో । పమ్మును దొలగింతు ననుచుఁ - భామినియంతన్. 361

క. కరమునఁ గలకరవాలము । ధరనిడి తనగుండె లపుడు - దటతటఁ బదరన్
బిరుసుదనంపు మునింగని । త్వరయున్వాలమీఁ జనోటఁ - దడియాలంగన్. 362

క. కురుళముల నెగయఁబాపుచు । నరముడి నరదోఁచుచనుల - కట్టు పై పైఁటన్
సరినొత్తుకొనుచు నించుక । సరసకుఁ జని మ్రొక్కి భక్తి - సంధిల్లంగన్. 363

ఆ. నిరపరాధిని నగు - నెలఁత నునామీఁదఁ । గోపగింపఁదగునె - తాపసేంద్ర!
మిమ్ము బోంట్లు కీడు - మేలు నెంచక యున్నఁ । జెడుదుమంతకంటెఁ - జేయఁగలమె? 364

క. ధనకనకవస్తుచయవా । హనరాజ్యయుతంబుగాఁ బ్రి - యంబున నన్నుం
గొని యనుభవింపకివ్విధి । ననుʻరా! ఖండింపుʼ మనుట - న్యాయమె? చెపుఁడా! 365

క. ఈపనిని జేయుమనియా । జ్ఞాపింతురటంచుఁ దెలియఁ - జాలక ధృతి నే
నేపద్ధతి నెది సెప్పిన । నాపద్ధతిఁ జేయు దాన - నంటి మహాత్మా! 366

క. తెలిసినవారలు మీరీ । కొలనామొడిఁ గట్టఁ దలఁపుఁ - గొనుట రయంగా
తొలిబాముననేఁ జేసిన । కలుషము గావలయునొండు - గాదు మునీంద్రా! 367

ఉ. ఒల్లనివారలొల్లకయె - యుండక నన్నును రాజ్యముల్ సిరుల్
వెల్లివిరిన్ ధరావరుని - వేఁడికొనంగ తమేమి? కోరియి
ట్లెల్లఁ బరిగ్రహించినపు - డిష్టము దీఱఁగ సర్వభోగము
లెల్లను గొనంగ మీరనుభ - వింపకఁ జాఁదలపోయుటొప్పునే? 368

చ. అనిముటు దైన్యవాక్యముల - నవ్వరగాత్రి వచింపుచున్న మిం
చిన కినుకన్ మునీశ్వరుఁ ʻఛీ-ఛీʼ యని మెచ్చక రూక్షదృష్టులం

గనియుదలించియిట్లనియె - గారడమెల్ల నెఱుంగనయ్యోనీ
చనవులుజెల్లవింకనను - సంకటపెట్టకుపొమ్ము పల్కకన్. 369

క. సత్యమువిడిచిననీసాం । గత్యముకోఱగాదుమాకు - గాడెఱుఁగవునీ
వత్యంతధర్మవేదివి । హత్యయొనర్పుదువె? పుణ్య - మారడిఁబోదే? 370

క. న్యాయాన్యాయములెన్నిక । జేయంగలదానవైనఁ - జెప్పుమునాతో
నీయాజ్ఞ మీఱననే । డా? యిపుడేమయ్యెమాటఁ - దప్పుటకాదో? 371

క. కానిమ్ము నేఁడురేపటి । లోనీమదమడఁపకున్న - లోలాక్షిరో! నే
మానినిఁగానటుమీఁదట । హీనంబగుమారుపేరు - నిడుమీనాకున్. 372

చ. ముదుకఁడనాటచేఁగలిసి - ముచ్చటఁ దీర్చుకొనంగలేకయా
మదనవిరోధిమాటయును - మర్మముఁజెప్పి 'వధింపుమీననున్
ముదమునయావనాకృతినిఁ - బొందుదునిత్తతి' నన్న నాకు మే
లొదవుటకిచ్చయింపకదు - రుక్తులువల్కెదవార! చెల్లునే? 373

ఆ. వయసువాఁడనైన - వదలకనినుఁగూడి । యుందునని తలంచి - యూఱడిలక
యొనరనన్ను నొల్ల - కుండుదానవుగాన । యదియకృత్య మెుప్ప - నంటివిపుడు. 374

క. నాపలుకులొల్లకుండినఁ । బోపొమ్మిఁటనుండవలదు - భూపాలుండో
నీపతిచెంతకుఁజనిస । ల్లాపంబులనాడుమనిన - లలనచిడిముడిన్. 375

క. బెదరితననాల్కతుదితో । పెదవులఁదడుపుచునిదేమి - విపరీతము నేఁ
డొదవె? నిఁక నేమిసేయుదు । మదిఁదోఁచదటంచు సెంచి - మానింగనితాన్. 376

ఉ. మీరలునాపయింగినిసి - మిక్కిలినిర్దయులై మనంబునన్
వైరముఁబూనియింక నెటు - వంటివెతల్గలిగించి చెంతకుం
జేరఁగనీకవిడ్వరముఁ - జేసినఁజేతురుగాక బుద్ధియా
క్రూరపుకార్యముల్ సలుపఁ - గొల్పదునిక్కముగాఁగఁ జెప్పెదన్. 377

క. తిట్టినమిలువెపలంగా । నెట్టినఁగోపించిరెుంత - నిందించిననన్
గొట్టిననోర్చెదనేనీ । కట్టిడిపనిఁజేయఁజాలఁ - గటకట! వెఱతున్. 378

వ. మీరు జరాయుతులరై యుండినను నామదికింబ్రియంబ సర్వవిఘ్నంబులవెగటొందక మీ
యిచ్ఛానుసారంబుగా మెలంగుచుండఁగలదాన యావనాకారంబు సంప్రాప్తించుననిచేఁ
జేతమిమ్ముఖండించుటకెట్లొడంబడుదు? నిదితప్పుగా నెంచకమన్నింపుఁడు. 379

క. అనిఖండితముగఁ బల్కినఁ । దనలో రోషించి మాని - తలయూఁచి దలం
చినకార్యము నెరవేరఁగ । ననువగుమార్గంబు సెంచి - యపుడిట్లనియెన్. 380

గీ. ఏలఁబోఁ, నిన్నుఁ బ్రార్థించు-టిట్టివిధమున । నేనెఱుంగనె ? యికనల-యించులాగు
నింతదనుకను మీకుఁ గీ-డెంచరాద । టంచునా మదిలో నిశ్చ-యించియుంటి. 381

క. మేలై నంగీకారైనను । వాలాయంబెట్టి బెడద - వచ్చినవచ్చున్
పోలవుమీమాటలు వినఁ । జాలను నే, నంటివదియ - చాలును సుమ్మీ ! 382

క. నీవుగనుచుండఁగానిదె । చేవదినర నెవ్విధమునఁ - జేసెదనో యా
పైవేదుక లెట్టివియో । తీవరపడకుండు మిపుడె - తెలియఁగవచ్చున్. 383

వ. అనిదిగ్గనఁతల్పంబుననుండిడిగియిదెభయంకరంబైన పాపంబునాపాదిల్లఁజేసెదనటుమీఁద నీవు పడుపాటులుదైవంబెఱుంగుఁగాక, యనియుగ్రుండైయావిరిబోఁణియంతకుపూర్వము నేలఁబడవైచియున్న వాలుఁగేలఁగొని ఝళిపించి కోపంబున నిట్లనియె. 384

క. నెఱఁబడి కొన్నవరంబును । వితఁజేసితినోటనీకు - వేదనయును దు
ర్గతియుం బొరయించుటకుం । బ్రతినంగావించుకొంటిఁ - బాపెదనేపున్. 385

క. పతియాజ్ఞయునామాటయు । మతినెంచక నీవుధర్మ - మార్గమువిడి దు
ర్మతమును బూనితివిపతి । వ్రతవే ? నీవెన్నకపట - భాషిణివిగదా ! 386

క. లలనా ! ననుఖండించుట । బలితంబగుదోషమనుచు - పలికితివిదె; నే
తలఁద్రుంచు కొనెదనిపుడీ । కొలనీకుంగాకయొరుల - కుం జెందెడినే ? 387

క. చూడుమని మునికృపాణముఁ । దోడనె ఝళిపించిమెడను - దునుముకొనంగా
రూఢక రొత్తెందటుకునఁ । జేడియతనచేతులడ్డుఁ - జేసిభయమునన్. 388

ఆ. వలదువలదు వలదు - వాచంయమీశ్వర ! । త్వరపడంగఁదగునె ? - తాళుఁడయ్య !
సకలధర్మములును - జక్కగా నెఱిఁగియు । నాత్మహత్యదోష - మనితలంపర ? 389

క. అనిపలికి పట్టెఁబోయిన । మునియాముద్దియనుఁ జూచి - పూనికచెడునో
ననబోణి ! చేరరాకుము । తనువెన్నటికైనఁబోవుఁ - దలఁకేమిటికిన్. 390

క. పలుకఁగవలదిఁకనీ నీ । తులువిందునె ? యాత్మహత్య - దోషంబనుటం
దెలియనివాఁడనె ? యన్యుల । నలయించుటకైన, పాప - మనియేలయగున్ ? 391

సీ. నన్నిపుడడ్డగింపకుము - నానుడిఁగ్రకొనకుండి మాన్పరాఁ
జన్నె ? భవత్ప్రియోక్తులకు - [illegible] ముందడివాఁడఁగాను నే
నెన్నినకార్యమిట్టి తఱిఁ - నేలయొనర్పక మానుదున్ ? మహో
మన్నను నిష్ఫలంబనుచు - నవ్వలికిం జనినిల్చెధీరతన్. 392

జ. మదవతి పెక్కులానలిడి - మాయలమారి మునీంద్రుదు మూర్ఖ్యమున్
మదినిదలఁచి మాన్పినను - మానఁడిపిటడు నిజప్రయత్నమున్

ప్రిదిలెడు ధైర్యమేమివెతఁ - బెట్టఁదలంచిన వాఁడఁగోయఁచుఁ బె
ల్లొదవుమనోవ్యథల్ వగచి - యోజనఁజేయఁదొడంగె నివ్విధిన్. 393

క. ముని సెప్పినపనిఁదప్పక । యొనరింపుమటంచుఁబలికె - నుర్వీశ్వరుఁడీ
తనిపనుపులుదలపోసిన । వినఁగూడనివయ్యె నేమి - వెరవిపుడెంతున్. 394

క. తగునీపనియని సేతునొ । తగదనిమానుదునొ యెవ్వి - ధఁబుశుభంబో
తెగువకుఁబూనెను నేఁడితఁ । డగచాట్లకుఁబాలుపడితి - నకటా ! తుదపన్. 395

మ. తగదీదుర్వ్యవసాయమన్నఁదనకుం - దానైనిజగ్రీవమి
వ్వగఖడించుకొనంగఁబూనెనిదియుం - బాపంబ, దానెట్లునుం
బగతోఁజావఁగసిద్ధుఁడయ్యెనికనా - వాక్యంబులాలించునే ?
తెగినేఁజంపనఁజంపకుండిననునొం - చించుంగదా ! దోషముల్ 396

వ. కావున నేతద్వ్యాపారంబుదగదని వెఱచి నేనొర్వకమానినను, నితండుకంఠంబునుఖండించుకొనుటనిక్కువంబు. మదీయవల్లఖండితునికి నన్నుసమర్పించుసమయంబున నెట్టికార్యంబుఁజెప్పిననునితనిమాటకుమారాడకయాజ్ఞానువర్తినివై ప్రవర్తింపుమనిశాసించియున్నవాఁడు సత్యసంధుండైనపతిశాసనంబునతిక్రమించుటయుక్తంబుగాదు. కానమునీంద్రునియాజ్ఞప్రకారంబునడుచుకొనుటయుక్తంబుగాఁదోఁచుచున్నయది. సర్వంబునుభగవత్సంకల్పప్రకారంబునఁబ్రవర్తిల్లుచుండు. నీవిషయమైచింతించుటవలనఁ బ్రయోజనంబుగలుగదు. ఇంకనుంగొంతయితనికడంకమాన్పఁ బ్రయత్నించిచూచిపట్టువీడకున్నచో నేనఖండించి భూపాలునికట్టడి నుల్లంఘింపక మెలంగినదాననయ్యెద. నిమ్మునీంద్రుండు సెప్పినలాగున యౌవనరూపంబునొంది పునర్జీవితుండయ్యెనేనిసంతోషంబ. కాదేనికాఁగలరీతినిఁగాఁ గలదనివిచారించి, తొలుతనతనియూఁకువనుడుపనిశ్చయించినిస్త్రింశంబెత్తి వ్రేసికొన గమకించుచున్నయతనిఁగాంచివారించియిట్లనియె. 397

క. తగునయ్యా ! యిట్టిపనికిం । దెగువవహించుటయు, మీకుఁ - దెలుపఁగఁగలవా
రుగలరె ? లోకములోనన్ । మగువను నేననఁగనెంత - మాత్రముచెపుఁడా ! 398

క. వలదుడుగుఁడెనిన, యతఁడీ । వలనిమాటలనువిడుము - వారింపగనీ
వలనంగాదూఁకయా । వలఁబొమ్మభయఁబులేదు - వనితరో ! మాకున్. 399

క. శాసనముమీరినపుడె । నీఁస్వడిఁగలిసిగొంటి - నీకున్మాపై
వ్యాసంగిమేల ? చావం । గాసన్నధ్రుండనైన - కాలములోనన్. 400

ఉ. ఆనతివీటిఁబుచ్చియిపు - డౌననికాదనివల్కుచున్నని
స్త్రీనిశితాసినేసిపోలి - యింపుదుఁగాని, యనైనగిన్కనా
లోనఁదొలంగదింకఁ బ్రుటి - లోకొలనీయొడిఁగట్టియొపఁగాఁ
బూనిత, నాటచేఁబ్రతికి - పోఁవఁగఁగల్గెనునీకుపాపనీ ! 401

చ. పుడమియు రాజ్యమున్ భట స - మూహము నింక సుతుంగల్గి సర్వమే
గ్రుడఁగొనలేకఁ గైకొనిన - వాఁడను భూపతినైనవాఁడనా
నుడువుము లెక్కసేయవు గ - నుంగొనుమయ్యోడిలాగు, నెత్తబో
యెడిబరువెద్దుతోఁ దొలుత - నింతని చెప్పనదేటికిం జుమీ! 402

గీ. అనుచు మునివల్కుటయు, నింతి - యైనమీర | లేమిగావింపుమనియెద - రిపుడు నన్ను
తెలుపుఁడా! యంచు నడిగె; నేఁ - దెలుపలేదె | యవ్విధంబును నీతోడ - ననియె నతఁడు. 403

వ. ఇట్లు వచియించి ముని తనమనంబున, నిప్పుడీ కప్పురగంధి నా ప్రయత్నంబు ననుసరించి నడుచుకొనునదియును బోలె తోఁచుచున్నది. యటులనగునేని నాయుద్దేశంబు నెఱవేఱంగలదని సంతసించుచుండ నయ్యింతి యొక్కింత విచారించి యతనిం జూచి. 404

క. అన్నియుఁ దెలిసిన మీరే | నన్నీ దుష్కార్యమిపుడొ - నర్పుమనెదరే
మున్నది కననఁగ యీకొల | కున్నెనెటు బాలుపడుదు? - ఘోరంబకట! 405

క. మీమాటను వినకుండిన | నేమో మఱి విన్న నేమొ - యేకీడిపుడిం
దేమాడ్కిఁ గలుగునో నా | లోమిక్కిలి కొంకు వెఱఁగ - లుగఁ గాఁదొడఁగెన్. 406

క. ఎటులఁ? ననుసుముఖుఁడైయా | జటియిట్లను నబల! వలదు - సందేహము నీ
విటు రమ్ము కొనుము వాలుం | దటుకున ఖండింపుమపుడె - తరుణుఁడ నగుదున్. 407

క. పిమ్మట జరతుఁడననియెడి | పిమ్మట వర్జించి చాలఁ - బ్రియమునఁ బలుచం
దమ్ములనింపగు నర్మ్యా | దమ్ములదోర కేళిలోన - నలరింతు నినున్. 408

క. బేలా! వ్యర్థంబుగ నే | నేలా చావంగ నెంతు? - నిందున నాకున్
మేలొదవకయుండెడిచో, | నాలోచింపకుము దీని - కైయని వేడ్కన్. 409

మ. మునినిస్త్రింశ మొసంగి నంగొని యథా - పూర్వంబుగా నాత్మయం
దున నెంతే నియు భీతినొందియిపుడీ - దుష్కార్యముల్ సాహసం
బున నే నే విధిఁ జేయ నేర్తునకటా! - పూన్కిన్ నివారింపనెం
చినయత్నంబు ఫలింపదయ్యె ననుర - క్షింపంగ దేయీశ్వరా! 410

గీ. ఇంక తగదన్న మునివరుం - డింగలమున | నేయిఁ జిలికిన యట్లగు - నిశ్చయంబు
చెల్లరే! యిపుడేనేమి - సేయుదాన | నిట్టిపాపంబు నెట్లోడిఁ - గట్టుకొందు. 411

గీ. అనుచుఁ జింతింపుచున్నల - తాంగిఁ జూచి | యతఁడు వేగిగ పెట్టియి - ట్లనియె హాహా!
వనిత! యెంత సేపయ్యెనే - వాలునొసఁగి | సంహరింపుము వేవేగ - జాగు వలదు. 412

ఆ. లేశమైన నీకు లేదు పాపము, సత్య | మిదియధర్మమనుచు - నెంచుకొనకు
నేనెఱుంగనట్టి నీతిలేదెందున | ర్వజ్ఞుఁడంద్రు దాని - వలన నన్ను. 413

చ. తలకకుమింకఁ బాపముగ - దా! యని మానసమందుసర్వముం
దెలియఁగవచ్చునీకువిను - డింపఁగఁజాలినరీతిమీఁదటన్
కొలయొనరించుటెట్లనుచు - గుండెదుజేల! భయంబుగల్గునే?
యలఘుతపఃప్రభావయుతు - లైనమునీంద్రులొనర్చునేతలన్. 414

క. కావునసత్కార్యంబని । భావంబున నెంచియొందు - భావింపకల
క్ష్మీవిభునిరూపమేర్పడ । వేవేగంద్రుంచియనుభ - వింపుముసుఖమున్. 415

క. అనిచెప్పినృపతిపత్నిం । ద్వరఁజేసి సయతనియాజ్ఞఁ - గదప్పఁగలేమిన్
కరమునఁదాఁబట్టినయా । కరవాలముఁజూచిమునినిఁ - గనిమైనడఁకన్. 416

చ. పసమకృపాలవాలుబుధ - భావవిలోలుసుశీలుసద్గుణా
కరుసురపాలునీలతనుఁ - గాంచనచేలునిశాటకాలునుం
దరసుకపోలుభూధరుని - తామరసాక్షుని భక్తజాలునిన్
శ్శరధిసుతానుకూలునెద - సంస్మరియించి నమస్కరించితాన్. 417

ఉ. ఓకమలోద్భవారమణ! - యోనుజనావన! యోపరాత్పరా!
యోకలుషాట వీదహన! - యోమురమర్దన! యోజనార్దనా!
యోకరిపాల! యోవిమల! - యోసకలాత్మక! యోదయాకరా!
యోకమనీయవేష! కుగ - రోద్ధర! నామొరనాలకింపవే! 418

సీ. నీలాంబుదశ్యామ - నిశ్శామనః కామ - శ్రితజనపాల పో - షితకుచేల
నాగభూషణమిత్ర - నాగరాణ్ణుతిప్రా - విమలాంతరంగ దు - ర్విషయభంగ
విశ్వకల్పాధార - విశ్వేశసుకుమార - ప్రకటవైరివిరామ - భవ్యనామ
సామశాహితకాల - సామగాన విలోల - రాజితహార స - ర్వజ్ఞధీర
గీ. సన్నుతశుభాంగ యోగిహృ - జ్జలజభృంగ । తరణికోటి ప్రకాశ సం - తాపనాశ
యాదిమధ్యాంతరహిత వి - ఖ్యాతచరిత । కలుషముల నొందనీయక - గావువరద. 419

శా. నీవేదిక్కుఁకదుష్టసంహార జగ - న్నిర్మాణ పాండిత్య పూ
ర్ణా! వేదాంతపద స్వరూప! నిగతా - నందా! ముకుందా! యుపేం
ద్రా! వాణీపతి ముఖ్యవందిత! యనం - తా! శాంత! సత్యప్రియా!
దేవా! నామొరనాలకించి మదిసం - దేహంబు వారింపవే! 420

ఉ. ఈమునితల్లజుండు ధృతి - నిత్తఱిఁ ‘జంపుమునన్న’టంచు నా
చేమొగినిచ్చె ఖడ్గమును - చెల్లరె! యింతటి ఘోరకృత్యమున్
భామిని సేయఁగాఁదరమె? - పాపమునిట్లొడిఁగట్టి పోవఁగా
నేమొఱపూనె నేఁడితఁడు - హేపరమేశ్వర! గావవేననున్. 421

మ. సభలోదాయలు శోకనూద్భుతతినో - శౌరీ! జగన్నాయకా!
నభసంకాశవి నీలవర్ణ! వరదా! - నారాయణా! శ్రీధరా!
శుభదా! కావుమటంచు గృష్ణమదిలో - స్తోత్రంబుఁగావింప, వే
గభయంబుగ్ దొలఁగించి ప్రోచినవిధిగ్ - గాంతగ్ సనుఁగానవే! 422

క. ఖండింపననిఁ దానే । ఖండించుకొనంగఁ బూనెఁ - గడుకోపముతో
రెండవసఁగ లేకనే నీ । దుండెగ మొనరింప ధృతినిఁ - దొడగఁగనల సెగ్. 423

ఆ. ఆడినమాటచెల్లునని - యాజ్ఞయొసంగెను మారువల్కఁగా
నోడియకార్యమయ్యు నిపు - డొప్పితిఁ జంపకదీఱదింకఁ జే
యాడిననాడకున్న; మది - యందునినుగ్ స్మరియించి పూనినేఁ
గూడునుకూడదంచనకఁ - గొంకకవానిని సంహరించెదగ్. 424

సీ. అనిజనార్దను నతిభక్తి - నాత్మ నెంచి । భయమువర్జించి స్థైర్యంబుఁ - బాగుకొలిపి
వెలఁదికరవాలమును ఝుళిపించియెత్తి । యనఘ! కర్తవ్య మెఱిగింపుఁడనినపాని. 425

క. లలనా! మాటికిమాటికిఁ । బలుకంగావలెనె? యిన్ని - పలుకులుగలవే?
తలఁపున సందేహింపక । వెలయఁగఖండించి పిడప - వేడుకఁగనుమీ! 426

క. ఇదెకుత్తుకఁ జాచితిని । య్యదనదతో బ్రోద్దువోయె - నాలస్యముఁజే
సెదవేలా? యొకవ్రేటునఁ । బదరకఁద్రుంపుము శుభంబుఁ - బడెయుదుమనినగ్. 427

చ. కలికికరంబునందుఁగల - ఖడ్గముతద్గృహ దీపకాంతిచేఁ
దళతళలాడ ముంగురులు - దాపలిచే నెడఁబాపు, కొంచుఁదాఁ
దొలఁగిన పైఁటకొంగుఁ జను - దోయిపయిగ్ సవరించుకొంచు ని
శ్చలమతినిల్చి వేలుపులఁ - జాలఁగభక్తిఁదలంచి యాత్మలోగ్. 428

క. నానలనలేదునేరము । గావింపఁగరానిపాప - కార్యంబునునేఁ
గావింపవల సెనోభూ । దేవీ! ద్యోవాణి! మీరు - దీనికిసాక్షుల్. 429

సీ. సృష్టిస్థితిక్షయ - సిద్ధసంకల్పులై - కీర్తింపఁబడుచుయో॥త్రి - మూర్తులార!
ప్రజ్ఞావిశేషవై - భవపరిపూర్ణులై - ప్రఖ్యాతినివెలయుది - క్పాలులార!
ప్రాప్తానుకూలసం - పద్విపత్ఫలదులై - ఘనతఁజెందిన నవ - గ్రహములార!
మానితోన్నతసత్య - మార్గసంచారులై - చాలభాసిలుసూర్య - చంద్రులార!
గీ. తపసియాజ్ఞను నేఁడలఁ - దాల్చియిపుడు । కొలమొనర్పఁగమదినియ్య - కొంటినన్నుఁ
గలుష మొందఁగనీయకఁ - గావరయ్య! । మిగులవేఁడెదమిమ్ముమిము - మిమ్ముమిమ్ము. 430

వ. అనిసంస్మరించిసాహసంబునభండానురసంహారోద్యుక్తయైన సమయంబునఁదోఁచినచా
ముండీయుగంబోలెయప్పుడు. 431

క. ఆలీషపాదయైకర । వాలమునంకించిమొత్తి - వనితామణియా
భీలగతి నే సెమునితల । నేలపయిందునిసిపడఁగ - నిమిసార్ధమునన్. 432

శా. ఆనారీమణియవ్విధంబుననిజా - జ్ఞాధీనయై ద్రుంప, యు
గ్రానేఁజచ్చితిఁజచ్చితింజెడిపెనన్ - ఖండింపఁగాఁబూనెర
మ్మా ! నన్నావుమ ! యంచుఁజచ్చునపుడా - మారీచుఁడెట్లాక్రైనో
తానాలక్ష్మణుఁజీరి, యట్లుఅచియం - తంగ్రింపఁగాలెక్ వెసన్. 433

ఆ. మునివరుండుసచ్చి - భువిమీఁదఁబడుటయుఁ । గాంతవెజఁగుఁజెంచె - చింతమీఱ
నేమిసేయుదాన - నిఁకనంచువిభ్రమ । మడరినిలిచికనుచు - మిడుకఁదొడఁగె. 434

వ. అనిచెప్పిన, యవ్వలివృత్తాంతంబెట్టిదనియడుగుటయు. 435

ఉ. దారుణవహ్నిభక్షణ ! ము-దప్రద ! తాపసలోకరక్షణా !
భూరుహయుగ్మభంజన ! సు - భూషణశోభిత ! భక్తరంజనా !
సారసమిత్రకోటిసమ - సన్నుతతేజ ! హరీ ! కిరీటివం
ద్యా ! రిపుజాలభీకర ! జ - యంకర ! భూరమణా ! దయాకరా ! 436

క. పంచాయుధధర ! పావన ! । పంచాయుధజనక ! దాన - వన్విపపటలీ
పంచానన ! కమలాసన । పంచాననముఖ్యవినుత ! - పావనచరితా ! 437

భుజంగప్రయాతము

త్రిమూర్తిస్వరూపా ! స - తీపుష్పచాపా !
రమాలోలభూపా ! ప - రా ! సుప్రతాపా !
సమీచీనభావా ! ప్రశ - స్తప్రభావా !
రమాకాంతపాలా ! ని - రూఢార్ధమూలా ! 438

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్ఘళచతుర్విధ కవిత్వమహాత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబునం ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వచరిత్రము

## ఉత్తరభాగము



## తృతీయాశ్వాసము.

క. శ్రీవత్స! దేవకీవసు | దేవస్తుత! పావనాభి - ధేయ! చిదానం
దా! విశ్వంభర! ఫణిరా | డ్గాత్రివాగ్రస్థలనివాస! - రాజవిలాసా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు, సన్నుతపుణ్యకథాశతాంగసూతుండగుసూతుండిట్లనియె. నవ్విధంబునఖండితంబైన మునికళేబరంబునుగాంచి యశోవతివిభ్రమాకులమానసయైకర్తవ్యంబుదోఁపక ఖడ్గహస్తయైయట్టైనిలిచి యుండ నయ్యవసరంబున. 2

ఉ. వాకిటనున్నయుగ్రుఁడుక - వాటముచెంతకుఁ బోయిచూచివో!
చీకుమునిన్ వృథాయిటులఁ - జెండుదురే? తగునే? దురాత్మ్మరా
లా! కలుషంబుగల్గుటఁద - లంపవె? ధర్మమె? నీకటంచుఁబెన్
వ్యాకులమొందికేకలిడి - యారటమొప్పఁగఁ జిందులాడుచున్. 3

క. కలదే యీయన్యాయం | బిల; భూపతిధర్మపత్ని - యివ్విధమునఁదాఁ
గొలసేయఁదగునె? యెవ్వరు | గలరిచ్చటమాకుదిక్కు - గాఁగలవారల్. 4

మ. జరఠుఁడున్ సుగుణాన్వితుండునుమహా - శాంతాత్ముఁడున్ సద్వ్రతా
చరణాసక్తుఁడు సత్తమోత్తముఁడునౌ - జ్ఞానాధిపున్ బూజ్యుమ
ద్గురునింద్రుంచిన పాపరూపిణినిలో - కుల్మెత్తురే? సంపదల్
స్థిరమైయుండునె? దుస్వభావులకుసం - సిద్ధించునేభద్రముల్. 5

క. ఇటువంటిదానినెందును | గటకటనేఁజూచియెఱుఁగఁ - గడపటనిట్టి
చ్చటఁజెడిపెచేతనిసిఁజ | చ్చుటకున్ విధియుండెనేమొ - చూడఁగనయయో ! 6

ఉ. మాయలమారియివ్వనిత - మానినిఁగూడుకఁ గాపురంబుఁదాఁ
జేయుటకిచ్చలేకచెడు - చెద్దుకిఁబాల్పడిమచ్చరంబుతో
బాయఁగలేనిరక్తిఁగల - భంగినటించినిశీథివేళన
న్యాయముగావధించెనపు - ణ్యంబునుగన్గొనియిట్లు; చెల్లరే! 7

ఉ. దాతయువోలెసర్వమును - తాపసవర్యునకిచ్చిమించువి
ఖ్యాతినిఁగాంచిపిమ్మటఁగు - లాంగనతోఁ 'దటీఁజూచిరేయినీ
వీతనిజంపు'మంచువచి - యించిరియొకండు నెఱుంగనట్లుగా
భూతలభర్తరాజ్యమును - బొందుటకై తటివేచి యుండెడున్. 8

ఆ. నృపతికెఱుకలేక - నెలఁతయీదుష్కార్య । మెటులసేయనేర్చె? - దిటవుగాఁగ
యతనికృత్రిమంబె - యగునింతయునునమ్మ । ప్రాణములనుగోలు - పడియెమౌని. 9

ఉ. ఇప్పురిలోనయోగ్యుఁడొకఁ - డేనియులేఁడె? మహాత్ముఁడౌముని
గప్పురగంధిజంపినయ - కార్యమువేగమెపోయి రాజుతోఁ
జెప్పఁగజాలఁడే? యిటుల - సేయుటపాడియె? రాజపత్నియే
తప్పొనరించినందగిన - దండనశాస్త్రములందుఁ గల్గదో? 10

ఉ. ఓపురవాసులార ! వినుఁ - డుత్తములార ! వినుండుమద్గురున్
బాపమటంచుఁ గొంకక నృ - పాలునిపత్ని వధించెఁ జూడుఁడా !
యోపిన జీవనౌషధము - లుండినవే బ్రతికింపుఁడయ్య ! సం
తాపముఁబాపుఁడయ్య ! సుకృతంబునుఁ గీర్తియుమీకుఁగల్గెడిన్. 11

ఉ. ప్రాపగు వారలెవ్వరికిఁ - బాయకపుత్త్రిని భంగినెంచి యెం
తోపరితోష మొప్పనను - దూఱకఁగొట్టక యించుకేనియున్
గోపముఁ జూపకెల్లపుడు - నుండయనారయు తండ్రివంటి యీ
తాపసవర్యునిందునిమె - ధర్మమధర్మముఁ జర్చసేయుఁడా ! 12

ఉ. కానలలోననుండి కల - కాలముఁ గష్టములొందలేక 'యే
మైనను నయ్యెనైహిక సు - ఖాప్తిమెలంగెద, నంచువచ్చియీ
మానవనాథు వేఁడిముని - మండనుఁడెల్లసిరుల్ గడించెనీ
చానసహింపలేకిపుడు - చంపెను నిర్దయనేమి సేయుదున్ ? 13

ఉ. కోరినృపాలు రాజ్యమును - గొన్నపు 'డింతయె చాలునింతిపైఁ
గోరికియున్నచోఁదగిన - కోమలినెచ్చటనైనఁ దెచ్చిసం
సారముఁజేయవచ్చు'నని - సమ్మతినుండకరాజ పత్నిపై
నేరకవాంఛ నించెనది - నేరముగానిపు డేర్పడెన్గసన్. 14

ఉ. జిత్తులెఱుంగఁ డీచెడిపె - సెప్పిన మాటలు నిక్కమంచుఁ దాఁ
జిత్తములోన నెంచెను గు - శీలల మాటలుదు స్వభావమున్
బత్తియు నమ్మఁజెల్లునె ? విపత్తినిఁజెందఁగఁ బోవువేళ యే
యుత్తముఁడేనియుం జెడును - యోజనసేయఁగ నేఁగడెన్నగన్. 15

ఆ. ఇంతి తెగునకత్తె - యింతటిదెటుబుట్టె । రాచకులమునందు - రామరామ !
పారికాంక్షివరుని - బ్రాణాపహరణార్థ । మవతరించె నొక్క - యవనిలోన. 16

ఆ. ఐనదయ్యొమౌని - యీయువింతియయింక । యురకదీనివిడిచి - యరుగరాదు
కట్టుకున్నఁ జేలు - కుమ్మరపురుగండ్రు । తెలియఁజేతు నేమ - దీయశక్తి. 17

క. నమ్మించిగొంతుఁగోసిన । దిమ్మాయలమారి దీని - నెల్లజనంబుల్
నమ్మఁగరాదని తిట్టఁగ । నమ్మించెదనొక్కరాక - కంగడివీధిన్. 18

ఆ. మౌని వరుఁడు జన్న - మాకుబాగ్యత లేదె ? యతనిశిష్యుఁడను మహాప్రియుండ
నదియుఁగాక మంత్రి - నగుదునుగావున । రామనలఁతుఁగొందు - రాజ్యమెల్ల. 19

చ. అనికడునుగ్ర వాక్యముల - నాడుచునల్లరిసేయ, యుగ్రుఁడే
లనొనడు చేయినిట్లు జను - లంబెనుకూతలువెట్టి చీరితా
గనలునఁబల్కుచుండెడిని - కాగణమెద్దియొ యంచుమౌనితా
సనముసఁగాఁపుగాఁగ మెఁగ - సాలఁజరించునృపాలుఁ డెంచితాన్. 20

ఆ. అంతకంత కధిక - మైన యుగ్రునికేక । లాలకించి తపసి - కట్టివేళ
నేయపాయ మొదవె - నోయంతిపురమున । నెఱుఁగవలయునుచు - నేగుదెంచె. 21

ఆ. అటులవచ్చికేళి - కాగార సామీప్య । మందునిలిచియున్న - యట్టియుగ్రు
నుగ్రమూర్తిఁజూచి-యొయ్యనఁ దాఁ మొక్కి । భయముభక్తిమీఱఁ-బలుకరించి. 22

క. ఓవిప్రోత్తమ! యిట్లిపు । డీవెగటుగుకేకలిడుట - కేమినిమిత్తం
బోవివరింపుడ, వినినేఁ । గావింపఁగఁదగినరీతిఁ - గావింతుఁదగన్. 23

ఆ. ఈనిశీథివేళ - నిచటనొంటిగనిల్చి । యుండుటయును జాల - యుగ్రమైన
మాటలాడుటయును-నేటికి? వచియింపుఁ । డయ్య! మదినిసంశ-యంబువొడమె. 24

క. జనసన్నుతుఁడైనతపో । ధనునకునేదేనియిచటఁ - దక్కువపడెనే ?
వనితామణిచెప్పినలా । గునమెలఁగుటలేదో? మీకు - కోపంబేలా ? 25

క. ఆరమణి నేరమేమా । నేరంబో హేతువద్ది? - నిజమెఱుఁగుటకుం
గోరిచనుదెంచినాఁడను । భూరిగుణాధార! విపయ - ముందెలుపుఁడోగిన్. 26

వ. అనిప్రార్థించిన విజయాశ్వునిం జూచి. 27

మ. అపుడుగ్రుండుపురత్రయీహరణకా - లాత్యుగ్రకోపోజ్జ్వల
త్త్రిపతాకాననుఁడైనదర్పకవిరో - ధింబోలె రూక్షంబుగా
నృపతింగన్గొనివల్కెనోరి! కుమతీ! - నిర్ఘోషియుంబోలెన
న్నిపుడీకారణమేమటంచడుగనా - నే? తోఁచదో నీమదిన్. 28

చ. అడిగినవాని నెల్లనుగు - శాంధ్యునిభంగినొసంగి చాలఁగా
నడఁకువమాటలాడిహృద - యంబునమచ్చర మొప్పమద్గురుఁ
మృడసమునిందపోధనుని - మేలునుఁ గీడును నెంచకీనిసిఁ
ముడుఁగక నీవునీతరుణి - మూలముగాఁగడ తేర్చి కానవే? 29

ఆ. అన్నికార్యములును - సన్నద్ధమొనరించి । మిన్నకెలుఁగనట్లు - నన్ని దేమి
హేతువంచునడుగు - టెంతయుఁజిత్రంబు । మెచ్చవచ్చునిన్ను - మేటివహహ. 30

ఉ. ఉత్తముఁడైనవానివరు - నొడకవాపము నెంచకయ్యయో!
రిత్తకరిత్తచంపుమన - రేచెనె? బుద్ధివివేకదూర! యీ
మెత్తనిమాటలుం బ్రియము - మిక్కిలిభక్తియుఁ జాలుఁజాలునీ
చిత్తమెటుంగనయ్యెనుయి - నీ! నినుఁ జూచినరోతపుట్టెడిఁ. 31

క. ఇంతటికిఁ దెగించిననీ । వెంతటికిఁ దెగింపకుందు - విఁకనోరి! ధరా
కాంతుఁడపకారియైనఁ । వంతకుపాల్గొకజనులు - వర్ధిల్లదురే? 32

క. తెలియనివారలు నిన్నుఁ । బలుకుదురుఘనుండవనుచుఁ - బ్రజ్ఞారహితుల్
తలపంగావారలు; కడుఁ । గలుషాత్ముఁడవీవుబాగు - గాఁగనుఁగొంటిఁ. 33

గీ. విప్రుఁ జంపుటయగ్రజు - వెలఁదితోడ । గలయుటయుసాధువుల గేలిసలుపుటయును
గడఁగి యొరుల గేహంబులు - గాల్చుటయును మ । హోగ్రకిల్బిషసంసిద్ధి - నొందఁజేయు.

క. దయమానిసంశయింపక । భయమొందక సత్పురుషుల - భంజించిననిశ్
శ్చయముగసిరిచెడువంశ । క్షయమగు; దుర్ణయునకేలఁ - గల్గు? శుభంబుల్. 35

ఆ. తపసియడిగినపుడు - ధనరాజ్యములసతి । నొసఁగయిచ్చలేక - యన్నఁదెలియఁ
జెప్పియనుపరాదె? - తప్పేమి? లేదన్న । నిచ్చి, చంపికొనన - దేల? చెపుమ? 36

క. మాకరయఁగహితశత్రుఁడ । వైకపటముగానటించి - యన్యాయముగాఁ
జీకుమునింజంపించితి । వీకార్యముతగునె? నృపతి - వే! నీవెన్నఁ. 37

క. నాశక్తినింకఁ జూడుము । నీశర్మంబడఁగునటుల - నిర్ఘాతసమం
బౌశాపమొసఁగియిపుడే । నాశనమొనరింతువిపతు - నా? నేనురకఁ. 38

క. అనినటుఁడాగ్రహమునఁ బ । ల్కిన, యాశ్వర్యంబుభీతి - కింగయుఁగదురఁ
జనపతికడుశాంతోక్తుల । వినమితుఁడైయిట్టులనియె - వివరమెటుఁగకఁ. 39

మ. జగతీనిర్జరవంశభూషణ! భవ - చ్ఛాపోగ్రదావాగ్నికో
ర్వగిరీశుండనునొపఁడో పుడునె? నే - భవ్యాత్ముఁడో మానిసెు
వ్వగఁదామానిని చేవధింపఁబడెనో - వాదంబుఁగల్పించియా
మృగరాణ్మధ్యయ దేలఁజంపెనొకొత - ద్వృత్తాంతముంబల్కుఁడా! 40

క. ఇంగముఁదెలియనినామీఁ । దంగనలిననేమిఫలము ? - తగనవ్విధమె
బ్బంగిరొమివినఁగోరితిఁదీ । ర్పంగదెసంశయమువేగఁ - బ్రవిమలహృదయా ! 41

క. సూచింపకనాపైనిటు । నీచంబగునిందమోపి - నిందించెదరే
మోచిత్రమనిన, నైఁపక । వాచంయమిశిష్యుఁడపుడు - వారనికినుకన్. 42

మ. విజయాశ్వావనిభర్తకిట్లనియె నీ - విశ్వాసమున్ ధర్మమున్
నిజమున్ దేవుఁడెఱుంగుఁబొమ్మ ; చనిమా - నింజంపిరమ్మంచునీ
రజపత్రాక్షినిమున్నుబంచినసుఁ జే - రన్ వచ్చినాతోడన
క్కజపుంబల్కులువల్కెదేల ? యిదినీ - కార్యంబుగాదే ? నృపా ! 43

మ. చనవున్ భక్తియునింకఁజాలుమదిలో - సంకల్పసంసిద్ధియ
య్యెను రాజ్యంబులభించెఁ జచ్చెఁగద మా - నీంద్రుండునాపత్నిఁజే
కొనిజీవింపఁగనేర్చునే ? యిపుడుచి - క్కుల్ దీఱెఁబో, యంచునీ
వనుమానింపకగేలిసేయుటిది, యా - హా ! తోఁచెనాబుద్ధికిన్. 44

చ. తలఁచిననాడుకార్యము వృ - థాయగునో యగునో యటంచున
గ్గలమగుసందియంబున వి - కారమునొందుచుఁగూర్కుమానివీ
ధులఁజరియించుచుండివగ - తోయిటనేమొఱపెట్టినంతనే,
తెలియనివానిభంగిఁజను - దెంచితివిస్థితిఁగాంచిపోవఁగన్. 45

క. లేకున్న ? నిన్నుఁజీరితి । నే ? కడువడినింతరాత్రి - నిర్ఘోటికినీ
వేకారణమునవచ్చితి । వాకస్మికముగ ; వచింపు - మాకూతంబున్. 46

ఉ. మించెనుకార్య, మాతపసి - మిమ్మెటకేనియుఁ బోవఁబంచియా
ర్జించినరాజ్యసంపదలఁ - జెల్లుబడిందనయిచ్ఛలాగుగా
వించుకొనంగరాదె ? యవి - వేచనకున్ ఫలమిట్టిదయ్యెఁదా
వంచితుఁడయ్యెఁబోతుదకు - వాంఛనునొందకవీడెజీవముల్. 47

క. నీయాజ్ఞగాకయుండినఁ । దోయజముఖియింతపనికిఁ - దొడరునె ? తానై
చేయంగఁదలఁచినంతయుఁ । జేయించితివింకనేమి - జేసెదు ? చెపుమా ! 48

క. తిట్టినొకొట్టినొనిర్దయఁ । బెట్టంగారానిబాధఁ - బెట్టినొ ? నిన్నుం
జట్టనద్విజుఁడనిరొంచకఁ । గట్టడిపై యిట్టిపనికిఁ - గడఁగందగునే ? 49

గీ. ఇచ్చితివిరాజ్యమడిగిన - నిచ్చగలుగ । కిచ్చినదికొన్నఁగైకొందు - నెగ్గులేదు
గానినిష్కారణంబుగా - మానివరుని । నింతితోఁజెప్పిచంపించు - టేల ? యనిన. 50

ఆ. నృపతియిట్టులనియె - నేనుమీరనెడి వృ । త్తాంతమందు లేశ - మైననెఱుఁగ
వంచనయును నెఱుంగ-వాచంయమినిఁ జంపఁ । దలఁచుటెఱుఁగ మీవచంబులాన. 51

మ. హరికిం బ్రీతిగ రాజ్యముల్ సిరులునే - నర్పించితిన్ మానికిం
ధరణిన్ గోరినసంతసంబమరఁగా - దత్తంబుఁగావించితిన్
గురువుం దైవముఁదానె యంచు భయభ - క్తుల్గల్గి సేవించితిన్
పరమార్థంబుగ నిన్ని సేసితుదఁ జం - పంబుద్ధి నేనెంతునే ? 52

చ. స్మరగవారతుల్యుఁడైన ముని - చంద్రునకర్పణజేసియున్న యా
సిరినిఁగొనంగ నేమరలఁ - జిత్తమునందలపోసి చంపిత
ద్దురితము నొందఁగాఁగడఁగు - దుర్మతిఁగాను, గుణాఢ్య ! యింత దు
ష్కరమగునట్టి కార్యమును - చానమొనర్చుటకేమి హేతువో. 53

చ. సరసిజనాభు పాదములు - సాక్షిగఁజెప్పెదనయ్య ! వానిశే
ఖరుఁడు వధింపఁగాఁబడిన - కారణమెట్టిదియో యెఱుంగనే
హరిహరి ! కృష్ణకృష్ణ ! దురి - తాత్ముఁడనంచుఁ దలంచినన్నుని
ష్కారణను దూఱరాదువినఁ - జాలను కర్ణములందదుక్తులన్. 54

ఉ. ఆవసుధామరేశ్వరుని - యానతిఁబూని హజారమందునేఁ
గావలియుండి మీరిచట - గట్టిగఁగూతలు వెట్టుచున్న యా
రావము నాలకించి యిటు - రాత్రినిఁదాముని శిష్యుఁడట్టైవా
పోవఁగనేల ? యంచెఱిఁగి - పోవుటకై యరుదెంచితిన్ వడిన్. 55

క. ఇంతకు మిక్కిలి నేనో । క్కింతయు నెద్దియునెఱుంగ - నిదిసత్యం బీ
వింతయగు ఘోరకృత్యముఁ । గాంతయొనర్చుటకుఁదగిన - కతముంజెపుడా ! 56

క. కనలు డిగియావిశేషము । వినఁదగినదియైనవేగ - వినిపింపుఁడు న
న్ననవలదేమియునేత । ప్పును నాయెడలేదటన్న - బూమెవడుగుతాన్. 57

గీ. కొంతశాంతి వహించి భూ-కాంతుఁజూచి । పరుషభాషలుమాని య - చ్చెరువుగాఁగఁ
జెప్పఁదొడఁగెను మానిజ-చ్చిన విధంబు । నెంతయును దైన్యమున దుఃఖ-మినుమడింప.

క. వినవోయి నీకులాంగన । మునినోల్లకయతఁడు చాల - మోహవశుండై
తనకోర్కెఁ దీర్పుమనఁగాఁ । గనలునఁగడురోతఁజెంది - గర్వముమీఱన్. 59

సీ. బాగాలనిమ్మన్నఁ - బండ్లుగీటుచునంత - యధికారమానీక - టంచుఁగసరి
మడుపులందిమ్మన్న - బడుగునకిదికొంత - విభవమా ? యనితిట్టి - విసరివైచి
ముద్దుఁబెట్టుమటన్న - మూతిఁద్రిప్పిబికారి - కదియొకటా ? కొఱ-యనుచునవ్వి
కౌఁగిలింతునటన్నఁ - గావరంబడఁతు నీ - వవలఁబొమ్మంటకు - మనియదల్చి

గీ. కేళిఁగలయంగరమ్మన్న - గేలిఁజేసి । వినయమున వేఁడుకొన్నఁదా-వెగటుఁజెంది ?
సరసముగ మాటలాడిన - విరసమొందె । ఘంటఁబోయినఁజీ ! యని - యవలికేగి. 60

గీ. కనికరములేక వెతఁబెట్టె-మునివరుండు । నన్నుటకుఁ జేరివనిత దుర్నయమ్ముఁదెలిపి
వెలఁదిననుకూలవతినిఁ గా - వించుకొనఁగఁ । దగిన సదుపాయ మెట్లన్న-నగచి నేను. 61

చ. గురువరుఁడట్లుకష్టమున - కుంగుదిరైయెసుఖమింత లేకవం
దురుటఁదలంచియేమియును - గోఁచక యోజనఁజేసిచేసివీ
రిరువురనుంబ్రియంబునయ - ధేన్వనుగూడిమెలంగుటింకనె
ప్పరుసుననోయటంచుఁదెలు - పంగనుమాటఁదలంచియంతటన్. 62

వ ఎడఁగలుగఁబిలిచి యాకాంతకువినఁబడక మెల్లననిట్లని చెప్పితి. 63

గీ. అయ్యా! నేనెంతవాఁడ? మీ - యంతవారి । కాత్మఁదోఁచనియుక్తినే - నరసిపలుకఁ
గలనె? యైననునడిగిన - కారణమున । విన్నవించెదనొకమాట - వినుఁడుమీరు. 64

క. త్వరపడకమంచిమాటల । విరసంబగుబుద్ధిఁదొలఁచి - విరిబోణినిఁజా
తురిమీరనేలుకొనవలెఁ । బురుషుండని ఘనులుమిమ్ముఁ - బోఁట్లనవిందున్. 65

చ. వలనగుపల్కులంగ్రియల - వాంఛితవస్తు సమర్పణంబునం
గలిమినిమించుమైత్రినొడి - కంబునవీవినిబాంధవంబునం
జెలువవసంబగుంబురుషుఁ - జేకొనివేడుకఁ గూడుఁజాలఁగా
వలపుననంచునేర్పుఁగల - వారలునల్కుడు రోమునీశ్వరా ! 66

ఆ. మీకుఁజెప్పనేల ? - మీరెఱుంగనివిష । యంబులేదుగాని - యతివచిత్త
మనుసరించిమెలఁగి - యనుకూలవతినిఁగాఁ జేసికొనుఁడటంచుఁ - జెప్పినేను. 67

క. అటనుండితొలఁగియప్పుడు । జటియుమునీసతియుఁజేయు - సంభాషణమె
ప్పటిచోటనుండిచెవియిడి । దిటవుగవినుచుంటినంత - తెలుకువమీఱన్. 68

క. మునిపతిసరసోక్తులచే । వనితనులాలించుచుండ - వైరస్యమునం
గనలొందికసరితిట్టుచు । ననాదరముగాహసించి - యపుడిట్లనియెన్. 69

క. ఓరి బికారీ! ననుమదిఁ । గోరినమాత్రమునఁగోర్కె - కొనసాగునె? నీ
కేరీతిలభించున్నృప । దారాసంగమసుఖంబు - దగుననికొన్నన్. 70

క. ఊరకిటన్ ప్రేలకుచని । కారడవులలోనఁగాయ - కసరులుదినిమేల్
నీరానివైదికవ్యా । పారంబుననుండుమదిశు - భంబగునీకున్. 71

క. చేవచెడయోగధారణఁ । గావించుచుజీవయాత్రఁ - గడపకయోరా!
జీతచ్ఛవముంబోలిన । నీవుననుంగోరుటొప్పు - నే? యవివేకీ! 72

సీ. అధ్వరహోమార్హ - మైనపురోడాశ - ములభించునేశ్వాన - మునకుఁదినఁగ
మానసకాసార - మంజులవీచికాం - దోళనసుఖమునొం - దునెబకంబు

సన్నుతనిర్ఝర - క్ష్మారుహప్రపవసా - గభ్యంబుఖలునకే - రహిఁఘటిల్లుఁ
ప్రవిమలోజ్జ్వలతర - ఫణిశిరోరత్నంబు - దొరకునే భువిదరి - ద్రునకుఁ దలఁప

ఆ. నిరుపమానభోగ - నిరతయుఁ జవ్వని | యైన నృపతిపత్ని - నభిలషించి
సంతనిన్ను బోలు - నధమునకెవ్విధిఁ | గలయు పుణ్యఫలము - గలుగుఁ జెపుమ. 73

క. కట్టా! నీకీకోరిక | పుట్టం గాఁదగునె? తపముఁ - బోవిడుచుటయా
గిట్టని పనికిం దొడరుట | చెట్టకపు మూలంబు నీకుఁ - జెప్పితినమ్మా ! 74

క. తగఁబరిహాసమునకునను | జగతీపతి మోసఁగెనీకు - సత్యమగునె? యే
మగవాఁడు భార్యనింకొక | మగవానివశంబుఁ జేయు? - మహినిజమైనన్. 75

క. పతిపరిహాసించి నమ్మని | కుతుకంబునఁ బనిచె నన్ను - గొబ్బున నీతో
రతికేళింబెనఁగఁగవ | చ్చితి సనితలపోసి బుద్ధి - చెడిపలుకకుమా ! 76

క. ఏపాటివాఁడవని నే | నీపొందునకిచ్చయింతు? - నీచాత్మా ! ఛీ!
పో ! పొమ్మని నిరసించినఁ | దాపసపతి వింతఁ జెంది - తానిట్లనియెన్. 77

క. ఎట్టెట్టూ? యింకొకపరి | గట్టిగ వచియింపు మేమి - గాయొసఁగెనో? తా
నిట్టిదియా? కథ ; మంచిది | మెట్టుసుమీ ! నిజముఁ బలుక - కుండిన నీకున్. 78

క. ఈనడవడి నింతకుమును | నేనెఱుఁగను నమ్మియుంటి - నిక్కమెయని, య
ట్లైననను గేలిఁ జేయఁగఁ | దానెవ్వఁడు? నేనెవండు? తటమటతగునే? 79

క. వాచంయమి సనితలఁపక | నీచునిఁగానెంచి యిట్లు - నిందించితివో
రా ! చేదుకాయనైతినె? | యాచెడురాజానకు నీవు - నంబుజవదనా ! 80

క. రాజింతటి పనిఁ జేయఁగ | యోజించునె? నమ్మజాల - యొడబడితా నే
లాజాయనొసఁగు నొల్లని | నో, జిత్తులుగావె? నీవు - సెప్పెడిమాటల్. 81

ఆ. నీకుమనసురాని - దే కారణముగాని | యొండుగాదు సుమ్మ - యువిద ! నిన్ను
వేఁడుకొనెదనింక - విపరీతచర్యలు | విడిచికొఁగలిమ్మ - తడయవలదు. 82

క. తిట్టినఁ గొట్టిన నీవిపు | డెట్టాడిన నోర్చియుందు - నిట్టట్టనఁ జే
పట్టితమిఁ దీర్పకివ్విధి | నట్టేటం బుట్టిముంచ - న్యాయమె? చెపుమా ! 83

ఆ. ఎపుడు నిన్నుఁ గొందు.- నెపుడబ్బు నీపొంద | టంచుఁ దలఁచుచుండి - నట్టినన్ను
నవనిశాల్మలీఫ - లాసక్తిఁ గాచిన | చిలుకవంటివానిఁ - జేయదగునె? 84

క. అపుడిచ్చయించి పలికితి | విపుడిట్లను టేమిమాట? - యిదిగర్మముగా
దపుడే యసమ్మతంబును | కపటంబును వీడిచెప్పఁ - గారాదె? ధృతిన్. 85

ఆ. కానిపోనిపట్టి - కలహంపుఁ బల్కులే | కాని, యింకనేమి - గలదు ఫలము ;
కోరికొంటి నిన్ను - గుణవతివని యెంచి | యకట! యలఁచెదేల? - యబల! యనిన. 86

క. కడుఁగసలిగిమిట్టిమీనై । పడిపటుపటుఁబండ్లుగీటి - పడఁతుక, యోరీ !
జడదారీ! చెడుబుద్ధిన్ । విడువవుగద ; సుంతయును వి - వేకములేదే ? 87

సీ. నెఱసిజూరినయట్టి - నిడుదజౌజటలును - గోతఁగాఁగోఁచువి - భూతిపూఁత
శిథిలంపుచిఱునార - చీరకౌపీనంబు - నేహ్యంపుమోముమే - నెల్లవగులు
లొట్టచెక్కిళ్లును - లోవంపుపెనుగోళ్లు - రోహిమంబునువోలె - రోమరాజి
పొలలేకశుష్కించి - పోయినదేహంబు - తలవడంకునుమించు - దగ్గునలఁత

గీ. పెనుశివాక్షసరంబులుఁ - జీచుదాడి । కలిగిదుష్టపిశాచంబు - కరణినుండు
నిన్నుఁగూడిపెనంగువ - నితయుఁగలదె ? । ఛీ ! పలుకకుమివ్వీధినింకఁ-సిగ్గుచేటు. 88

క. సరివాఁడవొసరసుఁడవో । పరువో ప్రాయంబొ లేక - భాగ్యంబో
పరికింపఁగనీపైనే । మరులొందఁగఁగారణంబు - మసలకఁజెపుమా ! 89

క. తెలివిచెడినిష్ఫలంబగు । తలఁపుఁదలంచితివి, యోరి ! - తరమా ? నాతోఁ
గలయఁగ, నాకున్నీకును । గలయంతరమెన్నవలదె ? - కైకొనువేళన్. 90

క. పోపొమ్మిటనుండకుమని । కోపమునదిరస్కరించె - కోమలి, మునిసం
తాపంబునదీనుండై । యోపికచెడిడిల్లవోయి - యువిదంగనితాన్. 91

క. ఇదిరాజునియోగమెయౌ । మదవతి కాకున్నయిటుల - మాటాడునె ? యుం
చెదనెంచియువిడపైఁదన । మదివలపుంబాయలేక - మఱియిట్లనియెన్ 92

చ. కుమతియుదుశ్చరిత్రుఁడును - గ్రూరుఁడునైనభవద్విభుండు స
త్యముగనొసంగెభక్తినిను - నంచుఁదలంచితి, మోసపుంబ్రయ
త్నమునునెఱుంగనైతిఁగల - దా ? యిటువంటిదురాకృతంబిలన్
క్రమమునునక్రమంబును జ - గంబయెఱుంగునుగాకఁదప్పకన్. 93

ఆ. ఉండనిమ్మురాజు - కండక్రొవ్వడఁగింతు । నింతలోనఁజెడిన - దేమికలదు ?
కాని, యైనదయ్యెఁ - గరుణఁజూడుమటంచు । వానికౌఁగలింపఁ-బూనుటయును. 94

క. మించినకినుకంగని యిది । మంచిదిగాదోరి ! నీకు - మదమునినాతోఁ
పంచాస్త్రకేళిఁగలయఁగ । నెంచుటకర్హుఁడవె ? నీవు - హీనుఁడవుగదన్. 95

క. నాపతినినిందఁజేయుచుఁ । బాపాత్ముఁడ ! యింతపనికిఁ - బాల్పడితివిగా ?
తాపసుఁడవౌదువే ? నీ । కీపంతంబేల ? చెడక - యిఁకమనఁగలవే ? 96

క. పోతరమడఁగించెదనా । చేతంజిక్కితివితొలఁగఁ - జేసెదమరులున్
భీతిలకఁబట్టవచ్చెద । వీతఱినీపాటుఁజూడు - మేమగునొక్కో. 97

క. అనితానువెంటఁదెచ్చిన । సునిశితఖడ్గంబుఁగొని బ్ర - సూనాంగివచిం
చిననినునేఖండించెద । ననుటయుమునివరుని మోహ - మాగ్రహమయ్యెన్. 98

క. ఆరీతిఁగినిసిరౌద్రా । కారంబుననతివఁజూచి - కటములదరఁదాఁ
నీరీతిననిరెయొ, నోసీ ! । కూరిమిఁగైకొనవు మేము - కొఱయే ? నీకున్. 99

చ. వలచియనూనమోహమున - వాంఛనుఁదీర్పుమటన్న యివ్విధిన్
వలవనిమాటలాడెదవు - వాయికొలందినివారిపీరితోఁ
బలికినలాగునందగునె ? - భామినికింతటిగర్వమొప్పునే ?
తెలిపెదనాప్రభావమల - తిన్ విడరాదికనిన్ను నావుఁడున్. 100

ఉ. అమదిరాక్షి భీతిలక - యంత మహత్త్వముఁగల్గియున్న నీ
జేమియెనర్పనేత్రవామ - నీంద్రుఁడవేనియెనర్పుమంచును
ద్దామగతిందటాలునవి - తావితమానిగళంబుఁద్రుంచెనిం
కేమనిపల్కుఁడున్ ? నృవర ! - యెవ్వరిదిక్కిటమాకుఁగావఁగన్. 101

ఆ. వారివాదమెటిఁగి - వారించుటకునేను । బోవునంతలోనఁ - బోఁటియతని
జంపినన్ను లోనఁజననీకవచ్చినఁ । జావుసిద్ధమనుచు - సాటిచెప్పె. 102

వ. తటాలునకవాటంబుబంధించె. కావునలోపలంజొచ్చుటకువలనుగాక స్థైర్యంబు సాలక
దుఃఖాక్రాంతుఁడనైయిటనుండిమొఱఁబెట్టదొడంగితి. కార్యంబుమించిపోయినపిమ్మట
నేనరిగియుంజేయునది యొద్దియును లేదుగదా! 103

క. ఇంతదయలేకయివ్విధి । నెంతటిదుష్టులునుజేయ - నెంచరుధరణీ
కాంత ! మముబోంట్లఁజంపుట । సంతసమో పుణ్యమోయ - శంబోమీకున్. 104

క. దాతవుసధర్మజ్ఞుఁడవని । భూతలమునఁజాలఁబేరుఁ - బొందితివావి
ఖ్యాతితొలంగదె ? నీకుం । బాతకముసుటిల్లదే ? నృ - పాలా ! యనినన్. 105

గీ. అధిపుఁడామాటలాలించి - యాత్మవెఱచి । హరిహరీ! శివశివ! యని - కరయుగమునఁ
గర్ణములు మూసికొని యెంత - కార్యమయ్యె । నెంతమాటను వింటిని నిం - కేమిగలదు.

క. ఇంతటిపనిఁ గావించుట । కింతటిదుర్బుద్ధియతివ - కేలఁగలిగెనో
వింతగఁదోఁచెడినార! యి । దెంతయు సాహసముచేతు - లెట్లాడెనొకో. 107

క. అనిపలికి మానసంబున । ఘనమగుదుఃఖంబుఁజెంది - కడుదైన్యముతో
మునఁదోఁపగవటుకునిఁదా । గనుఁగొనికోపంబుబొదలఁ - గానిట్లనియెన్. 108

చ. గుణవతియనాసటంచుముని - కుంజరుఁడింతినిఁ గోరెనాఁగదా!
గుణవతి యంచునెంచిముని - కుంజరువాంఛనుఁ దీర్పనిచ్చితిన్
ఘృణయునుసద్ధర్మమున్ విడిచి - కీడనియెంచక భక్తిమానిమా
రణమొనరించెఁదాపసుని - రాత్రివేళఁదెగించి, మాయురే! 109

శా. పాతివ్రత్యము వీడకెల్లపుడునా - పల్కుల్విధానంబుగాఁ
ప్రీతిందావినిభక్తిపై మెలఁగుఁబ్ర - ఖ్యాతిన్ సాధ్వినాఁ జెందెవి
ఖ్యాతిన్, నమ్మితి, నిట్టిదా తెలుఁగన - న్యాయంబుగా విప్రుఁజేఁ
జేతంజంపి మహాఘమివ్విధమునం - జేకూర్చెనేఁడక్కటా! 110

ఆ. అహహ! యెంతక్రూర - మతివలహృదయంబు । వారిసాహసంబు - వారితలఁపు
తెలుఁగఁదరముకాదు - యెంతదుష్కార్యంబు । నైనఁజేయుదురుమ - హాప్రియమున.

ఉ. ఆశకుమేరలేదు, పను - లక్రమముల్ స్మృతియెక్కుడశ్మసం
కాశముమానసంబుపయి - గల్గదుమందునకైన సత్యమో
లేశముగా నివారియెడ - లేదుఖలంకను మాటసున్నయా
కాశముమీఁదఁ గూలినను - కాంతలుభీతినిఁ జెందరెప్పుడున్. 112

క. సుతుఁగోయించెనొకర్తుక । పతినింగిసురించివేష్కఁ - బరపురుషునితో
రతిఁకేళిఁగలిసెనొక్కతె । మతినొల్లక విభునివిడిచె - మగువయొకతెతాన్. 113

గీ. ఇంతులిటువంటివారౌట - నెఱిఁగియునుమ । నమునవిసెసాధ్వియగుశాస - నంబుమీఱి
నడువదనినేను మిక్కిలి - నమ్మియుంటి । లలనవిడదయ్యెఁ దనజాతి - లక్షణంబు. 114

క. అనికొంత వడివిచారం । బునుఁజెందుచు నుండిపిదప - భూసురపుత్రుం
డునుఁదనలోఁ రాఁజనియె । య్యానదలుపునుఁ దీయుమని ల - తాంగిన్బిలిచెన్. 115

క. పిలిచియటనిరుత్తరుఁడై । బలిమిఁగవాటంబునెడలఁ - బాపినరేంద్రుం
డలుకువమీఱఁగఁగేళీ । నిలయంబునుఁ జొచ్చియచట - నిబ్బరమొప్పన్. 116

సీ. ఎండివట్టులుగట్టి - యుండునెత్తురుచాఱ - లొప్పుఖడ్గముఁబూని - యున్నదాని
తానొనర్చినయకృ - త్యమునెంచి వెఱనొంది - నిలిచికన్నులనీరు - నించుదాని
సత్యంబెఱుంగక - జనులునన్నెంతనిం - దింతురోయనుచుఁజిం - తించుదాని
మునిసెప్పినసుధర్మ - మునుఁదలంపకఁబోతి - ననుచుఁబశ్చాత్తాప - మందుదాని
గీ. వెఱ్ఱిచందానమిక్కిలి - విభ్రమించి । సొంపుచెడి యట్టిదిక్కులు - సూచుదాని
నవలుమదిమించిగడగడ - వడఁకుదాని । దనఁతిని ఖండితుండైన - తపసిఁగాంచె. 117

మ. కనికోపాతిశయాన్వితాత్ముఁడునను - ద్గాఢోగ్రభీతావహా
ననుఁడున్నిష్కరుణావలోకనుఁడునై - నారీమణిన్డాయఁగాఁ
జనితద్భీకరలోకసంహరణ చి - చ్ఛక్తిప్రభూపంబుఁగ
న్గొనియాశ్చర్యముఁజెందియిట్లనుచు సం - కోచించియోజించెఁదాన్. 118

చ. విరియొకకేనియున్నలిగి - వీడఁగలేదు, ముఖంబునందుముం
గురులువికీర్ణతంబొరసి - కొండొకయైనసొంపుఁబాయతే

దరయఁ జెమర్పలేదు, సొగ - టుందఁగలేదు, వరాంగరాగముల్
గరఁగఁగలేదలంకృతినిఁ - గల్గదులోప మొకించుకేనియున్. 119

క. ఈలక్షణములు గాంచిన । చోలలనమునీంద్రుఁగూడి - సురతక్రీడం
దేలమి నిజమని తోఁచెడి । నాలంభముఁజేసె నొల్ల - దానిదితపసిన్. 120

ఆ. ఇష్టమొదవకున్న - నిష్టంబు లేదని । పలుకరాదె ? చంపఁ - బాడియగునె ?
తునిమినంతనతని-తోడు సుపాయునటంచుఁ । దనకుశుభమటంచుఁ-దలఁచెనొక్కొ ? 121

చ. పరమగుణాఢ్యుఁడీవటువు - పల్కినదంతయు సత్యమయ్యెయీ
తరుణివిధంబుఁగన్న విశ - దంబగు మాధునకైనఁగాని, య
ద్దిర ! కయిలాటకత్తెయిది - దీనిముఖంబునుఁ జూడరాదుయీ
గురణమెఱుంగనైతిఁ దడి - గుడ్డలగొంతులుగోతురంగసల్. 122

క. దిట్టతనంబునఁదనచేఁ । బట్టినపట్టంబు విడకఁ - బట్టిమునికిన్
పుట్టినరాక్షసియోయన । నిట్టనిలిచియున్నదెంత - నిశ్చలమహహా ! 123

క. ఇంతటికార్యముఁజేసిన । కాంతనుమన్నించుటెట్లు ? - కటకట ! వినినై
రింతురె ? లోకులు దీనిం । గాంతయనందగదు శక్తి - కాఁబోలు బళీ ! 124

చ. ఇలమలినాన్వితంబయిన - హేమముఁగైకొనిభర్మకారుఁడు
త్కాలికఁబుటంబుఁ బెట్టికడుఁ - గాంతినొందఁగఁజేసినట్లుయీ
కలుషమతిన్ వధించితల - కొన్నయరిష్టమడంచియింక మ
త్కులమకలంకమై వెలయు - కోపుఁదలంచుటయుక్తమెన్నఁగన్. 125

క. అనివిజయాశ్వమహీపతి । యనుపమకోపోగ్రలక్షు - ణాననుఁడై యో
జనసేయుచుండు సమయం । బునమునివర్యుం దలంచి - పొరిఁబేర్కొనితాన్. 126

క. మునిశిష్యుఁడుకడుదుఃఖం । బున నిల్వఁగలేక నేలఁ - బొరలుచు నయయో
వనజాసనసన్నిభ ! మీ । కొనరునె ? దుర్మరణమివట - నొకభామినిచేన్. 127

క. ఇవ్విధమున నడురేయిని । జన్వనిచేఁ జావుమనుచు - జతురాస్యుఁడుతా
నెవ్వగ వ్రాసెనొ జచ్చితి । రెవ్వరు ధర్మంబధర్మ - మెఱిఁగెడివారల్. 128

చ. పలుకరదేమి ? నన్నిపుడు - బాయని సత్కృపనాదరింపఁగాఁ
దలఁపరదేమి ? మీనుడువుఁ - దప్పక జెప్పినయట్టికార్యముల్
సలుపఁగలేదో ? మీయెడలఁ - జాలఁగభక్తిఁ జరింపలేదో ? హా !
తెలుపఁగరాదె ? యట్లయిన - తేటపడంగ మునీంద్రశేఖరా ! 129

ఉ. భామినులన్నచో విరస - భావము నంగడుఁ గంటగించుమీ
కేమగిరాక్షి పైవలప - డేటికిఁ గల్గెనో కానరాదుని

ష్కామములుమీరు నేఁడుపర - కాంతనుఁగోరినదోషమివ్విధిన్
సోముదొలంచిచం పెనోయ - జుండిటుమీనుడుటన్ లిఖించెనో. 130

ఉ. వేడుకమీఱఁగా యనుభ - వింపఁగగోరినదైన యిట్లుయీ
చేడియనిర్దయందోడరి - చెందునె? మిమ్ముసధింపఁజేతులె
ట్లాడెనో కానినేఁదలఁచి - నంతనెగుండెలు తల్లడిల్లెడిన్
వీడనిచింతనిట్లుపల - వింపఁగమాన్పగదయ్యా! ధీమణీ! 131

శా. ఓసుజ్ఞానవిశారదా! గుణనిధీ! - యోసత్కృపాధ్యాగ్రణీ
వ్యాసక్తవ్రత! యోమునీశ్వరసమా - హస్తుత్య! నేనుగ్రుఁడన్
మీసేవాప్రియ మానసుండనెపుడున్ - మీశిష్యుఁడన్ సత్కృపన్
నాసంతాపముమంపవే వలదుదై - న్యంబంచు నూరాగ్నవే. 132

క. ఎక్కడ మరణంబాశ్రమ | మెక్కడ? తప మెంగుఁబోయె? - నిపుడుమహాత్మా!
దిక్కెవ్వరింకనాకున్ | మిక్కిలి మిమునమ్మియుంటి - మీ రవ్వనుబలెన్. 133

క. ననునుగ్రా! యిటురమ్మని | చనవునఁ జెంగటికిఁబిలిచి - సద్విషయంబుల్
గనికరమునబోధించెడి | ఘనులెవ్వారింకఁగలరు? - కలుషవిదూరా! 134

సీ. అరుణోదయంబయ్యె - నదెచూడుఁడా! స్నాన - మునకుఁబోదముగండు - మునివరేణ్యా!
యాహ్నికంబున కర్హ - మైనట్టివస్తువు - ల్గలవొలేవో మంచి- తెలుపుఁడయ్యా!
తేటగానిన్నబో - ధించినపాఠంబు - నప్పగింపుమటంచు - నడుగ రేమి?
సతతంబుహరినామ - సంస్మరణంబుఁగా - వింపుడురిపుడేల - విడువనల సు?

గీ. మీరుకావించుపూజలు - మీజపంబు | మీమహాభక్తినిష్ఠయు - మీతపంబు
నెటులమఱచితిరయ్యా! యహా - హించినేను | చేయఁగావలసినను - జెప్పరాగ? 135

గీ. తరుణికిష్టంబులేకున్న - తగదుపొమ్మ | టనుచువచియింపఁగూడదె? యనఘశీల!
తెంపునకుఁజొచ్చి మిమ్ముఁదాఁ - జంపనేల? | తలఁపఁదనకేమిలాభంబు - గలిగెనిపుడు

శా. ఏలావచ్చితి మీపురంబునకు మీ - రీకాంతనిమ్మంచునేఁ
డేలావేఁడితిరయ్యా! మోహమునభూ - మీశున్ కటా! కెపటం
చాలోచింపక; హానివృద్ధులనుము - న్నాత్మన్ విచారింపరా
దే? లోకస్థితిమీరెఱుంగరె? మహా - ధీమంతులై యుండియున్. 137

క. మిమ్మెల్లననినయపుడే | పొమ్మనఁగా రాదెలేని - పోనికువాదం
బమ్మెయినొనర్పదగునో? | కొమ్మలతోమించిపలుకఁ - గూడునె? తండ్రీ! 138

మ. పరులందిట్టఁగలేదు లగ్గనిరొయిన - ద్రవ్యన్ లేదుదుపార్క్యమముల్
పరిహాసంబుగఁ బల్కలేదొరులదు - ర్వ్యానంబుతోఁబూనిరెు

ప్వరిసొమ్ముఁగ్ హరియింపలేదుగద; కో - పంబేల? చేకొన్న మీ
దరితింజెంతికురమ్మటన్న యదితి - ప్పయ్యోక్ వధించెక్ మిముక్. 139

క. మిమువిడిచియెచటికేగుదు? । బ్రమదంబున నిరుపురమును - వచ్చితిమిపుడే
నమరలియొకఁడం బోవుట । కుమనసురాదయ్యోమూని - కుంజర! లెండా ! 140

క. అనిపనవిపన వివనితం । గనిమసలెడి నూనెమీఁదఁ - గంకణములఁ జి
ల్కినభంగిన్నై యతఁడు తగ । దని యెంచక దూఱఁదొడఁగె - నతికోపమునన్. 141

గీ. అతనిదుఃఖంబుఁగని - విజయాశ్వనృపతి । జాలివడినిజపత్ని వైఁ - జాలఁగినిసి
పండ్లు గీటుచుఁ దారుణ - భాషణములఁ । దర్జనముఁజేసి యిట్లనుఁ - దలఁకుగదుర. 142

ఆ. ఓసి ! దుష్టురాల ! యీసంయమీశ్వరుం । డేమికీ డొనర్చె - నిపుడునీకు
పాపభీతిమాని - పావనమానసుఁ । గరుణలేకఁ జంపఁ - గానదేల ? 143

క. నాయాజ్ఞ మించి మెలఁగం । గా యోగ్యంబగునె ? యెంతఁ - గావించితివే
మాయలమారీ ! యెవ్విధిఁ । జేయాడెను ? నీకు మాని - శిరమును దునుముక్. 144

క. నినునితని కొసఁగుకాలం । బుననాయెడ వోలెభావ - మును దెలిసినయం
బున మెలఁగుచుండుమని చె । ప్పనె ? నామాటలను మఱవఁ-బాడియె ? నీకున్. 145

క. పతికపయశముంగూర్చెడి । సతియుండిన నేమిఫలము ? - సర్వవిధములన్
సతిగాదది శత్రువుబో । పతికిందగదట్టిదాని - పైఁబ్రియమిడఁగన్. 146

క. అనిగద్దించి విభుండడి । గినభయమునఁ జేతివాలుఁ - గ్రిందవయిచియా
వనితామణి యపుడెంతయు । వినయంబున నిట్టులనియె - వివరముగాఁగన్. 147

ఉ. నేనుమునిన్ వధించినది - నిక్కముపల్లభ ! యైన యొక్కసుం
తేనియులేదు నాయెడల - నిందునఁ నేరము; యావనాకృతిన్
బూనుదుఁజంపుమంచునను - బూన్చెమునీంద్రుఁడి దేటిమాటయి
ట్లేనొనరింపలేనవిన - యేలభయంబు వధింపుమీననుక్. 148

గీ. నేపునర్జి వినగుదును - నిశ్చయంబు । ముదిమితోలఁగును పిమ్మట - ముదముమీఱ
ననయమును నిన్నుఁగూడి పెం- పొనఁగనుభ । వింతుసౌఖ్యంబునవియెనే-వినకయున్న.

గీ. ఎంత సెప్పిన వినక యి-ట్లిపుడునీవు । సలుపకుండిన శపియింతుఁ - జత్తుఁబిదప
ననిశపింపక ఖండించు-కొనఁగఁబూనెఁ । దనకుఁదానగిగనిదిగు - గ్లానిమనమున. 150

క. ఈమునియాజ్ఞను మీఱిన । నేమగునో సేయుటొప్పు - నెదియైననగున్
భూమీశుడితని మాటల । కేమాత్రమునడ్డువలుక - కిపుడునుననియెన్. 151

వ. ఎట్లునునితఁడుఖండించుకొనుటకు సిద్ధపడియున్నవాఁడు చెప్పినభంగిఁ బ్రవర్తింపని నేరంబుఁ బైఁదెచ్చుకొననేల ? యనిచింతించి పరమేశ్వరునిమనంబునధ్యానించియిట్టికేలకుధైర్యంబునవలంబించి ఖండించితి. 152

క. ఘాతుకురాలనటంచు౯ । బాతకురాలననుచు మది - భావించిమనః
ప్రీతిగనికపైమీరే । రీతినొనర్చినను సంహ - రించినపగవ౯. 153

క. ఇదిసత్యమనిన యుగ్రుం । డదివిని యదలించి, కల్ల - లాడకుమిదిన
మ్మురురా? లోకులు తనకు౯ । మదిమితోలఁగుఁ జావుమనెడి - మూర్ఖుండున్నె? 154

ఉ. నెప్పరివాదువార! యిది - నిక్కమె? తన్నువధింపు మంచుఁదాఁ
జెప్పెనె? బాసచేయుము? కు - శీల! మముంగికురింపఁబూనినీ
విప్పటికిప్విధిం బలుక - నిచ్చదలంచితివొక్కొ? నీవు నీ
తప్పునదేలఁదెల్పెదవు? - దైవమెఱుంగు నిజంబుఁగల్లయు౯. 155

క. ఇతఁడు నినువేఁడుటయునీ । వితనినినిరసించితెగడి - యెట్లాడినయు
ద్ధృతి యుతుఁ బిమ్మటనడిచిర! గతియును నాకెఱుక లేదె? - గట్టిగఁజెపుమా! 156

గీ. ఎంతవేఁడిననీవిచ్చ - యింపకున్న । మునినయుంజేరి మొఱఁబెట్టు - కొనఁగలేదె?
యబ్బయుండంగతిఘిఁబెట్టె - నతనికనిన । భంగిఁబలికెద వెతిఁగిన - వానియెదుట. 157

క. నీవిభునకిపుడునమ్మికఁ । గావింపఁగఁ దలఁచిపలుకఁ - గానెంచిననీ
వేవిధమునననినునను । మీవిపరీతంపుమాట - లేవిననొల్ల౯. 158

గీ. ఆవులించినయంతనె - ప్రేవులెంచు । వాఁడుభూపతియెఱుఁగని - వాఁడుగాఁడు
నీవువేయుచిరచించిన - నిజముకల్లఁ । దెలిసికొననేర్చుఁ జెప్పుము - నలసినట్లు. 159

ఆ. కడఁగియింతనేర్పుగా బొంకలేనివా । రెటులసాహసింతు - రింతపనికి
ధూర్తవీవునిన్నుఁ - దొడరిమాటాడరా । దనిరెు నతనిపలుకు - లాలకించి. 160

మ. జగతీనాథుఁడు వారిభాషణముల౯ - సందర్భముం దామదిం
దగయోజించి, కుశీలగాదలినదే - తత్పూర్వమీబ్రహ్మచా
రిగురుం దేరకఁ దూఱినాఁడననిదు - ర్వృత్తాంతముం జెప్పెఁద
ప్పుగుమాటల్వచియించు నీతఁడెపుడు౯ - వ్యాక్యంబుఁబుట్టించెడి౯. 161

చ. అపుడటువల్కనాటయిపు - డవ్విధిసేవచియించునంటకుం
దపసివధింపఁగాఁబడియెఁ - దానువధించితినం చుఁజెప్పెని
క్కపు తెఱఁగీపెగాననిది - కల్లయనంజనదౌర! కాంతతాఁ
గృపవిడిచంపుమంచుముని - గేలికిఁజెప్పినఁజంపఁబాడియే. 162

క. మునియాజ్ఞనుమీఱఁగరా । దనిచెప్పిన, యంతెచాలు - ననిమానింజం
పెనుయోగ్యాయోగ్యక్రియ । లనుఁదెలిసియొనర్పఁగావ - లయుననకధృతి౯. 163

క. శాపునపావనుఁడగుభూ । దేవునిసాహసముతో వ - ధించిననేగం
బీవెలఁదియెడలఁగలదిఁక । నేవిధిజంపినసుపాప - మేగద; తలఁచు౯. 164

వ. అనితలంచి యాచంచలాక్షి యొనరించిన దుష్కృత్యంబునకాగ్రహంబు వహించి యాతండు.

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్షణమహా - క్రూరాననాస్యుండును
త్కటకోపజ్వలనస్ఫులింగజనితో - ద్యద్భీకరాక్షుండునై
చటులానేకపతుండసన్నిభకర - స్ఫద్వచ్ఛశాతాసివి
స్ఫుటరోచుల్ మిఱుమిట్లు గొల్పనపుడ - స్తోకప్రతాపంబునన్. 166

ఆ. నీతిలేనిదాన! - నిర్భాగ్యురాల! హా! | స్వామునకితఁడుజంపు - మలినఁబోదరి
చంపఁజను నె? నిన్నుఁ - జంపినఁగాని యీ | దోషమెందుఁబగిదిఁ-దొలఁగదిపుడు. 167

క. పెదవులఁదడిపెదవేలా? | బెదరునఁబరువిడిన నెంత - వేఁడినవిడఁజం
పుదునను టయునుగ్రుండా | మదవతిపైనలుకమించి - మహీపతిఁగనితాన్. 168

చ. విడువకుమయ్య! దీనిఁబల - వించిన వేఁడిన శంకమానిచ
క్కడఁపుములోకమందుభవ - దన్వయమెంతయునిర్మలంబగున్
గడునిదిమాయలాఁడిదయ - గల్గువిధిన్ నటియించుచీనమై
యొడికమెఱింగివల్కెనన్న - తోదరినామముదీనికిందగున్. 169

ఆ. నిరపరాధియౌము - నిన్ వధించినయట్టి | దోసకారివిడిచి - దూఱుఁ జెందఁ
జనదుచనదునీకు - చంపి పతిక్కీర్తినిఁ | గాచికొనుముభూప! - కరుణవలదు. 170

క. ఫణినడఁచియనర్ఘంబగు | మణిఁగైకొనుభంగిఁగపట - మానసయును దు
ర్గుణకలితయునగుదీనిం | దృణముంబలెనెంచితునిమి - తృప్తింగొనుమా. 171

క. అనిబోధించిననానని | మనుజేశుఁడుపత్నిమీఁది - మమతనువిడిచ
య్యానచంద్రహాసమనియెడు | తనకైదువునెత్తివ్రేయఁ - దమకించుటయున్. 172

క. వ్రేయుమువ్రేయుముభూవర! పోయెంబోయెంబొలంగి - పోయెంబోయెన్
జాయయనితలఁపకుమునీ | శ్రేయంబుంగోరియిటులఁ - జెప్పెదఁజుమ్మీ! 173

చ. తటుకుననెందునేనిఁజని - దాఁగినయీనిసివేళనిట్టిచీఁ
కటితటిదీనిఁగన్గొనుట - కష్టముకార్యముఁదప్పిపోవునం
తటనెటుసేయునోమిగుల - దండనకర్త్రియ, నేనువోయివా
కిటఁజననీకనిల్చియిరు - గేళ్లనునడ్డిదసీవుద్రుంపుమా! 174

క. అనిపలికియుగ్రుఁడొయ్యనఁ | గనుమొఱఁగెన్ మానితనుపుఁ - గరవాలంబున్
గనిపింపదయ్యెవిడువకు | వనితనువధియింపుమనుచు - వచువినఁబడియెన్. 175

ఆ. అటులమాయమైన - యాచిత్రమెఱుఁగక | ధర్మచరితుఁడైన - ధరణివిభుఁడు
వింతనొందియట్టి - కొంతసేపరసితా | నింతిఁదునుముమరల - నెత్తెవాలు. 176

క. ఎత్తియుపుడించుకేనియుఁ । జిత్తంబునసంశయంబుఁ - జెందకధర్మా
యత్తమతినైనధించెద । నిత్తఱిసీనటించుచుఁబూనె - నేయుటకంతన్. 177

క. వలదువలదుడుగుముడుగుము । కలికియెడన్ లేదుతప్పు - ఖండింపంగాఁ
దలఁపకుముమానవేశ్వర! । చలమునజాయన్ వధింపఁ - జనునే? నీకున్. 178

క. అనియెత్తిననిజకరమున్ । ఘనబలుఁడొక్కండుగట్టి-గాఁబట్టినఁగా
గునఁదోఁచిననివ్వెఱపడి । జననాధుఁడునిలిచి నలుదె - శలఁగనుచుండన్. 179

క. దిగ్గనకొక్కమహాప్రభ । దృగ్గోచరమయ్యెనాస - తీపతులకుఁదా
నిగ్గులుగలిగెననివా । రగ్గలముగసంభ్రమించి - రాసమయమునన్. 180

సీ. ఇంద్రనీలంబుల - కెనయైననెమ్మేని - కాంతులుమించిన - ల్గడలఁబర్వ
సుందరవదనార - విందంబుమందహా - సస్ఫూర్తినెంతయు - జానుమీఱ
జలదంబునందలి - చంచలాలతవోలె - దంబైసరుక్మచే - లంబుమెఱయ
సదమలమణిగణ - స్థగితవిభూషణ - స్తోమంబుమిక్కిలి - శోభిలంగ

గీ. శంకచక్రద్వయంబు హ - స్తములవెలయ । నమరఖగవాహనారూఢుఁ - డైరమాస
హితముగావారిరక్షింప - నెంచియపుడు । కంజనాభుండునెరిసా-క్షాత్కరించె. 181

క. శారదనీరదరాజ్జ । క్షీరమరాళోగ్రితుల్యా - సితదేహాంశా
నారదుఁడునుఁబొడసూపెన్ । శ్రీరమణున్ దనమదిన్ స్మ - రింపుచునచటన్. 182

వ. అటులజగదీశ్వరుండైన రమానాథుండుప్రత్యక్షుంబగుటయు,నఖండమార్తాండకోటిప్రభా మండితతనుండును, పుండరీకదళలోచనుండును, సుందరతరేందుగరళతానందపురం దరాదిబృందారకబృందవందిత పాదారవిందయుగళుండును,దుష్టజననిగళుండును,నకలంక నిరుపమమణిగణనికరసంఘటితానర్ఘవిభూషణభూషితాంగుఁడును, సజ్జనసంగుండును, భాసురమందహాసకలితవిలాసపరిపూర్ణకోమలవదనుండును,సద్గుణసదనుండును, సకలభువన సంరక్షణదీక్షాసత్సంకల్ప ప్రమోదనిరంతరహృదయుండును, నిత్యోదయుండును, భక్త పోషుండును,ముక్తదోషుండును,దీనపాలుండును,గానలోలుండును, పరమశాంతుండును, విరహితాంతుండును,నగునప్పరమేశ్వరు, వేదవేద్యు, నిందిరేశు,భుజంగతల్పు,నాదిమధ్యాం తరహితుఁ, జిదానందస్వరూపుం, గాంచితదీయశుభలక్షణంబులవలన వైకుంఠుండని యెఱింగి,పులకితగాత్రుండైవిజయాశ్వనరేశ్వరుండు భార్యాసహితుండై సాష్టాంగదండ ప్రణామంబులాచరించి భయభక్తివినయంబులు ముప్పిరిఁగొన, కరంబులుముకుళించి యిట్లనిస్తుతించె. 183

## దండకము.

శ్రీమత్పయఃకంధిజాహృత్సరోజాతసంచారమత్తద్విరేఫం, లసత్సుస్వరూపం, సుగ జ్యేష్ఠముఖ్యామరశ్రేష్ఠసంస్తూయమానప్రసిద్ధప్రభావం,మహోనుస్వభావం,గిరిద్విట్ద్విషత్కుం

బోద్ఘాటనాటోపగంభీరపంచాస్యవర్యం,మహాశౌర్యధుర్యం,సర్వసర్వంసహాభారనిర్వా
గ సంకల్పసంసక్తచిత్తం, సుఖాధారవృత్తం, ముముక్షుప్రియస్వాంత సంయుక్త
ససందోహవాంఛాప్తిమూలం, నవస్వర్ణచేలం, విపన్నవ్రజక్లేశదూరీకృతాయోగ
విద్ధప్రమోదం-వినిర్మూలఖేదం-బలివ్యాసగాంగేయభీభత్సదాల్భ్యాదిసద్భక్తజాలా
దాబ్జద్వయం, భవ్యతేజోమయం, నిర్మలానర్ఘసద్రత్నసంకల్పితానూనశోభాభిరా
ంఠహారం, సుధీహృద్విహారం,జగత్సృష్టిసంరక్షణధ్వంసకార్యత్రయాత్తీణ పూర్ణ
ధికారం, యశోదాకుమారం,గదాశార్ఙ్గనిస్త్రింశచక్రాబ్జముఖ్యాయుధోపేతరక్తార
హనప్రభానవ్యహస్తం,త్రిలోకప్రశస్తం,దయాసంయుతాపాంగసద్వీక్షణాసాదనా
తూహలాయత్తసాధుప్రితానం,పవిత్రాభిధానం, మునిస్తోమపోషం, సమస్తంసు
దానందతత్త్వం, విదీర్ణారిసత్త్వం, శుభాధారవక్షం,విభుం దైత్యశిక్షం,గతాఖిలతాపం
ప్రతాపం,ప్రబుద్ధం ప్రసిద్ధం,నిరీహం, నిరంతం, ప్రశాంతం, మదీయేష్టసంధాయకం,
భావయామ్యచ్యుతంత్వంప్రభోపాహిమాంపాహిసర్వేశ్వరా నిర్వికారా నమస్తేస్తు
మః. 184

జయ నగధీర - సకలలోకాధార - పాకారనుతమిత్ర - పద్మనేత్ర
జయబుధపాల - శత్రుదానవకాల - సన్నుతదరహాస - సత్యవాస
జయనిర్మోహ - జలదసన్నిభదేహ - హర్యక్షగంభీర - హతవికార
జయశివబాణ - శరణాగతత్రాణ - రవికోటిభాసదు - ర్జననిరాస

జయహరీసదానంద - జయముకుంద । జయజయ రమామనఃకాంత - జయయనంత
జయపరేశయక్షర - జయసుచరిత । జయజయ జనార్దనామూరి - జనకధీర. 185

నభక్తపోషమధు - భంజనపాపహరా నమోస్తుతే
భవారిమిత్రభవ - బంధవిదారసదానమోస్తుతే
మూహసేవ్యవను - దేవకుమారసుఖీనమోస్తుతే
రజంగమాదిసము - దాయభరానదానమోస్తుతే. 186

ముచుకుందావన । మందరధరసుందరాంగ - మంజులభాషా
దారకసందోహ । నందప్రదరహితకోప - నయగుణరూపా. 187

మణీయధామతుల - నీడశహారియుకేంద్రగోపికా
మురాదిదైత్యహర - సత్త్వరజస్తమరూపఘోరసం
మహార్ణవోత్తరణ - సర్వసమానశుభప్రదానమ
రమునీకునిందిరకు - గామితదాయక లోకనాయకా. 188

రగడ.

వందనమురారీ - వరదముకుందా । సుందరవేషా - సుజనానందా
దామోదరగుణ - ధామసుశీలా । క్షేమంకరల - త్కృపాల్లోలా
లోకేశార్చిత - లోకాతీతా । వైకుంఠాధిప - వైరివిజేతా
నీరజనాభమ - నిస్తుతపాదా । కౌరవకులహర - కంసచ్ఛేదా
సింధుగభీరవి - జితషడ్వర్గా । సింధురపోషా - శ్రితసంసర్గా
మణిమకుటాస - న్మానితకుబ్జా । ఫణితల్పశుభ - ప్రదహస్తాబ్జా
మధురాపురచర - మారాకారా । విధుహరిలోచన - విశ్వాధారా
నిత్యధరాధర - నీళాకాంతా । సత్యాప్రియని - ష్కామప్రశాంతా
పురుషోత్తమనర - పోషపవిత్రా । స్థిరవైభవవం - దితసుచరిత్రా
బలివిధ్వంసక - భాస్కరతేజా । బలభద్రానుజ భక్తసమాజా
ధర్మవివర్ధన - తత్వాధారా । నిర్మలకరుణా - న్వితసుకుమారా
గరుడధ్వజసం - కటహరశౌరీ । పురుషోత్తయజ - భూధరధారీ
అక్రూరాశ్రయ - యజ్ఞోద్ధారా । నక్రవిఖండన - నందకుమారా
మంజులదేహా - మాయాతత్వా । కుంజరభంజన - గురుతరసత్వా
సృష్టిస్థితిలయ - చిత్రోద్యోగా । దుష్టభయంకర - దుఃఖత్యాగా
నిను నెరనమ్మితి నిగమవిహారా - ననుఁగృపఁగనుమా - నందవిచారా
మొక్కెదనీపద - ములకసమానా । దిక్కని నేవిను - తింతుననూనా
జయజయజయజయ - జయసద్భావా । జయజయజయజయ - జయజయ దేవా. 189

ఉ. క్షీరసముద్రవాసబుధ - జీవనజీవనజారిహస్తదే
వారికుమారపాల పర - మాత్మచరాచరవర్గరక్షకా
భూరివివేకధామసుర - భూసురపూజితపాదయోగిమం
దారయుదారభావసుకృ - తప్రదకావుమునన్ను మాధవా ! 190

ఉ. దీనుఁడమూఢుఁడన్ ఖలుఁడ - దేవగణాశ్రియయోగ్యమైసదా
మానులుఁ భక్తిమైనిగమ - మంత్రములందగఁబూజసేయు నీ
జ్ఞానదభవ్యరూపమునుఁ - గాంచికృతార్థుఁడనైతిసత్కృపన్
బూనిసముద్ధరింపుమహి - భుగ్వరవాహసలోకమోహనా ! 191

చ. సనకసనందనప్రముఖ - సంయములైననునాత్మయోగసా
ధనములఁబూనినిత్యమును - తత్వవివేచనఁజేసికానఁ జా
లనిభవదంఘ్రిలక్ష గను ఫ - లంబుఘటిల్లెనునన్నువంటి య
ల్పునకిదిపూర్వజన్మకృత - పుణ్యమటంచుఁదలంతునచ్యుతా ! 192

మ. తొలఁగెన్ దోషము లెల్ల నేఁడు కడుసం - తోషంబు వాటిల్లె సా
కులముల్ బావనమయ్యెఁ జింతలడఁగెం - గోర్కుల్ఫలించెన్ శుభం
బులు చేకూఱెఁ గొఱంత లేదిఁక భవ - త్పుణ్యస్వరూపంబుఁ గ
న్నులఁ జూడంగ నెసర్వముం బొసఁగె ధ - న్యుండన్ గడున్ నేనిలన్. 193

క. శరణాగతావనా నిను । శరణంటింగావుమంటి - సమయంబంటిన్
కరుణాకర భవసాగర । తరణా నుజనార్తిహరణ - ధర్మాచరణా. 194

నిరోష్ఠ్యకందము.

క. సురరాజరక్షకాసా । గరతనయాహృదయకలజ - కంజహితాకం
ధరనీలదేహ కరుణా । కరనారాయణ యనంత - ఖలహాగణహారీ ! 195

చతుర్విధకందము.

క. చింతావిదూరభవ్య । స్వాంతావరచేలదురిత - సాగరతరణా !
కాంతేయసౌఖ్యదాయక । శాంతాకరిపాలయోగి - సన్నుతచరణా ! 196

గోమూత్రికాబంధము.

క. భూనుతహారసఖయనిభా । జ్ఞానదధర్మజవిజయవ - శంవదకృష్ణా !
ధీనుకహాగసదయశుభా । ధ్యానగధరజయజయావ - హావరకృత్యా ! 197

నాగబంధము.

చ. రవిసమతేజపావనధ - రాధరనిస్తులకుంతవాహమా
నవసురజాలసేవితసు - నాథనవర్ణజయాంకమానివై
భవనుతకాశలావనజ - భంజన నిర్మలనామదేవకీ
భవసకలేశదేవకుల - పాలమహాత్మ ఎశవీరధనిధీ ! 198

ద్వ్యక్షరకందము.

క. నిను నెమ్మనమున నమ్మిన । ననునోమము నెమ్మినీమ - ననమును నేమా
ననుమా ననమా మిమనో । నమ్మనమన్న ననిమ్ము నిమ్ము - నానానామా ! 199

మ. భవదీయప్రకట ప్రభావనుగుణ - ప్రజ్ఞావిశేషంబు లా
దివిజశ్రేష్ఠునకైనియుం దెలియఁగాఁ - దెల్పంగరాదండ్రు మా
నవమాత్రుండ నెఱుంగనా కుదరమే ? - నాళీకపత్రాక్ష ! నే
నవివేకింగడుఁదోఁచినట్లిపుడు ని - న్నాసక్తి వర్ణించితిన్. 200

ఉ. ధారుణి నెండ వేఁడిమికిఁ - దాసయిరించి మహీరుహంబు వి
స్ఫారము దానహంబయిన - ఛాయను మర్త్యుల కిచ్చునట్లు నీ

వారలు నొందుకష్టములు - వావిరి నీవవహించి వారి నొ
ప్పారఁగఁబ్రోతు వెల్లపుడుఁ - నాదట సౌఖ్యములిచ్చిభూధరా ! 201

చ. అని విజయాశ్వభూపతి ర - థాంగధరుఁ భయభక్తులేగ్వడఁ
వినుతిరొనర్చుచున్నఁగని - విశ్వమయుండు ముదంబుఁజెంది యి
ట్లనిరొగభీరభాషల; జ - నాధిపనీవసమాన ధర్మవ
ర్తనుఁడవు జాలమెచ్చితి ధ - రఁ మఱిలేరు నృపుల్భవాదృశుల్. 202

క. ఘనుఁడవు నీవివ్విధిఁ బ । త్నినిజంపఁగఁ బూనఁజనునె ? - తెలుపుము ? మదియో
జనఁజేయకట్టికార్యం । బు నొనర్పగరాదటంచు - బుధులనవినవే ? 203

గీ. అనుచు పల్కనిరుత్తరం - బైయతండు । విన్నవై నిల్చి భక్తిమైఁ - దన్నుఁజూచు
చున్నఁగనినవ్వి, వెఱచకు - మోనృపాల । లేదు నీదోషమింతొక - లేశమేని. 204

ఉ. పూర్వభవంబునఁ వినుము - పుణ్యాజనేశ్వరుపట్టి వీవుయీ
పర్వసుధాకరాస్యనిను - బాయఁగఁ జాలనిరంభనుమ్మ ! మీ
రిర్వరు మా [illegible] శాపమున - నివ్విధి బుట్టితి రయ్యజంబుమి
మ్మర్వినిఁగూర్చెఁ జాలఁబియ - మొప్పసతీపతులై మెలంగఁగఁ. 205

వ. మున్ను మునీంద్రుండు మిమ్ముశపించుకాలంబునఁ ద్రిమూర్తులకుఁదక్కఁదక్కఁ సవారికి మీచరిత్రంబొకింతయుం దెలియకుండఁగలదనియు, మీకుమదీయదర్శనంబు సంప్రాప్తించుననియుం జెప్పియున్నకతంబునఁ బ్రత్యక్షంబయితి మీవృత్తాంతం బెఱుంగఁజాలమిచే నారదుండుసామాన్యమానవులనుగాఁదలంచి నాతోడ మిమ్ముపర్కించియుగ్గడించె, నది నేనెఱింగియుండియుఁ దెలియనివానివలెయాకర్ణించి, యొకవినోదనాటకముంగల్పించి మీసత్యశీలంబులు లోకంబున సుస్థిరమైనిలుచునట్లు సేయనెంచి యిన్ని విచిత్రకార్యంబు లొనరించితి. ఇంకమీకెట్టియాపదలును బొసంగనేరవు. అని పూర్వజన్మవృత్తాంతం బాదిగా సర్వవిషయములుం జెప్పిన వినియాశ్చర్యంబుఁ జెందుచున్న విజయాశ్వునకును, నారదునకునుఁ దక్కనవారికిని ముకుందుఁడు స్వకీయ మాయంగవియించిన దత్క్షణంబునవారలు పామరత్వంబువహించిరంత సర్వజ్ఞుండైన జనార్దనుండు విజయాశ్వునిం జూచి మరల నిట్లనియె. 206

శా. నీసత్యంబును ధర్మబుద్ధిగుణముల్ - నీయీవినీస్థైర్యము
ల్లాసంబొప్పఁగఁగాంచి మేలొసఁగవా - లాయంబుభావించినే
నాసక్తిఁ భవదంగనఁ సిరులమా - యాపన్నినైవేఁడినీ
చేసర్వంబునుఁ గొంటినారదుఁడునా - శిష్యుండుగానుండెతాఁ. 207

క. ధనదారాగేహాదులఁ । గనికరమును మానియడిగి - కైకొన్నమహా
మునివరుఁడనేనయుగ్రుం । డనునతఁడీనారదుఁడన - రాధిపవింటే! 208

శా. ఆరీతిన్ సకలంబునీవలననే - నర్థించియార్జించియీ
సారంగాక్షినలంచి తద్గుణములన్ - శాంతంబుసంకల్పమున్
తీరన్నీతియు సత్ప్రవర్తనముఁబా - తివ్రత్యముంగాంచఁగా
నారూఢిందలపోసి పోయినృపుప - ర్యంకంబుపైఁజేరితిన్. 209

ఉ. మానినిభక్తిమీఱనను - మాన మొకించుకయైనలేకస
మ్మానమెలర్పఁగాశయన - మందిగమున్ వడిజేరిశయ్యపై
దానుపవిష్టయైమదన - తంత్రములం బొనరింపనెంచెనే
నానియమంబెఱింగినను - నంటకుమీ! యనియానఁబెట్టితిన్. 210

గీ. అపుడు నాయానకీగజ - యానవెఱచి। యట్టెనిలిచినమాయాసి - నతిపకొసఁగి
చంపుమీనన్నుదీనితో - జగతొలంగు। యౌవనమునొందిజీవింతు - నంచనంటి. 211

ఉ. కోమలియాదురుక్తివిని - కొంకునఁద త్తఱ పాటుమీఱఁగా
పేరనుఁదలంకిదుఃఖమునఁ - బెక్కువిధంబుల 'దుష్కృతంబువే
నేమనిసేతు? మీయెడల - నెంతయుఁగూర్మి మెలంగెదన్ మహా
త్మా! మదిలోనమీముదిమి - మాటఁదలంపను సర్వమింతయున్. 212

క. ముదిసినవారైనను నే। యదివదయును లేదునేబి - యంబొందితియీ
కొదుకేల? మానుఁ, డనియెన్। బెదరించితపింతునంటేఁ - బిమ్మటనతివన్. 213

గీ. ఎంతబెదరించిననుఁజంప - నిచ్చలేక। యున్నఁగనినేను సౌఖ్యంబు - నొందుటరయఁ
జాలనైతివినను నేన - చంపుకొనెదఁ। గలుగునీకీడునీకని - ఖడ్గమొడిసి. 214

క. కొనిగొంతుకనేనేది। గ్గనసంగనసూచుచుండఁ - గోసికొనంబూ
నినభీతిలిమాన్చినా। యనుమతిఁదామీఱలేక - యడలుచుఁదునిమెన్. 215

వ. పిమ్మట యుగ్రిండువాపొవుటయు, నార్తధ్వనివిని నీవు సనుదెంచి విచారించుటయు, సతఁడీరమణీమణిమునీంద్రునింజంపెనని యసత్యంబైననేరంబుంబూన్చినీతోఁడఁ జెప్పుటయు, నతనివాక్యంబులు సత్యంబులనిభావించియుధర్మపవర్తనంబునకువెఱచినిర్దోషియైనయీసాధ్వీరత్నమును దోషింగానెంచినీవుసంహరింపఁబూనుటయు, నిత్యాదివిషయములునీవెఱింగినవియ, మీయిరువురిచిత్తశుద్ధియుంబరిశీలింపఁదలంచినేనిట్టికపటనాటకంబుఁబ్రదర్శింపందలంచి సాంతంబుగానిర్వహించితి. విజయాశ్వనృపాలా! నీవుధర్మస్వరూపుఁడవు సత్యసంధుండవు దయాశాలివి శాంతచిత్తుండవు నిన్నుసామాన్యునింగాఁదలంపరాదు. ఈవనితామణికిసమానమైన సాధ్వీమణుల్లోకములయందునుఁగలుగదు. సద్గుణగణమతల్లియు, జగద్వందితపరిశుద్ధచరిత్రయునైనయీమెయందెపుడును నెట్టికళంకంబును గలుగనేరదు, మిమ్ము మెచ్చిసర్వవిధంబులను శుభంబులొందింపనెంచితిఁగావున, 216

క. నరవరమీకున్వలసిన । వరములొసంగెదనుశంక - వలదనుచు ముని
త్వరముగనుడుటయుమునితోఁ । బరమానందంబునొందె - భక్తివరిష్ఠున్. 217

ఉ. పాణియుగంబుమోడ్చినిజ - ఫాలతలంబునఁజేర్చిదీనసం
త్రాణనమోన్నమోసకల - తాపవిదారణమోన్నమోజగ
త్త్రాణనమోన్నమోపరమ - పావనరూపనమోన్నమోఖల
క్షీణనమోస్తువంచునుతిఁ - జేసినమస్కృతిసల్పిరాజుతాన్. 218

ఉ. ఓగజరక్షకా! పరమ - యోగులకైననుఁదోఁచనట్టినీ
యాగమవేద్యమూర్తిఁగను - నంతటిభాగ్యము గల్గినంత నా
లోఁగుది కొన్నకోరికలు - లోపములేక ఫలించెసద్గతిన్
వేగనొసంగవేవరద - వేఁడితినన్యమునొల్లనెద్దియున్. 219

క. ఈవరము దక్కవలఁదిఁక । యేవరమునటంచు మాన - వేంద్రుఁడడిగినన్
దావినివారియిట్లనియెద । యావిలసితమతినిమంద - హాసముసనరన్. 220

క. సంతోషించితినవనీ । కాంత ! భవద్వాంఛయిపుడు - గలుగదు నుమి ! ని
శ్చింతనిఁకఁ గొన్నినాళులు । కాంతిగరాజ్యంబునేలఁ - గావలయుభువిన్. 221

క. అటుపిమ్మటపద్ధతిఁజెం । దుటకర్హుఁడవగుదువింత - తొందరపడ నే
మిటికదిమీఁదటఁగలుగును । దిటవుగనీకీర్తిమించు - దిగ్దేశములన్. 222

క. ఇంకనువలసినవరముల । శంకింపక వేఁడుమనిన - సంభ్రమమునయా
పంకజదళలోచనుఁడగు । శంకరనుతుకరుణకలరి - జనపతిమగలన్. 223

మ. అమితస్వాంతుననంతునింబొగడిసా - ష్టాంగంబుగాఁదాఁబ్రణా
మముఁగావించిపరేశ ! యట్లయిన స - న్మార్గంబునన్బుద్ధిని
త్యమువర్తిల్లననుగ్రహించియొక పు - ణ్యాపస్తుఁడౌపుత్రువం
శమువర్ధిల్లనొసంగవేయనుచు వాం - ఛం జెందిప్రార్థించినన్. 224

చ. అతనిమురాసురారిసద - యామృతదృష్టులఁగాంచిపల్కెనో
క్షితవర ! నీకుపుత్త్రులనుఁ - జెందెడియోగములేదునమ్ముగా
శతధృతినిర్ణయంబిది వి - చారముఁజెందకుమింకసద్గుణ
ప్రతతినిమించియొప్పుసుత - భవ్యచరిత్రనుకూతునిచ్చితిన్. 225

ఉ. అంకిలిలేకసత్యపథ - మాత్మఁదొలంగక ధర్మమొప్పఁగా
నింకనుఁగొన్నినాళ్లవని - నేలిజనంబులుమెచ్చసత్క్రియల్
గొంకకొనర్చిసాధుబుధ - కోటులరక్షణఁజేసియంతపైఁ
జొంక మెలర్పుమోక్షమునుఁ - బొందెదవీవుసతీయుతంబుగన్. 226

ఆ. పరమసాధ్వియైన - భవదీయపత్నినిఁ । గడుఁబవిత్రచరితఁ - గాఁదలంచి
మున్నువోలెఁ దెప్పు - డెన్నకచేపట్టి । రాజ్యమేలుమయ్య - రాజచంద్ర ! 227

వ. మఱియొక్కవిశేషంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 228

గ. ముదమొదవంగ నీచరిత - మున్ బ్రియమొప్పఁగ నెవ్వరుర్విలోఁ
జదివినవిన్న నాయువును - శాశ్వతకీర్తియు పుత్రపౌత్రసం
పదయును భోగభాగ్యములుఁ - బన్నుగఁబొంది సుఖించియంత మ
త్పదనముఁ జేరనేర్తురిది - సత్యముసత్యము మానవేశ్వరా ! 229

క. అనుచు రమాగమణీపతి । జనపతికాసతి యొసంగెఁ - జల్లనవర్షిం
చెను పుష్పవర్షమంబర । మునమండి సుపర్వసమితి - ముదమొందెఁగడున్. 230

ఉ. చల్లఁగవీచె మారుతము - శాంతివహించిరి సజ్జనుల్ లస
త్పల్లవితంబులుంగుసుమి - తంబులునయ్యెను భూజముల్ విరా
జిల్లెను దిక్కులన్నియును - సింధువులెంతయుఁ బొంగె జీవకో
ట్లెల్ల ముదంబుఁ జెందెనుతి - యించిరి సిద్ధులుపారికాంక్షులున్. 231

ఆ. ఆడిరప్సరసలు - పాడిరిగంధర్వు । లమరకోటిజయ జ - యధ్వనులు సె
లంగె నారదుండు - పొంగిగంతులువైచెఁ । బొగడెఁజాలహరిని - భూవిభుండు. 232

క. తనరయశోవతిభక్తిం । దనశక్తికొలందిఁబొగడెఁ - దామరసాక్షున్
వినుతమహాశుభవక్షున్ । కనకాంబరుసుజనపక్షు - గజసంరక్షున్. 233

వ. తత్సమయంబునఁ గ్రొక్కారుమెఱుంగునుంబోలె దిగ్గున నొకయద్భుతకాంతి తోఁచె నంతట.

సీ. దిశలెల్ల వెలిఁగించు - దివ్యతేజముతోడ - రమణీయభర్మాంబ - రంబుతోడ
శంఖచక్రగదాది - సాధనంబులతోడ - దంబైనమణికిరీ-టంబుతోడ
వాహనంబైనట్టి - వైనతేయునితోడ - రాజిల్లుభార్గవీ - రమణితోడ
చెంగటఁగల సుర - జ్యేష్ఠాత్మజునితోడ - పరివారపరిగ్రహ - ప్రతతితోడ

గీ. యచ్చటివిజయాశ్వ నృపతియు-సతనిసతియు । వింతపడిచూచుచుండఁ బృ-థ్వీధరుండు
వేదవేద్యుండు వైకుంఠ-విభుఁడజుండు । దిచ్చుమొగమయ్యె మోదంబు-దీటుకొనఁగ. 235

క. కలహాసుఁదురమేశుని । విలసితకరుణా సమృద్ధి - వీక్షించిమదిన్
దలఁచినుతియించి భక్తిన్ । వెలయఁగసేవించిచాల - వేసకమిాఁజన్. 236

వ. అనుజ్ఞఁగొని నిజేచ్ఛంజనుచుండి యాత్మగతంబున. 237

చ. తొడరి సురాసురాంతకుని - తో విజయాశ్వనరేంద్రు సుస్థఘన్
నుడివితినాలకించెను వి - నోదముగానతఁడంతె కాదుతాఁ

జడిముడి పెట్టి భూవిభుని - శీలమెఱుంగఁ దలంచి యప్పుడే
వెడలెను మాయవేషమున - వెంట నెవోయితి నేను నుంగనన్. 238

ఆ. తలఁచుకొనననగవు - దట్టైడునటుపోయి | చేయనలసినంతఁ - జేసినాఁడ
మిరువురమునుతుదను - నరపతిగుణములు | మెచ్చివరమునిచ్చె - లచ్చిమగఁడు. 239

క. ఇది నా నేరుపు కాదా? | పదిలంబుగ నెప్పుడునిట్టి - పనులకు నెపముల్
వెదకుచు నావ్రతమిట్టిద | కద, కడఁకఁ ఫలించెఁ దృప్తి - గలిగెన్ మనకిన్. 240

ఉ. మూఁడు జగంబులందును - మున్ను వినంబడనట్టిదై నయీ
వేడుకమించు సత్కథను - విన్న జనుల్ తను మెచ్చి చాలఁగాఁ
బ్రోడలు నారదుండనరె? - భోగిశయాను నుతింపకుందురే?
యాడినఁ దప్పనట్టివిమ - లాత్ముఁడు గాంచు సమస్తసౌఖ్యముల్ 241

క. అనితలపోయుచు గానం | బునుఁ జేయు మహారి నిమదినిఁ - బొగడు మస్తకస్థం
బొనరించుచు మీఁదటియో | జనఁ గావింపుచు సతండు - సనియెను నిజేచ్ఛన్. 242

క. అంతట ధాత్రీపతి నిజ | కాంతాయుతుఁడై గమేశుఁ - గరుణాకరు స
ర్వాంతర్యామినిఁ బొగడుచు | చింతలు మది విడిచి తుష్టిఁ - జెందె వెలయఁగన్. 243

క. హరియానతి లాగునఁ దాఁ | బరమానందమున రాజ్య - భారము నూనెన్
సరపతులు పొగడఁ దొల్లిటి | కరణిన్ భోగంబులెల్లఁ - గనెలునొసంగన్. 244

క. జనులకు మిక్కిలి సుఖమగు | వినుతక్రమవిధులు దెలిసి - విజయాశ్వుఁడు రా
మునివలె ధర్మంబుగ మిం | చిన కడిమిని రాజ్యమేలెఁ - జిరవత్సరముల్. 245

క. గురుదేవతాధరిత్రీ | సురులం దాభక్తిఁ గొలుచు - చుండె హరిమహో
త్సవములు పెక్కులొనర్చెన్ | స్థిరముగ నిజకీర్తి సకల - దిక్కుల నెగయన్. 246

క. అనుపమమగు నీసత్కథ | వినినఁ జదివినను నిత్య - విభవము లొదవున్
దనరినకష్టములడఁగుం | గనకాంబరుఁడిచ్చునెల్ల - కామ్యార్థంబుల్. 247

క. అని విజయాశ్వచరిత్రం | బును సూతుఁడు శౌనకాది - మునులకు వినిపిం
చిన విని నారలు ముదమున | వినుతించిరి | మొనసి పెక్కు - విధముల నతనిన్. 248

క. విశ్వధరాంబుధిశశిహరి | దశ్వులు దారకములుండు - నంతటి దనుకన్
శాశ్వతమై యీ సత్కృతి | విశ్వంబుల వెలయుఁగాత - వినుతంబగుచున్. 249

శా. లోకారాధ్య! యభేద్యశక్తియుత! ని - ర్లోపప్రభావాన్వితా!
పాకారిప్రముఖామరప్రియకరా! - పద్మామనోనాథ! సు
శ్లోకా! వేంకటశైలవాస! సుజన - స్తోమావనా! పావనా
స్తోకానందమయస్వరూప! గుణసం - దోహాశ్రయా! సుస్థిరా! 250

క. గాంగేయాంశుకశోభిత ! ! గాంగేయాకూపారసదృశ - కపిప్రముఖనుతా !
సంగీతప్రియ ! మాయా ! సంగీ ! తత్వప్రధాన ! సత్యనిధానా ! 251

కృతికర్తృనామగర్భితరథబంధము.

క. శ్రీగోపికావియచ్చర ! యోగీంద్రాశ్రయ ! పరోరు - హోదర ! రవితే
జా ! గజరాజవినుత ! పు ! ణ్యా ! గతతాపా ! యనూన - నామ ! నమస్తే ! 252

మంగళమహాశ్రీవృత్తము.

సుందరశుభాంగ ! పరి - శుద్ధ ! సనకాదిముని - శోధితచరిత్ర ! సురలోకా
నంద! ముచుకుందనుత - నామ! కరుణాకర! స - నాతన! శుభస్కర ! వివేకా
మందగుణబృందయుత! మందరనగోద్ధరణ! - మంజులకలాప! వరదా! శ్రీ
మందిర! జనార్దన! సమస్తసుఖపూర్ణ! పర - మప్రవణ! మంగళమహాశ్రీ.

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహాత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహాఖ్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబున తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



Printed at The India Printing Works, Madras.

# శుద్ధపత్రిక.

| పుట సంఖ్య. | పద్యసంఖ్య. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 3 | 14 | 3 | త్నైరిము | స్నైరిమి |
| 10 | 78 | 1 | ఆప | ఆద |
| 16 | 137 | 2 | లగ | గల |
| 34 | 12 | 1 | మీద | మీఁద |
| 36 | 32 | 2 | ఫలములఁ | ఫలములు |
| 36 | 35 | 2 | గధనైు | రధనైు |
| 38 | 58 | 1 | [షట్పది] | [పంచపాది] |
| 40 | 77 | 1 | మ్మారితి | మ్మారీతి |
| 41 | 84 | 4 | డెలియఁగఁలేక | దెలియఁగ లేక |
| 41 | 88 | 2 | కదించెదన్ | కరించెదన్ |
| 41 | 89 | 3 | వెల్లబోయి | వెల్లఁబోయి |
| 42 | 98 | 3 | ముకుగము | ముకుగముఁ |
| 42 | 100 | 5 | కనుల | గనుల |
| 42 | 101 | 4 | సెగాము ద్రిప్పు | మోముఁ ద్రిప్పు |
| 43 | 104 | 4 | తోచెన్ | తోఁచెన్ |
| 43 | 110 | 1 | ఇవుపుగము | ఇరుపుగము |
| 44 | 112 | 2 | దొడిగి | ఁదొడిగి |
| 44 | 112 | 7 | దమిని | దమినిఁ |
| 44 | 113 | 6 | గోచె | దోఁచె |
| 44 | 114 | 2 | పొన్పు | పొన్పుఁ |
| 45 | 122 | 1 | నోఁదు | నొందు |
| 46 | 127 | 1 | సమాగంబు | సమాగమంబు |
| 46 | 128 | 3 | దాని | దానిఁ |
| 46 | 128 | 4 | చాన | జాన |
| 47 | 132 | 3 | నుండగన్గొని | నుండఁగన్గొని |
| 64 | 59 | 3 | జీవేసురూపంబు | జీవేశ్వరుండున్నఁ |
| 84 | 118 | 5 | యుదంచలబంతియు | యుదంచితంబఁతయు |
| 117 | 67 | 3 | సజ్జలోచన | సజ్జలోచన |
| 127 | 164 | 2 | రజనీచరాస్య | రజనీవరాస్య |
| 130 | 194 | 1 | దైగ్యం | సైగ్యం |

| పుట సంఖ్య. | పద్య సంఖ్య | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 144 | 41 | 2 | జాల డెన్నఁగా | జాలఁ డెన్నఁగా |
| ,, | ,, | 4 | జతుఁరుఁడు | జతురుఁడు |
| ,, | ,, | ,, | ద్రైగ్య | ధైర్య |
| 148 | 86 | 2 | యనుమంగొని | యనుమతింగొని |
| 150 | 99 | 2 | యాజ్ఞ | యాచ్ఞ |
| 155 | 161 | 1 | సౌదర్యవతి | సౌఁదర్యవతి |
| 157 | 175 | 2 | కొమ్మ్రటిని | కొమ్మ్రటని |
| 163 | 246 | 1 | వృధా | పృథా |
| 170 | 16 | 1 | గ్రైకొని | గై కొని |
| 184 | 172 | 4 | వన్నియుు | వన్నియ |
| 206 | 405 | 2 | ఘోరంబక | ఘోరంబకఁగా |
| 207 | 416 | 1 | గదప్పగ లేమిఁ | దప్పఁగ లేమిఁ |
| 227 | 184 | 1 | శౌగ్యసుగ్యం | శౌర్యధుర్యం |
| 235 | 253 | 2 | చుకుఁదనుత | మూచికుందనుత |